శ్రీరస్తు

# రెడ్డికుల నిర్ణయ చంద్రిక

## (క్షత్రియ కుల దర్పణము)



దోమకొండ రాజదుర్గం



విజ్ఞాన సరోవర ప్రచురణలు

హైదరాబాద్ - ఆంధ్రప్రదేశ్



దోమకొండ సంస్థానాధిపతులు
శ్రీమంతు రాజా రాజేశ్వరరావు
బహద్దురువర్మ
1927

SCANNED

# రెడ్డికుల నిర్ణయ చంద్రిక

(క్షత్రియ కులదర్పణము)

గ్రంథకర్తలు : 1. శ్రీమాన్ శేషాద్రిరమణ కవులు, శతావధానులు

2. శ్రీమాన్ పెద్దమందడి వేంకటకృష్ణకవి

ముఖచిత్రం : దోమకొండ కోట

ప్రథమముద్రణ : 1927 (గోలకొండ ముద్రాక్షరశాల, హైదరాబాదు దక్కన్)

ద్వితీయముద్రణ : 2003 ఆగష్టు

ప్రతులు : 1000

ప్రాప్తిస్థానం : కొండా లక్ష్మీకాంతరెడ్డి
విజ్ఞాన సరోవర ప్రచురణలు
ప్లాట్ నెం. 103, సెకండ్ ఫ్లోర్, 2-2-18/31/సి
సాయికృష్ణ నిలయం
దుర్గాబాయి దేశ్‌ముఖ్ కాలని,
హైదరాబాదు - 500 013 (ఆం.ప్ర)
ఫోన్ : 27427920

మూల్యం : రూ॥ 100/-

C 7512

ముద్రణ :
కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్,
విద్యానగర్,
హైదరాబాదు.
ఫోన్ : 27618261, 27653348



(మొదటి ప్రచురణ ఇన్నర్ - 1)

శ్రీరస్తు

# రెడ్డికుల నిర్ణయ చంద్రిక

గ్రంథకర్తలు :

శ్రీమాన్ శేషాద్రిరమణ కవులు, శతావధానులు
శ్రీమాన్ పెద్దమందడి వేంకటకృష్ణకవి

బ్రహ్మశ్రీ కావ్యకంఠ గణపతిశాస్త్రి గారిచే పరిశోధింపబడి
శ్రీశ్రీశ్రీ దోమకొండ సంస్థానాధీశులగు
రాజారాజేశ్వరరావు బహద్దరుగారిచే

గోలకొండ ముద్రాక్షరశాల యందు
ముద్రింపబడెను.

హైదరాబాద్ (దక్కన్)
1927

( మొదటి ప్రచురణ టైటిల్ )

శ్రీ

# రెడ్డికుల నిర్ణయ చంద్రిక

నామాంతరము

క్షత్రియ కులదర్పణము

ఇది

**శ్రీ మంతు రాజా రాజేశ్వరరావు**

**బహద్దురు వర్మ**

వాలియె సంస్థాన్ దోమకొండ గారి

ఆజ్ఞానుసారము

శ్రీమాన్ శేషాద్రిరమణకవులు శతావధానులు

శ్రీమాన్ పెద్దమందడి వేంకటకృష్ణ కవి

మొదలగు వారలచే రచియింపఁబడి

మహాముని కావ్యకంఠ బిరుదాంకితులగు

బ్రహ్మశ్రీ అయ్యల సోమయాజుల గణపతిశాస్త్రిగారిచే(

బరిశోధింపఁబడి

గోలకొండ ముద్రాక్షర శాలయందు ముద్రింపఁబడియె

హైద్రాబాదు (దక్కన్)

వెల ౧-౪-౦ ౧౯౨౮

(మొదటి ప్రచురణ టైటిల్ - 2)

# త్వరలో వెలువడును

# గయోపాఖ్యానము

(ద్విపద కావ్యము)

**నాదెండ్లగోపప్రధానికృతము**

ఇది ప్రాచీనకవికృతము. ఉత్తమకావ్యము. త్వరలో వెలువడనున్నది.

మేనేజర్

గోలకొండ ముద్రాక్షరశాల

హైద్రాబాదు

- - - - -

**గోలకొండ సంచిక**

- - - - -

అనేక చిత్రపటములతో శోభిల్లును.

అనేక ప్రసిద్ధ పండితుల వ్యాసములతో పద్యములతో నిండియుండును.

౧౫౦ పుటలకు తక్కువగా నుండదు.

గోలకొండ పత్రిక చందాదారులకు ౧౦ అణాలకే దొఱకును.

ఇతరులకు ౨ రూపాయిలు.

చందాదారులకిది చాలా మంచితరుణము, ఇంక ౫ మాసములకు గోలకొండ పత్రిక యొక్క మూడవ సంవత్సరారంభమున వెలువడును. ప్రకటనలు పంపువారిప్పుడే పంపి లాభము పొందుడు.

**మేనేజర్, గోలకొండ పత్రిక.**

( మొదటి ప్రచురణ టైటిల్ - 3 )

# గోలకొండ ముద్రాక్షర శాల

తెనుగు, ఇంగ్లీషు, ఉర్దూ భాషలలో అన్ని విధములగు అచ్చు పనులు సరసమైన ధరలకు చేయబడును. మా ముద్రాయంత్రము ఎలక్ట్రిక్ శక్తిచే నడుపబడుచున్నది. ఇందు అచ్చుపనులు అందముగా చేయబడును. రేట్ల విశేషము తెలిసికొనగోరువారు ఈ క్రింది విలాసమునకు వ్రాసి తెలిసికొనుడు.

ఇట్లు
మేనేజరు
గోలకొండ ముద్రాక్షరశాల
తూర్పుబజారు
దక్షిణ హైద్రాబాదు

(మొదటి ప్రచురణ టైటిల్ - 4 )



# గోలకొండ పత్రిక

**ప్రతి బుధవారము, శనివారము ప్రకటింపబడును.**

- - - - -

**ఆంధ్రదేశ మండలి మొదటి అర్ధవారపత్రిక**

- - - - -

ఇందు పండితులచే వ్రాయబడిన వాఙ్మయ, చారిత్రిక, వ్యవసాయ వ్యాసములును, స్థానిక స్వదేశ, విదేశ వార్తలును, బజారు ధరలును, ప్రహసనములును, చిన్న కథలును వేయేల ఆంధ్ర భాషాభివృద్ధికిని, దేశాభివృద్ధికిని అవసరమగు విషయము లన్నియు ప్రకటింపబడును. ప్రతి ఆంధ్రుడును పఠింపదగినది. సంవత్సర చందా రు. ౬-0-0 మాత్రమే. అర్ధ సంవత్సర చందా ౩-౧౨-౦ మాదిరి పత్రిక ఉచితము.

మా పత్రికకు నిజాం రాష్ట్రమందేకాక బ్రిటిష్ ప్రాంతము నందు విశేష ప్రచారము గలదు. కాన ఇందు ప్రకటనలు వేయించువారు లాభము పొందగలరు. ప్రకటన రేట్లు చౌకగ నిర్ణయింపబడినవి. వలయువారు మేనేజరుకు వ్రాసి ప్రకటన రేట్లును, మాదిరి పత్రికయును తెప్పించు కొనవలయును.

**సురవరము ప్రతాపరెడ్డి**
**సంపాదకుడు**

**గోలకొండ పత్రిక,**
**త్రూపు బజారు, హైద్రాబాదు**

# ప్రచురణ దాతలు - వదాన్యులు



## శ్రీ తీరుపల్లి రాంరెడ్డి దంపతులు

**ప్రేరణ:-** నాటి నైజాం రాష్ట్రంలో విద్యావికాసం నిమిత్తం స్వచ్ఛందంగా అపూర్వ కృషి చేసిన వారు శ్రీ గంగుల శాయిరెడ్డి గారు. వారి ప్రోత్సాహం కారణంగా 1937లో భువనగిరిలో అప్పుడే స్థాపించిన రెడ్డి హాస్టల్లో ప్రప్రథమ విద్యార్థిగా చేరినవారు శ్రీ తీరుపల్లి రాంరెడ్డిగారు. వారిని చేర్చినవారు శ్రీ శాయి రెడ్డిగారే. ప్రాథమిక విద్య, ప్రాథమికోన్నత విద్య భువనగిరిలోనే 7వ తరగతి వరకు పూర్తిచేయడం వెనుక శ్రీ శాయిరెడ్డిగారి ప్రోత్సాహం, వారి బోధనలే దోహదం చేశాయంటారు శ్రీ రెడ్డిగారు. వారి కాపుబిడ్డ, వర్షయోగం, అనేక తెలుగు వాచక గ్రంథాలు ఎందరినో విజ్ఞాన సంపన్నులను చేశాయనీ, శ్రీ శాయిరెడ్డి గారి జీవితాన్ని ఆదర్శంగా గ్రహించి తాము ఎంతో ఎదిగామన్నారు.

**స్వస్థలం:-** రెడ్డికుల నిర్ణయ చంద్రిక గ్రంథ ప్రచురణకు విశేషంగా సహకరించిన శ్రీ తీరుపల్లి రాంరెడ్డిగారు బాల్యం నుంచే విశిష్ట వ్యక్తిత్వం కలవారు. వారి స్వగ్రామం గొలనకొండ. ఇది నల్లగొండ జిల్లాలోని ఆలేరు మండలంలో ఉంది. శ్రీ రాంరెడ్డి గారి తల్లి శ్రీమతి రాజమ్మ, తండ్రి శ్రీబాల్‌రెడ్డి. నాయనమ్మ శ్రీమతి బాలమ్మ, తాత శ్రీ తీరుపల్లి మల్లారెడ్డిగారు. శ్రీ రాంరెడ్డిగారు 1925 మే 15వ తేదీన జన్మించారు.

నాటి గ్రామీణ జీవితం, నిజాం రాజ్యంలో వ్యవసాయం, వ్యవసాయదారులు, వారి కుటుంబాల్లో విద్య, చాల కష్టంగానే ఉండేది. శ్రీ రాంరెడ్డిగారు నాల్గవ తరగతిలో చేరిన రెండు నెలలకే వారి తండ్రి శ్రీ బాల్‌రెడ్డిగారు పరమపదించారు. అంతకు పూర్వమే వారి మాతృమూర్తి శ్రీమతి రాజమ్మగారు శ్రీ రెడ్డిగారు 4 సం॥ల వయస్సులో ఉన్నప్పుడే స్వర్గస్థులయ్యారు. వారి చిన్నాన్నలు కీ॥శే॥ శ్రీ తీరుపల్లి నారాయణరెడ్డి గారు, కీ॥శే॥ శ్రీ లింగారెడ్డి గారు, అన్నలు కీ॥శే॥ శ్రీ నర్సింహారెడ్డి గారు, కీ॥శే॥ శ్రీ కృష్ణారెడ్డి

గారు, వారి చదువు నిరాటంకంగా కొనసాగే దోహద క్రియలెన్నో చేశారు. భువనగిరిలోనూ ఆ తర్వాత కూడా వారి ప్రోత్సాహం– సహకారం నిరంతరం శ్రీరాంరెడ్డి గారికి అందింది.

**హైదరాబాదులో చదువు:–** 7వ తరగతి పూర్తయిన తర్వాత చదువు నిమిత్తం హైదరాబాదు వచ్చారు. మొదటి సం॥ చదువు పూర్తయిన తర్వాత రెడ్డి హాస్టలులో చేరారు. 10వ తరగతి వరకు ఆ విధంగా అధ్యయనం పూర్తి అయింది.

ఆ తర్వాత వారు ఇంజనీరింగ్‌లో డిప్లొమా చేశారు. 1949లో డిప్లొమా పూర్తయింది. వెంటనే సబ్ వోవర్సియర్‌గా ప్రభుత్వోద్యోగం లభించింది. అప్పటి నుండి వరుసగా ప్రభుత్వవ్యవస్థలో సేవలందిస్తూ, అనేక ఉద్యోగ బాధ్యతలను నిర్వహిస్తూ 1983 వరకు పనిచేశారు. ఇరిగేషన్ డిపార్టుమెంటు నుండి 1983లో డిప్యూటీ ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్‌గా పదవీ విరమణ చేశారు.

**వివిధ ప్రదేశాల్లో:–** ఉద్యోగ బాధ్యతలు నిర్వర్తిస్తూ నిజాంసాగర్‌లో, నాగార్జున సాగర్‌లో, ఎస్. ఆర్.సిలో ప్రాజెక్టులకు సంబంధించిన అనేక కార్యక్రమాల్లో బాధ్యతాయుతంగా పనిచేసి మంచిపేరు తెచ్చుకున్నారు. ఉద్యోగ బాధ్యతల నిర్వహణలో నల్లగొండ, నిజామాబాదు, ఆదిలాబాదు, కరీంనగర్, హైదరాబాదు నగరాల్లో తమ సేవలందించి విశిష్ట కీర్తి నార్జించారు.

**సేవాధర్మం:–** ఉద్యోగం చేసే సందర్భంలోనే వారు అప్పుడప్పుడు శ్రీ గంగుల శాయి రెడ్డి గారి కుటుంబం స్థితిగతులు తెలుసుకుంటున్నారు. శ్రీ శాయి రెడ్డిగారి ముగ్గురు పుత్రుల వ్యావసాయిక జీవనం తెలుస్తూనే ఉన్నది. శ్రీ శాయి రెడ్డి గారి స్వగ్రామం రామచంద్ర గూడెం; దగ్గరనే జీడికల్లుంది. జీడికల్లు రామాలయ పునరుద్ధరణ వికాసంలో శ్రీ శాయిరెడ్డి గారెంతో కృషిచేశారు. శ్రీ రాంరెడ్డి గారి వ్యక్తిత్వ నిర్మాణానికి ఆధారంగా నిలిచిన వారు శ్రీ శాయిరెడ్డి. అందువల్ల వారి కుటుంబంపై శ్రీ రాంరెడ్డి గారికి తమకున్న ఆదరాభిమానాలను ప్రకటించుకొనే అవకాశం చిక్కింది. వారి పుత్రుల నిమిత్తమే ఒక లక్షా ఎనిమిదివేల రూ॥లు పోస్టాఫీసులో వేసి దానిపై వచ్చే వడ్డీ వారికి నెలనెలా అందేవిధంగా చేశారు. ఇది గురుభక్తితో సమర్పించే చిన్న కానుకగానే వారు భావించారు.

పదవీ విరమణ తరువాత నిరుపేదలకు అర్హులైన, సమర్థులైన విద్యార్థులకు ఉపకరించే విధంగా ఎన్నో సహాయ సహకారాలు అందించారు. స్ఫూర్తి అనే స్వచ్ఛంద సేవా సంస్థకు ఒక లక్ష రూపాయలు విరాళమిచ్చారు. ఈ లక్ష రూపాయలపై వచ్చే వడ్డీతో ఇద్దరు వైద్య విద్యార్థులకు ఉపకార వేతనాలు అందించే ఏర్పాటు చేశారు. వారి నాయనమ్మ శ్రీమతి బాలమ్మ, తాత శ్రీ మల్లారెడ్డి గారి పేరిట ఒక లక్ష రూపాయలు, తల్లిదండ్రులు శ్రీమతి రాజమ్మ, శ్రీ బాల్‌రెడ్డి గారల పేరిట ఒక లక్ష రూపాయలు, వారి నాలుగవ పుత్రిక కీ॥శే॥ డా. శోభగారి పేరిట 10 వేల రూపాయలు, మొత్తం 2 లక్షల 10 వేల రూపాయలు రెడ్డి హాస్టల్‌లోని పేద విద్యార్థులకు ఉపకార వేతనం అందే విధంగా డిపాజిట్ చేశారు. ఏ విద్యార్థి అయినా ఆర్థికంగా చదువులో వెనుకబడరాదని శ్రీ రెడ్డి గారి ఆశయం. ఆ ఆశయం వారి కుమారుని సంస్మరణలోను కనిపిస్తున్నది.

# కీ.శే.డా॥ టి. మహేంద్రరెడ్డి గారి సంస్మరణార్థం



డాక్టరుగా సమాజానికి సేవ లందిస్తున్న వారి కుమారులు డా॥ టి. మహేంద్ర రెడ్డి గారు 46 సం॥రాల చిన్న వయసులో పరమపదించారు. వారి జ్ఞాపకార్థం తమ స్వగ్రామమైన గొలన కొండ ఉన్నత పాఠశాలలో 10వ తరగతి లో ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానాలు పొందిన విద్యార్థులకు నగదు బహుమతులు అంద చేస్తున్నారు. ఇప్పుడు ఈ గ్రంథ ప్రచురణకు సహాయ సహకారాలు అందించారు.

డా॥ టి. మహేంద్రరెడ్డి గారు హైదరాబాదులో ఎం.బి.బి.ఎస్ చదివారు. 1980లో వారి వైద్య విద్య పూర్తయింది. హైదరాబాదులో రెండునెలలు అసిస్టెంట్ సివిల్ సర్జన్‌గా చేశారు. ఆ తర్వాత ఇరాన్‌లో మినిస్ట్రీ ఆఫ్ హెల్త్‌లో డాక్టరుగా పని చేశారు. 1983 నుంచి 1993 వరకు వారు అక్కడ వైద్య సేవలందించారు. ఆ తర్వాత భారత్‌కు తిరిగి వచ్చారు. 1953 ఏప్రిల్ 11నాడు జన్మించిన డా॥ మహేంద్రరెడ్డి 1999 ఫిబ్రవరి 28న పరమ పదించారు. వైద్య సేవలందిస్తూ, ఇంకా ఎంతో భవిష్యత్తు ఉన్న చెట్టంత కొడుకు గతించడం కుటుంబంలో విషాద వాతావరణాన్ని నింపింది. కీ.శే. డా॥ మహేంద్రరెడ్డి గారి అమ్మాయి దీప్తి ఇంజనీరింగ్ ఫైనలియర్లో వుంది. అబ్బాయి గిరీశ్ అమెరికాలోని హైస్కూల్‌లో చదువుతున్నాడు.

శ్రీ రాంరెడ్డిగారిది నిండుకుటుంబం. పెద్దమ్మాయి శ్రీమతి అరుణ; ఆమె భర్త భూపాల్‌రెడ్డి న్యాయవాది. రెండో అమ్మాయి శ్రీమతి సుగుణ; వారి భర్త శ్రీ ఎన్. వెంకటరెడ్డి. బి.హెచ్.ఇ.ఎల్ లో మేనేజర్‌గా పనిచేసి ఈ మధ్యనే స్వచ్ఛంద పదవీ విరమణ చేశారు. మూడో అమ్మాయి శ్రీమతి విజయ; భర్త శ్రీ వై. నరేంద్రారెడ్డి ఎలక్ట్రిసిటీ బోర్డులో డి.ఇ గా సేవలందిస్తున్నారు. నాల్గో అమ్మాయి కీ.శే. డా॥శోభ గారి గురించి చెప్పుకొన్నాం. అయిదో అమ్మాయి డా॥ జయ; కీ.శే॥ స్క్వాడ్రన్ లీడర్ పి. విద్యాసాగర్ రెడ్డి గారి ధర్మపత్ని. ఆమె అసిస్టెంట్ సివిల్ సర్జన్‌గా ఉద్యోగ బాధ్యతలు నిర్వహిస్తున్నారు.

కర్షక కుటుంబంలో జన్మించిన శ్రీ తీరుపల్లి రాంరెడ్డిగారు ప్రస్తుతం పదవీ విరమణ చేసినా, అనేక సేవా, ధార్మిక, సాంస్కృతిక కార్యక్రమాల వికాసం ద్వారా, సమాజంలో సాంస్కృతిక మానవుల నిర్మాణం సాధ్యమవుతుందని భావిస్తూ, అటు తమ గ్రామంలోని పాఠశాలకు, ఇటు రెడ్డి హాస్టల్ విద్యార్థులకు తమవైన సేవలందిస్తున్న సహృదయులు. వారి సహకారంతో కీ॥శే॥ డా. టి. మహేంద్రరెడ్డి గారి జ్ఞాపకార్థం ఈ చారిత్రక విశ్లేషణ గ్రంథం ప్రచురిస్తున్నాం. ఈ సందర్భంగా వారికి వారి కుటంబ సభ్యులందరికీ మా విజ్ఞాన సరోవర ప్రచురణల పక్షాన ధన్యవాదాలు సమర్పిస్తున్నాం.

– ప్రకాశకులు . . విజ్ఞాన సరోవర ప్రచురణలు, హైదరాబాద్

# విజ్ఞానసరోవర ప్రచురణల ముఖ్య వదాన్యులు



సేవాతత్పరులు డా॥ కొండా లక్ష్మారెడ్డి

డా॥ కొండా లక్ష్మారెడ్డిగారు ఆంధ్రప్రదేశ్ పూర్వఉపముఖ్యమంత్రి శ్రీ కె.వి. రంగారెడ్డి, తుంగభద్రమ్మల పుత్రులు. వారు 1937 మే, 19వ తేదీన జన్మించారు. శ్రీరెడ్డిగారు శ్రమయే దైవంగా నమ్మి పరిశ్రమించేవారు. వారు కాకినాడ రంగనాయక మెడికల్ కళాశాలలో ఎం.బి.బి.ఎస్. పూర్తి చేశారు. మెడిసిన్ పూర్తి చేసిన తర్వాత కొన్నాళ్లు కాకతీయ మెడికల్ కళాశాలలో ఉపన్యాసకులుగా పనిచేశారు. ఆ తరువాత యు.కె.లోనూ, కెనడాలోనూ వైద్య సేవలందించారు. తరువాత అమెరికాలో కొంతకాలం గ్రామీణ ప్రాంతంలోని ప్రజలను ఉత్తమ సేవలందించారు. భారతదేశానికి వచ్చినప్పుడు ఇక్కడి ప్రజలకి వైద్య సేవలందిస్తున్నారు.

కీ.శే. డా॥ సుభాషిణి వీరి ధర్మపత్ని. విజ్ఞానసరోవర ప్రచురణల మాధ్యంగా ప్రతి సం॥ శ్రీమతి సుభాషిణిగారి సంస్మరణార్థం నిరుపేద విద్యార్థినీ విద్యార్థులకు ఆర్థిక సహాయం అందజేస్తున్నారు. విజ్ఞానసరోవర ప్రచురణలకు వారి ఉదారసహాయం అందుతూనే ఉంది. ఈ ప్రచురణల ద్వారా ప్రజల్లోకి వినూత్న విషయాలు వెళ్లాలనే వారి ఆలోచనకు క్రియాశీలరూపంగా ఈ గ్రంథాలు వస్తున్నాయి. రెడ్డిరాజ్య సర్వస్వం నుండి గోలకొండ కవుల సంచిక వరకు, కె.వి. రంగారెడ్డి స్వీయచరిత్ర, ఈ ప్రచురణ వరకు కూడా వారి సహకారం అందుతూనే ఉంది.

వైద్య సేవలందిస్తూనే వారు అరవిందుల తాత్త్విక దర్శనాన్ని లోతుగా గ్రహించిన మేధావులు. భౌతిక చికిత్సతోపాటు మానవుని ఆధ్యాత్మికాంశాల ద్వారా మానసిక చికిత్స అవసరం అని భావించే సంస్కారవేత్త శ్రీ కొండా లక్ష్మారెడ్డిగారు.

# విజ్ఞానసరోవర ప్రచురణల ముఖ్య వదాన్యులు



డా॥ ఎ. మహేందర్‌రెడ్డి

అమెరికాలో ఉన్నా, ఆంధ్రాలోఉన్నా తమ జీవితం సేవకు, సాహిత్య, ధార్మిక సంస్కార భావాల వికాసానికి దోహదం చేసే వారెందరో ఉన్నారు. అటువంటి వారిలో డా ఎ. మహేందర్‌రెడ్డి గారొకరు.

వారు వరంగల్లు జిల్లాలోని రేగొండ గ్రామంలో జన్మించారు. వరంగల్లులోని కాకతీయ మెడికల్ కళాశాలలో ఎం.బి.బి.ఎస్ పూర్తిచేశారు. 1967లో అమెరికా వెళ్లారు. అక్కడ వైద్యులుగా నిలదొక్కుకున్నారు. హృద్రోగ నిపుణులుగా పేరు ప్రఖ్యాతులు సంపాదించారు. పిల్లల వైద్య నిపుణులుగా కూడా ఉత్తమ సేవలందించి పేరు గడించారు.

అమెరికన్ అకాడమీ వీరిని పీడియాట్రిక్స్ స్పెషలిస్టుగా గుర్తించింది. అంతేగాక ఇంటర్నేషనల్ కార్డియాలజిస్టుగా గుర్తింపు పొందారు. అంతేగాక డా॥ రెడ్డి అమెరికన్ అకాడమీ ఆఫ్ పీడియాట్రిక్ సభ్యులు; రాయల్ కాలేజ్ ఆఫ్ ఫిజీషియన్ ఫ్రం కెనడా, అమెరికన్ కాలేజ్ ఆఫ్ కార్డియాలజీ, కాలేజ్ ఆఫ్ బెస్ట్ ఫిజీషియన్స్‌లోనూ వారు సభ్యులు, వారి అపూర్వ సేవ కారణంగా ఇటువంటి గుర్తింపులెన్నో వారికి లభించాయి.

బర్మింగ్‌హామ్‌హాలోని హిందూ దేవాలయ సాంస్కృతిక కేంద్ర నిర్మాణంలో వారు చురుకుగా పనిచేశారు. దానికి అధ్యక్షులయ్యారు. 1999 నుండి ట్రస్టు బోర్డులో సభ్యులుగా ఉన్నారు. భారతీయ సాంస్కృతిక వారసత్వ ప్రచారానికిగాను ఏబదివేల డాలర్లను (దాదాపు రూ. 20లక్షలను) విరాళంగా ఇచ్చారు. అమెరికాలోని రెడ్డి జనసంఘంలో వారు శాశ్వత సభ్యులు. నిరుపేద విద్యార్థులకు ఉపకార వేతనాలకుగాను వారు విజ్ఞానసరోవర ప్రచురణలకు విరాళాలందిస్తున్నారు. ఇంకా ఎన్నో సంస్థలు వారి సహాయ సహకారాలందుకున్నాయి. ఆ సంస్థలు సమాజానికి ఉత్తమ సేవలందిస్తున్నాయి.

విజ్ఞానసరోవర ప్రచురణలను ఈ విధంగా ప్రోత్సహిస్తున్న, ఆదరిస్తున్న డా ఎ. మహేందర్‌రెడ్డిగారికి అభినందన పూర్వక ధన్యవాదాలు. విద్యార్థుల వికాసానికి, ప్రచురణల ద్వారా విజ్ఞాన ప్రచారానికి దోహదం చేస్తున్న అందరికీ అభినందనలు.

# విజ్ఞానసరోవర ప్రచురణల ముఖ్య వదాన్యులు



**డా॥ బూసా అమరేందర్‌రెడ్డి**
**(శ్రీ కె.వి.రంగారెడ్డిగారి దౌహిత్రులు)**

అమర్ హాస్పిటల్ వ్యవస్థాపకులు డా బి.వెంకటరెడ్డి, డా బి.సుమిత్రగార్ల సుపుత్రులు డా బి.అమరేందర్‌రెడ్డిగారు. ప్రస్తుతం వారు అమెరికాలో హృద్రోగ నిపుణులుగా ప్రజలకు అపూర్వ సేవలందిస్తున్నారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం గాంధీ మెడికల్ కళాశాలలో వారు ఎం.బి.బి.ఎస్. పూర్తిచేశారు. ఆ కళాశాలలో ఎం.డి. చేసిన వారిలో ప్రప్రథములు. అమెరికాలో కూడా వారు జనరల్ మెడిసన్ పూర్తిచేశారు. ఆ తరవాత హృద్రోగ సంబంధి అధ్యయనం చేసి అపూర్వ విజ్ఞానాన్ని ఆర్జించారు. అమెరికాలో ఉత్తర కెరలినలో హృద్రోగ సంబంధి ఆసుపత్రి ప్రారంభించి ఎందరికో సేవలందించి డాక్టరు రెడ్డి కీర్తి ప్రతిష్ఠలార్జించారు. వారు అమెరికన్ కాలేజ్ ఆఫ్ కార్డియాలజీ సభ్యులు. అంతేకాక ఆ విభాగంలోనే ఒక శాఖకు వారు అధ్యక్షులుగా ఉన్నారు. నార్త్ కెరలిన మెడికల్ కేంద్రంలో వారు ప్రొఫెసర్‌గా కూడా సేవలందిస్తున్నారు.

వీరి వైద్యసేవలందుకున్న వారిలో డా అక్కినేని నాగేశ్వరరావుగారు, మాన్యశ్రీ రాజా రామేశ్వరరావుగారున్నారు. అనూచానంగా వస్తోన్న వైద్య కుటుంబానికి చెందిన వారైనందువల్ల ఈ వృత్తి విషయంలో వారు పరమ పవిత్రంగా వ్యవహరిస్తోన్న కీర్తి ఉంది. ప్రతి సంవత్సరం ఉపకార వేతనాలు పేద విద్యార్థులకు ఇవ్వడంలో విజ్ఞాన సరోవర ప్రచురణలకు డా రెడ్డి ఆర్థిక సహాయం అందిస్తున్నారు. **డాక్టర్ రెడ్డి, వారి తల్లిదండ్రుల పేరిట కె.వి. రంగారెడ్డి స్వీయచరిత్ర గ్రంథ ప్రచురణకు సహకరించారు.** వారి సహకారం కారణంగానే ఎన్నో సేవా కార్యక్రమాలు నిర్వహించే అవకాశం విజ్ఞాన సరోవర ప్రచురణ సంస్థ చేయగలుగుతున్నది. అమెరికాలో ఉన్నా తమ కన్నతల్లి నేలలో ఈ సేవాకార్యక్రమాలు కొనసాగాలని ఆశించే వారికి మా ప్రచురణ సంస్థ ధన్యవాదాలు తెలుపుకొంటున్నది.

# విజ్ఞానసరోవర ప్రచురణల ముఖ్య వదాన్యులు



**కీ.శే. డా॥ సి. మల్లికార్జున్**

డా మల్లికార్జున్‌గారు సుబుద్ధి కిషన్‌గారి కుమారులు. విద్యార్థి దశనుండే విద్యార్థి సంఘాల పట్ల చాలా మక్కువ చూపించెడి వారు. వీరు ఉస్మానియా మెడికల్ కాలేజీలో చదువుతుండగా స్టూడెంట్స్ యూనియన్ నాయకునిగా ప్రత్యేక తెలంగాణా ఉద్యమం ప్రారంభించారు. నాటి ప్రజానీకంలో వీరి గురించి తెలియని వారు ఉండరు.

వీరు మొట్టమొదటిసారిగా 1971లో, ఆ తదుపరి 1977లో పార్లమెంటు నియోజక వర్గము నుండి పార్లమెంటు సభ్యులుగా ఎన్నికైనారు. 1980లో స్వచ్ఛందంగా రాజీనామా చేసి శ్రీమతి ఇందిరాగాంధీ గారిని అక్కడి నుండి గెలిపించడమే కాకుండా వారు అప్పుడు మహబూబ్‌నగర్ పార్లమెంటరీ నియోజక వర్గము నుండి పోటీ చేసి అతిపెద్ద మెజారిటీతో గెలిచారు. ఆ తదుపరి వారు మొదటిసారిగా ఇందిరాగాంధీ మంత్రివర్గంలో డిప్యూటీ రైల్వే మంత్రిగానూ, 1991లో స్టేట్ రైల్వే మంత్రిగానూ, సమాచార ప్రసారాల శాఖ మంత్రిగానూ, పార్లమెంటరీ వ్యవహారాల మంత్రిగాను, పలు ఇతర శాఖల మంత్రిగానూ బాధ్యతలు నిర్వహించారు. ఆ తదుపరి 1993లో రక్షారాజ్య మంత్రిగా పనిచేశారు. వీరు మంత్రిగా ఎన్నో దేశాలు పర్యటించారు. పలు అంతర్జాతీయ సదస్సుల్లో పాల్గొన్నారు. కాగా అంతర్జాతీయ రక్షణ సదస్సుల్లో కూడా పాల్గొన్నారు. వీరు ఇందిరాగాంధీ, పి.వి.నరసింహారావు గార్ల మంత్రివర్గంలో కూడా పనిచేశారు.

వీరు ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ పార్టీ అధ్యక్షులుగా పదవీ బాధ్యతలను నిర్వహించారు. వీరు ఎన్నో సేవాకార్యక్రమాలు గావించి ఇటు తన నియోజకవర్గమైన మెదక్, మహబూబ్‌నగర్ ప్రజల అభివృద్ధికే గాక కేంద్రమంత్రిగా దేశ ప్రజలకు కూడా వారి సేవలను అందించారు.

మేం పూర్వం ప్రచురించిన గోలకొండ కవుల సంచికకు వారికి సహకరించిన మా విజ్ఞాన సరోవర ప్రచురణల సంస్థ ధన్యవాదాలు తెలుపుతున్నది. భగవంతుడు వారి ఆత్మకు శాంతి కలిగించాలని ప్రార్థిస్తున్నాం.

# ముందుమాట

# రెడ్డికుల నిర్ణయ చంద్రిక - ఇప్పటి అవసరం

1927వ సం॥లో రెడ్డికుల నిర్ణయ చంద్రిక మొదటిసారిగా ప్రచురింపబడింది. నాటి దోమకొండ సంస్థానాధిపతి శ్రీమంతు రాజ రాజేశ్వరరావు బహోద్దురు వర్మ ఈ రచనకు ప్రోత్సాహకులు; ప్రేరకులు. శతావధానులు శ్రీమాన్ శేషాద్రి రమణ కవులు, శ్రీమాన్ పెద్ద మందడి వెంకట కృష్ణ కవి రచయితలు. మహాముని కావ్యకంఠ బిరుదాంకితులైన బ్రహ్మశ్రీ అయ్యల సోమయాజులు గణపతి శాస్త్రి చేత ఇది పరిశోధించబడింది. గోలకొండ ముద్రాక్షరశాలలో ముద్రితం.

నెల్లూరు జిల్లా ఇందుకూరు పేటకు చెందిన శ్రీమత్పరమహంస స్వామీజీ యన్. బి. సరస్వతిగారు, శ్రీ మాడపాటి హనుమంతరావుగారు, శ్రీగునుపాటి నవాది రెడ్డిగారు, శ్రీ తాటికొండ తిమ్మారెడ్డి గారు, శ్రీ కంఠీరవాచార్యులవారు, గద్వాల సంస్థానవిద్వాంసులు శ్రీ పుల్లగుమ్మి వెంకటాచార్యుల వారు, శ్రీ రాయప్రోలు సుబ్బారావు గారు, డా॥ కట్టమంచి రామలింగారెడ్డిగారు, శ్రీ గుండేరావు హర్కారే గారు, తిరువణ్ణామలైకి చెందిన మహాకవి శ్రీ కావ్య కంఠగణపతి మునిగారు ఈ గ్రంథానికి అభిప్రాయాలు వ్రాశారు. పీఠికలు సంతరించి పెట్టారు.

ఈ మహానుభావులు రచనలకు శాసనాలు, రెడ్డి పరివారాల వివాహాది బాంధవ్యాలు, క్షత్రియ శాస్త్రీయ ఆచారాలు, ప్రజాదరణ, రాజ్యపాలన, కళా పోషణ తదితర అంశాలు ఆధారంగా చేసుకొని సుప్రసిద్ధ పరిశోధకులు చరిత్రకారులు రచయితలు అయిన వీరు రెడ్డికుల నిర్ణయ చంద్రిక అనే ఈ గ్రంథాన్ని రచించారు.

ఎవరు బ్రాహ్మణులు? ఎవరు క్షత్రియులు? ఎవరు వైశ్యులు? ఎవరు శూద్రులు? అనే చర్చ ఇవాళ అవసరం లేదు. అయితే ఇవి కులాలుగా ప్రచారమవుతున్నాయి. ఇది తప్పుడు ప్రచారం. ఇవి కేవలం వర్ణాలు మాత్రమే. వారి వారి గుణ స్వభావాలను బట్టి మాత్రమే, ఇవి ఏర్పడ్డాయని గీతాదిగ్రంథాలు ప్రవచిస్తున్నాయి.

విరాడ్రూప పరమాత్మకు అంటే ఈ విశ్వం ఒక దివ్యమానవుని రూపం అనుకుంటే దానికి ముఖం బ్రాహ్మణుడు, బాహువులు క్షత్రియులు, ఊరువులు వైశ్యులు, కాళ్లు శూద్రులు అని పురుష సూక్తం చెప్పింది. అంటే ప్రతి మనిషిలో ఈ నాల్గుంటాయి. ఏ గుణ స్వభావాలు ఎక్కువగా ఉంటే ఆ గుణ స్వభావాలకనుగుణమైన పనులు వారు చేస్తారు. ఆ విధంగా చూచినప్పుడు రెడ్లలో ప్రధానంగా పరిపాలన, రక్షణ అనే గుణం తొలుదొల్త కనిపించిందది. అందువల్ల క్షత్రియులన్నారు. ఆ తర్వాత వీరే ఎక్కువగా వ్యవసాయ గోపాలనలో కనిపించారు. 'కృషి గోరక్ష వాణిజ్యం వైశ్య కర్మ స్వభావజమ్' అన్నట్లుగా వీరిని నాడు నేడు ఎవరు కూడా వైశ్యులుగా గుర్తించలేదు. ఇవాళ అనేక రంగాలలో రెడ్లున్నా ప్రధానంగా వారికి పాలకులుగా, వ్యవసాయదారులుగా మాత్రమే గుర్తింపు ఉంది.

'జన్మ నాజాయతే శూద్రః'- పుట్టుకతో అందరూ శూద్రులే. జీవితాంతం పరిచర్య(సేవ) తోనే కాలం గడిపినట్లయితే వారు శూద్రులుగానే ఉంటారని అర్థం. అలాకాక ఎవరు ఉత్పత్తి (వస్తువులు-ధాన్యం) క్షేత్రంలోకి వస్తే వారు వైశ్యులు. అంతేగాక వ్యాపారంలో ఉన్నవారు పాలన చేసేవారు కూడా వైశ్యుల క్రిందికే వస్తారు. గ్రామ, నగర, ప్రాంత, దేశ, విశ్వ రక్షణకై పూనుకున్న వారెవరైనా క్షత్రియులుగానే పిలువబడతారు. అధ్యయన బోధనల్లో ఉన్నవారు బ్రాహ్మణులవుతారు.

ప్రపంచమంతటా ఏ దేశంలోనైనా ఈ నాలుగు వర్ణాల వారే ఉన్నారు. రడ్డి– రెడ్డి అనే మాట కూడా రాష్ట్ర పరిపాలకుడు అనే అర్థంలోనే వచ్చింది. క్షత్రియ శబ్దానికి పర్యాయ పదమే రాష్ట్రకూట. అదే రడ్డి అయింది. ఇప్పుడదే కులవాచకమయింది.

అయితే వర్ణం గుణ స్వభావాలను బట్టి ఏర్పడ్డదయితే, కులం వృత్తిని బట్టి వచ్చింది. చివరకు వర్ణానికి కులానికి భేదం పాటించని స్థితి ఏర్పడింది. ఇటువంటిపరిస్థితులలో ఇవాళ కులం గురించి కొత్తగా తెలుసుకునేదేమి ఉంటుంది అని ప్రశ్న పుడుతుంది.

రెడ్లుకూడా వారివారి స్వభావాలను బట్టి, అవసరాలను 'బట్టి, వనరులను బట్టి, తమ కున్న నైపుణ్యాలను బట్టి, ఆధునిక కాలానికనుగుణంగా వివిధ వృత్తులు చేపట్టారు. ఇవాళ ఏ వృత్తుల్లో ఉన్నా, వారిలోని పాలక లక్షణాలు, కర్షక లక్షణాలు పోలేదు. బాగా వుండి పంటలు బాగా పండిన కాలంలో, పరిపాలకులుగా ఉండిన కాలంలో చేసిన దానధర్మాలవంటివే ఇప్పటికీ రెడ్లు చేస్తున్నారు.

ఆధునిక సేవాకార్యక్రమాలైన విద్య, వైద్యం, ధర్మ సత్రాల నిర్వహణ, అన్నదానాల నిర్వహణ, మఠమందిరాల స్థాపన, ఉపకార వేతనాల పంపిణీ, అనాథ బాల– వృద్ధాది ఆశ్రమాల నిర్వహణ... ఇలా ఎన్నింటినో కొనసాగిస్తూ వదాన్యులుగా సేవా దానశీలురుగా నిలుచున్నారు. గొప్ప పారిశ్రామిక వేత్తలుగా, విద్యావేత్తలుగా స్థిరపడి ఎందరికో ఉపాధి కల్పించి సేవాధర్మంలో కొనసాగే వారెందరో ఉన్నారు.

అయితే కూలీలుగా, నిరుపేదలుగా ఉన్న రెడ్లు కూడా ఎందరో ఉన్నారు. రెడ్లవలెనే ఎందరో నిరుపేదలూ, కూలీలూ ఉన్నారు. నేటి ఉద్యోగ సంఘాల వంటివే ఈ కులాలు. ఈ సంఘాలు ఆయా వ్యక్తులను ఆదుకున్నట్టే ఆనాడు

కులాలు ఆదుకునేవి. ఇప్పుడు కూడా కులాలు తమ కులంలోని వారిని ఆదుకోవాలి. కాని పరస్పర ఘర్షణకు కులాలు దోహదం చేయరాదు.

ఈ దృష్టితోనే, రెడ్డి కుల పూర్వాపరాలు అందరికీ తెలియాలనే ఉద్దేశంతోనే మేమీ గ్రంథాన్ని పునర్ముద్రణకు స్వీకరించాం. అంతేగాక ఆధునిక యువ సాహితీవేత్తలకు ఒక చారిత్రక దృక్పథం ఈ గ్రంథం కలిగిస్తుందనే ఆశయమూ ఉంది. నాటి తెనుఁగుభాష, విమర్శ, పరిశోధన తదితర విషయాలు విద్యార్థి తెలుసుకొంటుందనే ఆశ ఉంది. శూద్రులకు విధించిన సామాజిక నియమాలు సరియైనవి కావనే మా అభిప్రాయం. ఆ నియమాలు ప్రక్షిప్తాలనే మా భావన. ఇది వరకు మేం ప్రచురించిన గ్రంథాలను పాఠకులు ఆదరించినట్టే, ఎన్నో చారిత్రక ప్రమాణాలున్న ఈ గ్రంథాన్ని ఆదరిస్తారని ఆశిస్తున్నాము.

ఈ గ్రంథ ప్రచురణకు సహకరించిన వదాన్యులు శ్రీ తీరుపల్లి రాంరెడ్డి గారికి, వారి కుటుంబ సభ్యులకు, మా విజ్ఞాన సరోవర ప్రచురణలకు నిరంతరం సహకరిస్తున్న మాన్యులైన వదాన్యులందరికీ మా ప్రణామాలు. మా ప్రచురణలకు ఇదే విధంగా మీ ప్రోత్సాహం ఉంటుందని ఆశిస్తూ సెలవ్.





హైదరాబాదు
**2003,ఆగష్టు**

డా॥కసిరెడ్డి
కార్యదర్శి

కొండా లక్ష్మీకాంతరెడ్డి
ప్రధాన కార్యదర్శి
విజ్ఞానసరోవర ప్రచురణలు

# ముందుమాట

దోమకొండ ఆస్థాన కవులైన పెద మందడి వెంకటకృష్ణ కవి, శతావధానులు శేషాద్రి రమణ కవులు కలిసి రచించిన 'రెడ్డికుల నిర్ణయ చంద్రిక'ను మహాముని కావ్యకంఠ గణపతి శాస్త్రి పరిశోధించగా, దోమకొండ సంస్థాన ప్రభువులైన రాజా రాజేశ్వర రావుబహద్దుర్ వర్మ ప్రోద్బలమున 1927లో గోలకొండ పత్రిక కార్యాలయము నుండి వెలువడిన సంగతి నాటి పాఠకులకు ఎంత తెలిసినా 70 సం ల తదుపరి నేటి పాఠకులు కర్తవ్య దీక్షులు కాగలరనే కాంక్షతో ప్రచురిస్తున్న గ్రంథమిది.

రెడ్డికులం ఉనికి, ఔన్నత్యాలను నలుగురికీ ముందుగా రెడ్లకు తెలియజెప్పి వారిలో చైతన్యాన్ని తీసుకురావడానికి 1920 వ దశకంలో అనేక ప్రయత్నాలు జరిగాయి. 1913లో కడలూరులో మొదలైన రెడ్డి జన మహాసభలు 1916లో గుంటూరు జిల్లా నంబూరులో రెండవ సభ జరుగగా, కడప కోటిరెడ్డి అధ్యక్షత వహించి రెడ్లందరు ఐక్యంగా ఉండాలని బోధించారు. తరువాత, 1917లో నెల్లూరులోనే జరిగిన 3వ రెడ్డి జనమహా సభకు అధ్యక్షులుగా మునగాల సంస్థానాధీశులు రాజా నాయిని వెంకటరంగా రావు, పేద విద్యార్థులను ప్రోత్సహించటానికి స్కాలర్షిప్పులు రావాలనీ, అందుకోసం ఒక శాశ్వత రెడ్ల సంస్థను స్థాపించాలని సూచించారు. 1920లో జరిగిన నాల్గవ మహాసభకు అధ్యక్షత వహించిన విద్యావేత్త కట్టమంచి రామలింగారెడ్డి రెడ్డి జన సంఘ నిర్మాణావసరాన్ని, పది లక్షల శాశ్వత నిధిని ఏర్పాటు చేయాలన్న తీర్మానానికి ఏకగ్రీవంగా ఆమోదం లభించిన సంగతిని మనం ఈ సందర్భంగా గుర్తుచేసుకోవాలి. అదేసంవత్సరంలో అనపర్తిలో జరిగిన 5వ మహాసభకు కడప కోటిరెడ్డి అధ్యక్షులుగా, మల్లాది సత్తిరెడ్డి నిర్వహణా బాధ్యత వహించి, రెడ్ల ఐక్యతకు ఒక పత్రిక రావాలని రెండేళ్ళ తరువాత 'రెడ్డి రాణి' పత్రికను ప్రారంభించిన సంగతిని కూడా మనం మరిచిపోకూడదు.

1921లో మదనపల్లిలో కట్టమంచి అధ్యక్షతన జరిగిన ఆరో రెడ్డి జన సభలో మొదటిసారిగా పేద విద్యార్థులకు ఉపకార వేతనం కోసం విరాళం ప్రతిపాదించడం, విద్యావంతులైన రెడ్డి మహిళలను గుర్తించి బంగారు పతకాలిచ్చి సత్కరించి మహిళలను విద్యావంతులుగా తీర్చిదిద్దాల్సిన అవసరాన్ని నొక్కి చెప్పడం జరిగింది.

అలా ప్రారంభమైన రెడ్డి మహాసభలు ధనికులైన రెడ్లు, వివాహితులు తాము పెట్టే వృధా ఖర్చులను తగ్గించుకొని రెడ్ల అభ్యున్నతికి నిధులను ప్రోగుచేయాలని ఆ డబ్బుతో వివిధ సంక్షేమ పథకాలను అమలు పరిచి రెడ్లలో సంఘీభావాన్ని, ఐకమత్యాన్ని పెంపొందించటానికి దోహద పడేటట్లు చూడాలని తీర్మానించడం జరిగింది. అంతేకాక వెయ్యేళ్ళ చరిత్రలో గల రెడ్ల చరిత్ర, సంస్కృతిపై పుస్తకాలను కూడా ముద్రించాల్సిన అవసరాన్ని గుర్తించిన జమీందారులైన రెడ్లు ఆ దిశగా ముందుకు వచ్చారు. అలా వచ్చిన వాటిలో వేమన చరిత్ర, దారంకొండ సంస్థానం వారు వ్రాయించి, ప్రస్తుతం పునర్ముద్రణలో నున్న రెడ్డికుల చంద్రిక పేర్కొనదగినవి.

అయితే ఈ పుస్తకం మళ్లీ ముద్రించాల్సిన అవసరం ఉందా అంటే ఉంది. ఎందుకంటే స్వాతంత్ర్యసమరానికి ముందు పరాయి వాళ్లను ఈ నేలనుండి పారదోలటానికి భారత జాతంతా ఒక్కటైంది. ప్రతికులం, కులసంఘాలను ఏర్పరుచుకొని ఒక్కుమ్మడిగా పోరుబాటన నిలిచాయి. అయితే ఆనాడు కులసంఘాలు జాతీయతా భావంతో పనిచేసి విజయాన్ని సాధించాయి.

స్వాతంత్ర్యము తరువాత బలమైన వర్గంగా ఉన్నటువంటి రెడ్లు, తరువాత, తరువాత రాజకీయ ప్రాధాన్యతను కోల్పోయారు. అందుకని మళ్లీ రెడ్డి జనుల్ని జాగృతంచేసి, ఐక్యతారాగాన్నందించి, తమ ఉనికిని, ఔన్నత్యాన్ని నిలబెట్టుకోవడానికి ఈ తరం వాళ్ళకు గత వైభవ ప్రాభవాలను కళ్లకు కట్టినట్లు చూపించాలి. అందుకు పుస్తకాలను ముద్రించాలి. ఈ నేపథ్యంలోనే రెడ్డికుల

నిర్ణయ చంద్రిక మళ్లీ ముద్రణకు నోచుకుంది. దోమకొండ సంస్థానం వారు 1927లో వేయించిన ఈ పుస్తకానికి ఆనాటి గొప్ప వ్యక్తులైన మాడపాటి హనుమంతరావు, గునుపాటి యానాదిరెడ్డి కట్టమంచి రామ లింగారెడ్డి, హ. గుండేరావు, తాటికొండ తిమ్మారెడ్డి, వనపర్తి సంస్థాన విద్వాంసులు కంఠీరవాచార్యులు, పుల్లగుమ్మి వెంకటాచార్యులు, రాయప్రోలు సుబ్బారావు లాంటి వారు శుభాభినందనలు తెలుపగా, సురవరం ప్రతాపరెడ్డి కృతజ్ఞతలు తెలిపారు. ఇలాంటి గ్రంథానికి పరిశోధనాత్మకమైన పీఠికను అందించిన మహాముని కావ్యకంఠ గణపతి శాస్త్రిగారి ఆశీస్సులు లభించటం మరో గొప్ప విషయం.

రెడ్డికుల నిర్ణయ చంద్రిక అనే ఈ గ్రంథానికి నామాంతరమే క్షత్రియ కుల దర్పణం. రెడ్లు క్షత్రియులెలా అవుతారు? క్షత్రియ తత్వాన్ని ఎందుకు ఆపాదించుకోవాలి? ఈ ప్రశ్నలకు సూటిగా సరైన సమాధానాలు దొరకవు గానీ, కొంత ఆసరా ఉన్నమాట నిజం. క్రీ.శ.4–5 శతాబ్దాల దాకా కేవలం బ్రాహ్మణులుగానీ, క్షత్రియులు గానీ మాత్రమే రాజ్యాలనేలేవారు. క్రీ.శ.6–7వ శతాబ్దాల తరువాత క్షత్రియ, బ్రాహ్మణేతరులు రాజ్యాలనేలటం ప్రారంభించిన నేపథ్యంలో రెడ్లుకూడా గ్రామాధికార 'రెడ్డి' పదవినుంచి రెడ్డికులము పుట్టుకొచ్చింది. గ్రామాలనుంచి రాష్ట్రకూట ప్రముఖులు, రాజుల వరకు పదవిరీత్యా ఎదిగిన రెడ్డికులస్తులు క్షాత్రధర్మాన్ని నిర్వర్తించి, క్షత్రియులతో సంబంధబాంధవ్యాలను కలిగిఉండడంవల్ల క్షత్రియసములై తరువాత రాజులు అన్న అర్థంలో క్షత్రియత్వాన్ని అలవరుచుకున్నారు. అందుకని రెడ్లను క్షత్రియులుగా గుర్తించారానాటి ప్రముఖులు.

ఇక, చారిత్రక విషయాలనెన్నింటినో తన పొత్తిళ్ళలో దాచుకొని, రాబోవు తరాల వారికి చైతన్య కరదీపికగా ఈ పుస్తకం మార్గదర్శి కానున్నందున దీనిని పునర్ముద్రించాల్సిన అవసరం ఏర్పడింది.



సంస్థానాలు లేని ఈ రోజులలో కేవలం రెడ్డిజన సమైక్యత కోసం వారసత్వ ఒరవడిని కొనసాగించటం కోసం కొండాలక్ష్మీకాంత రెడ్డి పూనుకోవటం హర్షించదగ్గవిషయం. పరిశోధక, విద్యాసంస్థలు చేపట్టవలసిన బాధ్యతను తన నెత్తిన వేసుకొని సంస్థాన అనువంశీకులను కలసి, వారి నుంచి ఫోటోలను సేకరించి విలువైన సమయాన్ని కరవైన ధనాన్ని వెచ్చించి మళ్లీ అచ్చొత్తించే బాధ్యతను నిర్వర్తించటం సాహసం కాక మరేమిటి? విజ్ఞాన న్ని 'దీపం'లా నలుదిశలా వ్యాపించ జేయాలన్న తపనతో విజ్ఞాన సరోవర ప్రచురణ సంస్థను స్థాపించి రెడ్డి రాజ్య సర్వస్వము, గోలకొండ సంచిక, వేమన త్రిశతి, కృషీవలుడు, కాపుబిడ్డ, ఈ రెడ్డికుల నిర్ణయ చంద్రిక పునర్ముద్రణ గ్రంథ ప్రచురణ పరంపరను కొనసాగిస్తున్న కొండా లక్ష్మీకాంత రెడ్డి గారిని అభినందిస్తూ ఈ పుస్తకం ఈతరం వారికి కూడా అణగారుతున్న వారసత్వ దీపికలను మళ్ళీ తేజరిల్ల జేస్తుందని ఆకాంక్షిస్తున్నాను.

మునగాల
21-8-2003

కుద్రాజితేంద్రబాబు
కొమర్రాజు వెంకటలక్ష్మణరావు
పరిశోధక మండలి.

# రెడ్డికుల నిర్ణయ చంద్రిక

## పండితాభిప్రాయములు

### శ్రీ మత్పరమహంస స్వామి, జి.యస్.బి. సరస్వతిగారి అభిప్రాయము

అస్మద్దేశస్థితాంధ్ర మహాశయులారా ?

ఆంధ్రదేశ పాలనాత్యుచ్చ స్థానము స్వీకరించియునెట్టి విషమకాలంబునను తమ స్వాతంత్ర్య స్ఫూర్తికై పెనుగులాడి పరాభూతులుగాక మతావేశ పరవశులగు దుర్మార్గుల దుర్లంఘౌద్ధత్య ప్రశాంతము గావించి చిరంతన కీర్తి గడించిన రెడ్డి మహాశయులెల్లరు క్షత్రియ కులావతంసులని దెలియంజేయునట్టి "రెడ్డికుల నిర్ణయ చంద్రిక" అను పొత్తమును సొంతముగఁ జూచుట గలిగినది.

ఇయ్యది దోమకొండ సంస్థానాధి పతులగు శ్రీమంతు రాజారాజేశ్వర వర్మ బహదూరువారి ఆజ్ఞానుసారము శతావధానులగు శ్రీమాన్ శేషాద్రిరమణ కవులు, శ్రీమాన్ పెద్దమందడి వేంకటకృష్ణకవి మొదలగు వారిచే రచియింపఁబడి మహాముని కావ్యకంఠ బిరుదాంకితులగు బ్రహ్మశ్రీ అయ్యల సోమయాజుల గణపతి శాస్త్రిగారిచేఁ పరిశోధింపఁబడి ప్రకటింపఁబడియున్నది.

ఇందు నుదాహరించిన విషయములన్నియు సశాస్త్రీయములై యున్నవని ప్రప్రథమముననే వాకొనుచున్నాము. అదెట్లనియెదరేని ఈ రెడ్డి మహాశయులెల్లరు ప్రాచీన కాలమునుండి పురాణ ప్రసిద్ధులైన క్షత్రియకుల సంజాతులమని గ్రంధస్థ మొనర్చుకొనినవారెల్లరితో సంబంధ బాంధవ్యములొనర్చి యున్నారను విషయమునుబట్టి చక్కగఁ దెలియుచున్నది.

అదెట్లన్నను, గణపతి దేవుఁడు వెలనాటిపై దండెత్తి వచ్చి చతుర్థాన్వయుఁడైన పిన్నచోడ నాయకుని జయించి యాతని కూతుండ్రగు నారమ్మను పేరమ్మను పెండ్లియాడి యా సుందరీమణుల ద్వితీయ సోదరుఁడైన జాయప నాయకునికి సైన్యమున

కాధిపత్యమిచ్చి గొప్ప పదవికి గొనివచ్చెనని చేబ్రోలులోని జాయపనాయకుని శాసనము దెలుపుచున్నది.

2 గణపతిదేవ చక్రవర్తి తండ్రియైన మహదేవరాజు వంశములో బుట్టిన మల్యాల దుర్గాధీశ్వరుండగు గుండ్రాజు భార్యనని దెలుపుకొనుచు కోన బుద్ధారెడ్డి పుత్రికయగు కుప్పాంబిక తనభర్త పేర దానము చేయుచు వ్రాయించిన వడ్డమానుబూదుపూరు శాసనములలోఁ బై విషయము చక్కగఁ దెలియుచున్నది.

3 ఇంతియేగాదు. గణపతి దేవ చక్రవర్తి తోఁబుట్టువగు మైలాంబను చతుర్థ వంశ సంజాతుండును, నత వాటి విషయాధీశ్వరుండైన బుద్ధరాజు కొడుకు రుద్రదేవరాజున కిచ్చి వివాహము చేయఁబడియెనని మైలమ్మ త్రిపురాంతక శాసనము వలనఁ దెలియుచున్నది.

4 శ్రీ గణపతిదేవ చక్రవర్తి మేనకోడలైన బయ్యల మహాదేవిని చతుర్థవంశ సంజాతుండను, ధనంజయ గోత్రుఁడును. శ్రీ ధాన్యవతీ పురాధీశ్వరుండగు కోటకేత రాజునకిచ్చి వివాహము చేయఁబడెనని బయ్యామాంబయొక్క ఎనమదల శాసనమువలనఁ దెలియుచున్నది.

5 ధనంజయ గోత్రుఁడైన కేత రాజు తల్లియగు సబ్బమ్మదేవి చతుర్థాన్వయ సంభవుఁడైన వెలనాటి వీర రాజేంద్ర చోడ రాజునకు బుత్రికయు, వెలనాటి మూడవ గొంకరాజునకు తోబుట్టువై యుండెను.

6 ఈ సబ్బమ్మ దేవి తండ్రియైన వెలనాటి వీర రాజేంద్రచోడ మహారాజు, చతుర్థాన్వయ సంజాతుండును. దుర్జయకులాభరణుఁడును, బుద్ధవర్మ వంశోద్ధారకుఁ డు. అయిన కొండ పడమటి బుద్ధరాజు తోబట్టువగు అక్కాంబికను వివాహమయ్యెను.

7 ఈ అక్కాంబిక పుత్రుఁడగు వెలనాటి కులోత్తుంగ చోడ గాంగేయ గొంకరాజు బూర్వోక్తమైన బుద్ధరాజు వంశమున జనించిన జయాంబికను వివాహమయ్యెనని చంద వోలులోని బుద్ధరాజు శాసనము దెలుపుచున్నది.

8 శ్రీ కాకతీయ గణపతిదేవ చక్రవర్తి తన ద్వితీయ కుమార్తెయగు గణపాంబికను, చతుర్థకులజుఁడును, ధాన్యవతీ పురాధీశ్వరుఁడును. రుద్రరాజు కుమారుఁడునగు బేతరాజునకిచ్చి మహావైభవముతో వివాహము జేసెను.

9 శ్రీ మద్రాజాధిరాజరాజ పరమేశ్వర బిరుదాంకితులగు హరిహర దేవరాయలు తన కుమార్తెయైన హరిహరాంబయను నామెను కాటయ వేమారెడ్డి పుత్రుఁడగు కాటయ ప్రభునికిచ్చి వివాహము జేసెను' ఈ విషయము అల్లాడరెడ్డి కోరుమిల్లి శాసనము వలనఁ దెలియఁబడు చున్నది. మఱియు విద్యానగరము లేక విజయనగరము పరిపాలకులగు అచ్యుతదేవరాయలవారు తన మరదలైన మూర్తిమాంబను చతుర్థాన్వయసంజాతుఁడగు చెవ్వప్పనాయునికిచ్చి వివాహ మొనర్చెనని విజయ విలాసమను గ్రంధము వలన దెలియుచున్నది. ఇందువలన రెడ్డికులజులు క్షత్రియ కులావతంసజు లనుటకే యభ్యంతర ముండజాలదు గదా?

ఈ హరిహర దేవరాయల వారును, వీరి తమ్ములగు బుక్కరాయల వారును. అచ్యుత దేవరాయల వారును ఈ మొదలగు వారెల్లరును యదువంశ చంద్రవంశజులని బెక్కు ప్రబంధములవలన దెలియఁబడుటయేగాక అనేక దాన శాసనముల వలన దెలియఁబడుచున్నది. వెండియు నిందులకు. కీ.శే, రావుబహదూరు వెంకన్న గారిచే రచియింపఁబడియున్న "నెల్లూరు మండల ప్రాచీన చరిత్ర" అను నీ గ్రంథమందు దాహరింపఁబడియుండు 152 తామ్రశాసనము వలన దెలియ॥బడు విషయ మేమన్ననను. "చంద్రవంశమున బుధుఁడు, ఆయువు, నహుషుఁడు, యయాతి, యదువు, ఈ మొదలగు వారలు జనించిరనియు. నట్టివారి వంశములో జనించిన సంగమునకు కాలాంబికయను భార్యవలన 1 హరిహరరాయలు 2. కంపరాయలు. 3. బుక్కరాయలు. 4. మార రాయలు. 5. ముద్దరాయలు అను నేవురు పుత్రులు జనించిరనియు నిట్టి వారిలో జ్యేష్ఠుఁడైన హరిహరరాయలు ఆంధ్రకళింగాది దేశములను జయించి కుంజరకోన (ఆనెగొంది) లోనుండి భూపరిపాలనము చేయుచుండెను. ఈ మొదలగు విషయములు దెలియఁబడుచున్నవి.

వెండియు నీ మొదలగు వారెల్లరు యదువంశ క్షత్రియులని విద్యారణ్య మహామహులచేఁ బ్రకటింపఁబడిమాచే నీ`క్రింద వ్రాయునట్టి దాన శాసనము వలన దెలియుచున్నది. ఇట్టి దాన శాసనమును రుద్రాధ్యాయ పరిశోధకులగు వామనశాస్త్రి గారు తద్గ్రంథమున నుదాహరించి పరిశోధనము గావించి యున్నారు. అట్టి దానిని మీరెల్లరును గుర్తెఱుగుటకై యిందు బొందుఁ బఱచు చున్నాము.

శ్లో॥ తస్మిన్ భారతవర్ష దక్షిణ దళేదేశోస్తి కర్ణాటక ః।
త న్మధ్యేసరి దుత్తమా విజయతేసాతుంగ భద్రాభివా।
యత్తీరేదురి తాటవీహుతవహో దేవో విరూపాక్షక ః।
ఇత్యాస్తే సంతత మంతరేణుసుమనః స్రోతస్వినీచింతనమ్ ॥

2 శ్లో॥ యశ్యోప కంఠే విజయాభిధానా
సాదుర్జయారాజతిరాజ ధానీ॥
యస్యాంవిరూపాక్షకటాక్ష (1) దగ్ధ
ముజ్జీవయంతి స్మరముత్పలా క్ష్యః ॥

3 శ్లో॥ వంశేయ దోరభినవాంశ ఇవాచ్యుతస్య।
శ్రీసింగ మాధజని సంగర రంగభీమః॥
శ్రీ బుక్కరాజ ఇతి ధిక్కృత శత్రురేషా
తామధ్యతిష్ఠదధ మధ్యమ లోకపాల॥

4 శ్లో॥ తస్యాజ్ఞ యామాధవ మంత్రివర్యః।
ప్రాశాజ్జయంతీపుర రాజ్యమృద్ధమ్॥
యన్మంత్రశక్తానవ పురుత్సృజంతో।
పృరాతయః స్వాస్థ్య మహోభజంతే ॥

5 శ్లో॥ ఆశాంత విశ్రాంతయశా స్సమంత్రీ
దిశోజిగీషుర్మహతా బలేన।
గోవాభిధాం కొంకణరా జధానీ
మన్యేనమ న్యేరుణదుర్ణ వేన ॥

6 శ్లో॥ ప్రతిష్ఠితాం స్తత్రతురుష్కసం ఘా
నుత్సాద్యదోష్ణాభువనైక వీర ః।
ఉన్మూలితానా మకరోఉత్ప్రతిష్ఠాం
శ్రీ సప్తనాథాధిసుధాభుజాంయ ః ॥

స్వస్తిశ్రీ శకేత్రయోదశాధిక త్రిశతోత్తర సహస్ర (1313, క్రీ.శ. 1391) గతే వర్తమాన ప్రజాపతి సంవత్సరే వైశాఖమాసే కృష్ణపక్షే అమావాస్యాయాం సౌమ్యదినే సూర్యోపరాగ పుణ్యకాలే స్వస్తిశ్రీమన్మహామంత్రీశ్వర ఉపనిషన్మార్గ ప్రవర్తకాచార్య, శ్రీ మన్మాధవరాజః కుంజర విషయవర్తినంకుచ్చరనామానం గ్రామం మాధవపుర ప్రధిత నామాన మగ్రహారం కృత్వా ఇత్యాది.

---

(1) లబ్ద

ఇందుల యభిప్రాయ మేమన్నను ప్రసిద్ధమైన యీ భరతఖండము దక్షిణభాగమందు కర్ణాటక దేశమున్నది. అట్టిదానిమధ్య నుత్తమమైన తుంగభద్రానది యున్నది. అది సర్వపాపములకు దావానలము, దానిని గంగగా భావించి విరూపాక్షస్వామి యాతీరమందా విర్భవించెను. ఇట్టి విరూపాక్షస్వామి దేవాలయమునకు దగ్గర విజయనగరమను పేరుగల రాజధాని రతీ దేవితో దుల్యులగు స్త్రీలతో బ్రకాశించెను.

అందు యదువంశములోఁ నభినవ శ్రీ కృష్ణావతారుఁడును, శ్రీ సంగమరాజు బుత్రుఁడును అగు శ్రీ బుక్కరాయఁడు బుట్టి శత్రుభీకరుఁడై భూలోకమును పాలించుచు విజయనగరమున నుండెను. అట్టివారి యాజ్ఞానుసారముగ మంత్రియగు మాధవాచార్యులు (జయంతి) విజయనగర సామ్రాజ్యమునొంది యరాతులకు వీరస్వర్గము నిచ్చుచుండెను.

ఇట్లు దిగంతవ్యాప్తమైన కీర్తిగల యామంత్రి జయేచ్ఛగలవాఁడై కొంకణ రాజధానియగు నొకప్రక్క సముద్రముచే నడ్డగింపబడిన గోవాపట్టణమును విశేష బలముతో నరికట్టెను. అందునయుండు యాపట్టణపు రాజులగు తురుష్కులను తన బాహుబలముచే నిర్మూలనముచేసి వారిచే దరమకొట్టబడిన సప్తనాథాది యాదవ రాజులను తిరిగి స్థాపించెను.

శాలివాహన శకము 1313 కు సరియగు క్రీ.శ. 1391 ప్రజోత్పత్తినామ సంవత్సర వైశాఖ అమావాస్య బుధవారమునాఁడు సూర్యగ్రహణ కాలమందు స్వస్తిశ్రీమన్మహా మంత్రిశేఖరుఁడును ఉపనిషన్మార్గ ప్రవర్తకాచార్యుఁడును, శ్రీమన్మాధవరాయలు కుంజర (అనేగొంది) దేశమందుండెడు కుచ్చరమను బేరుగల గ్రామమునకు మాధవాగ్రహారమని తన నామ మొసగి దానిని విద్వద్బ్రాహ్మణులకు దానము జేసెను.

మఱియు నీ సంగతి బలపరచుచు నుడివిన బ్రహ్మశ్రీ త్రిలింగ రామశాస్త్రిగారి లేఖగూడా గన్పట్టుచున్నది. అట్టిదానిని యీ క్రింద జిత్రించి బుత్తెంచుచున్నాము. జూడుడి.

"కావ్యమాలాంతర్గత ప్రాచీన 44 లేఖ విజయభూపతిః వీరబుక్క నృపతిపౌత్రః 1338 (క్రీ.శ. 1416) సాంపణార్యాయచెట్టు పేటాఖ్యం గ్రామం ప్రదదావిత్యర్థ

కేవిజయభూపతేః 1338 స్థిత్యవగమాత్ తత్పితామహస్య వీరబుక్క భూపతేస్థితి సమతుః 13 శతాబ్దాంతరే సధృతి అతయేవత న్మంత్రిణోమాధవాచార్య స్యాపి 13 శతాభ్యంతర ఏవజన్మకాలస్సిధృతి ఏవం తామ్రపత్రే 1313 ప్రజాపతినామ సంవత్సరే వైశాఖ కృష్ణపక్షే అమాయాం సూర్యగ్రహణే వైదికమార్గ ప్రవర్తక శ్రీమన్మాధవా చార్యేణ కుచ్చర సంజ్ఞక గ్రామస్య స్వనామ్నా మాధవ పురమితి నామని ధాయ చతుర్వింశతి సంఖ్యే భ్యో బ్రాహ్మణేభ్యః, ఉదక పూర్వకం దత్తమితి లేఖదర్శనాదపి పూర్వోత్తర శతాభ్యంతరే అస్యజన్మేతి స్థిరీభవతి। అయంవీరబుక్క మహీపతి మంత్రిస్సన్ కియంతమపికాలం జయంతపురే (విజయనగరే) రాజ్యమకరోత్ – తస్మిన్నేవ సమయే గోవానామికాం రాజధానీంజిత్వా యవనన్నపైరున్మూలితానాం సప్తనాథాది యాదవానాం ప్రతిష్ఠామకరోదిత్యా దిజ్ఞాయితే. అని యిట్లుగ దెలియఁబడుచున్నది. ఇందువలన హరిహర బుక్కరాయాదులు యదువంశ క్షత్రియులని దెలియఁబడుటయే గాక ఈ కలియుగమున గూడా క్షత్రియులు గలరని ఈ దాన శాసనము వలన విద్యారణ్య మహామహులు బ్రకటించి యున్నారని ద్యోతక మగుచున్నది.

అటుపిమ్మట తుళవా న్వయసంభూతులగు అచ్యుత దేవరాయాదులగువా రెల్లరును యయాతి పుత్రుఁడగు దుర్వసుని సంతతివారని ఈ క్రింది దానశాసనము వలన బేర్కొనుచున్నాము. అదెట్లన్నను అచ్యుతదేవరాయలు వారు పొడిపెల్లిలో వేయించిన దానశాసనము వలన బూర్వోక్త సంగతులు వెల్లడి యగుచున్నది. అయ్యది నెల్లూరు దానశాసనములు. 1వ భాగము 69వ పేజియందు గన్పట్టుచున్నది. జూచుకొనుడి. ఇందువలన దెలియబడిన దేమన్నను బూర్వోక్తము లైపురాణ ప్రసిద్ధులగు క్షత్రియులతో నీరెడ్డికులావతంసకులగువా రెల్లరు బూర్వోదాహృత విధి ననుసరించి సంబంధ బాంధవ్యము లొనర్చియుండుటచే నీరెడ్డి వారెల్లరు క్షత్రియులని ముమ్మాటికిని బేర్కొనుచున్నాము.

ఇంతకు బూర్వముదాహరించిన విషయ మట్లుండనిండు. అచ్చటచ్చట కొన్ని ప్రబంధములలోను, కొన్ని దాన శాసనములలోను, ఈరెడ్డి మహాశయులను గూర్చి చతుర్థాన్వయులని వర్ణింపబడియున్నది. ఇందులకుదాహరణముగ కోనబుద్ధారెడ్డి యొక్క పుత్రికయగు కుప్పాంబిక దానశాసనమందలి.

శ్లో॥ చతుర్థవంశ ప్రభవాస్త్రయో ధ॥
శంభుం సమారాధ్య తపోభిరామాః ।
ధాత్రీపతిత్వంభువిదుర్జయత్వం ।
వర్మాంత నామాపిన రేంద్ర చిహ్నాం" అను నీ మొదలగు ప్రమాణము వలన దెలియుచున్నది.

ఇందులకు శ్రీయుత చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు వచించిన యభిప్రాయ మేమన్నను "చతుర్థకులమువారు నరేంద్రచిహ్నామైన "వర్మ" బిరుదమును నామాంతమున జేర్చుకొనుచుండెడివారని శాసనములో వ్రాయఁబడి యున్నదని వక్కాణించియున్నారు. ఇందులకు గీర్తిశేషులైన వంగూరి సుబ్బారావుగా రాక్షేపించియున్నారు. అదెట్లన్నను దీనికే కారణముననో సామాన్యార్థమును శ్రీ పంతులుగారు వ్రాసియున్నారు. ఇది సరియగు నభిప్రాయము గాదు. ఈ శ్లోక భాగమునకు నాకైన యర్థమిది. పిమ్మట ముగ్గురు చతుర్థవంశ సంభవులు శివుని తపస్సుచే నారాధించి, 1 ధాత్రీపతిత్వమున్ను, 2 భువి దుర్జయత్వమున్ను, 3 నరేంద్ర చిహ్నామైన వర్మాంతమగు నామమున్ను వీటితో సహాబొందిరి. అనగా నిదియొక గొప్ప విశేషముగ శాసనకర్త జెప్పెను. మఱియు తపస్సుచేతవర్మాంతమైన నామమును బొందిరనెను. అది నరేంద్రచిహ్నాము. కావున రాజులకు లేక క్షత్రియులకు చిహ్నామైన వర్మశబ్దమును శంభుప్రసాదమున ముగ్గురు చతుర్థాన్వయులు బొందగలిగిరని విశేషాంశముగా శాసనములో నుగ్గడించినారేకాని అప్పటికి శూద్రులుకాని, చతుర్థాన్వయులు కాని "వర్మాంతనామము" కలవారని శాసనకర్త యభిప్రాయముగానట్లు నాకు స్ఫురించుచున్నది. బుద్ధిమంతు లూహించెదరుగాక అని యట్లు వ్రాసియున్నాడు.

ఇయ్యది సరియగు సభిప్రాయము గాదని మాయభిమతము. ఏలయన్నను బైవాక్యమును విమర్శించి జూడ, జాతి శూద్రులకు నామాంతమందు వర్మాంతపద మొకవేళ లేకపోయినను పోవచ్చును కాని చతుర్థాన్వయులకు మాత్రము వర్మాంతపదము సర్వసాధారణమై యున్నదని బై శ్లోకమును బట్టియే దెలియుచున్నది. అయితే యీచతుర్థాన్వయులకు వర్మాంత పదము సర్వసాధారణమై యుండునప్పుడు శాసనగతులైన పూర్వోక్తులగు చతుర్థాన్వయులు ముగ్గురు ఈశ్వరుని గూర్చి వర్మాంత పదమునకై

తపంబొనర్చనేల యని శంకించ నగత్యములేదు. ఎందుల కనినచో సర్వసాధారణమైన వర్మాంత పదమునకై అంతగొప్ప తపంబొనర్చ నగత్యములేదని సప్తనందులకు సహితము వేద్యమగుచున్నది.

అయితే మరెందులకుఁ బూర్వోదాహృతులగు ముప్వురు తపంబొనర్చిరనియెదరేని లోకమున రాజశబ్దవాచ్యున కుండతగినవి. 1 భూపతిత్వము, 2 భువిదుర్జయత్వము, 3 నృపతిత్వము అను నీ మూడు చిహ్నములు గలవాఁడే రాజశబ్ద వాచ్యుఁడగుననియు, ఈ మూడుచిహ్నములు లేనివాడు రాజశబ్ద వాచ్యుఁడు గాజాలడనియు నిట్లుబరాశర వ్యవహార మాధవీయమను గ్రంధరాజములో 1, 2 పేజీలయందు విద్యారణ్య మహామహులు నుడివియున్నారు. అందువలన నిట్టిప్రభావము యా రాజశబ్దమం దుండుటచేతనే శాసనగతులైన బై చతుర్థాన్వయులు ముప్వురు సర్వశక్తి మంతుఁడగు ఈశ్వరునిగూర్చి తపంబొనర్చి 1 ధాత్రీపతిత్వము, 2 విశేషముగ భువిదుర్జయత్వము, 3 నృపతిత్వముతో గూడిన వర్మాంతమగు నరేంద్రచిహ్నము అను నీరాజశబ్దవాచ్యమునకు నవసరమగు బైమూడు వరముల నీశ్వర ప్రసాదముల వలన బొందిరి.

ఇట్లుగ బైప్రమాణవచనము దెలియఁబడుట వలన లోకమున వర్మాంతపదము సర్వసాధారణ పదముగనున్నదని వేద్యమగుచున్నది. ఇటుపైన శాసనగతులగు నా ముప్వురికి సర్వసాధారణము కానిదియు దపస్సాధ్యమైన దేదనగా 1 ధాత్రీపతిత్వము, 2 భువిదుర్జయత్వము, 3 నృపతిత్వముతో గూడిన వర్మాంతమగు నరేంద్రచిహ్నము అనునీ మూడు విషయములు ఈశ్వరకృపచేఁ బొందుట గలిగినది. ఇవి మరొండు విధమున లభింపజాలనివియై యున్నవి. అందువలన సర్వసాధారణమైన వర్మాంతపదమును శాసనగతులైన బూర్వోదాహృతులగు ముప్వురు బొందుటకు బ్రయత్నించినట్టు బొడకట్టక బోవుట చేతనున్ను, మఱియు పరాశర మాధవీయ వచనానుసారము నాముప్వురు రాజశబ్ద వాక్యమును బొందుటకు యత్నించినట్టున్ను ఇట్లుగ బైవిషయమువలన ద్యోతక మగుచున్నది, అందువల్లనే శాసనకర్త శాసనమందు 1 నరేంద్రశబ్దమును, 2 ధాత్రీపతిత్వశబ్దమును, 3 భువిదుర్జయత్వశబ్దమును, ఇట్లుగ

మూదుశబ్దములును శాసనగత మగునట్లు జేయించెను. అందువలన యిందుదాహరింపఁ బడి యుండు ఈ చతుర్థాన్వయ శబ్దవాచ్యులగువా రెల్లరు ప్రచ్ఛన్న రాజకులజులగు క్షత్రియులని వచించుచున్నాము.

**పాఠక మహాశయులారా ?**

ఈ రెడ్డికుల నిర్ణయ చంద్రిక యందుదాహరింపఁ బడియుండు విషయమంతయును సశాస్త్రీయముగ జర్చింపబడి యుండుటవల్లనున్ను, వెండియు ననేక దాన శాసనముల వల్ల గూడా జర్చింపబడి యుండుటవల్ల గూడా జర్చింపబడి యుండుట వల్లనున్ను ఈ గ్రంథము సశాస్త్రీయముగ నున్నదని బేర్కొనుచున్నాము. మఱియు నీ గ్రంథస్థులగు రెడ్డికులా వతంసజులు ప్రచ్ఛన్న రాజకులజులగు క్షత్రియులై యున్నారని ముమ్మాటికి వాకొనుచున్నాము.

**22-8-27** **శ్రీ మత్పరమహంస**

**ఇందుకూరుపేట** **స్వామి జి.యస్.బి. సరస్వతి**

**నెల్లూరు జిల్లా**



## మాడపాటి హనుమంతరావుగారి అభిప్రాయము

రెడ్డికుల నిర్ణయచంద్రికయను నామాంతరముగల "క్షత్రియకులదర్పణము" ను ఆమూలాగ్రము చదివితిని. ఇందులోని యంశములను జూచినవారికి రెడ్లు క్షత్రియజాతికి చెందినవారని తోపకమానదు. ఇందలి ప్రమాణములు విశ్వసనీయములు; సిద్ధాంతములు ఉదాత్తములు. ఇట్టి యుత్తమ గ్రంథమును రచియింపించిన శ్రీమంతు రాజా రాజేశ్వరరావు వర్మ బహోద్దరు (దోమకొండ సంస్థానాధీశులు) గారు ఆంధ్రుల కృతజ్ఞతకు బాత్రులైయున్నారు. ఇట్టి నిష్పాక్షికమగు భావములతోను, పరిశ్రమా ద్యోతకములగు చర్చలతోను, ఆదర బుద్ధితోను గ్రంథమును రచించిన కర్తలును ప్రశంసార్హులని నాయభిప్రాయము.

ఈ గ్రంథరాజము మొత్తముమీద ఆంధ్రులకు విజ్ఞానప్రదమును, రెడ్డివంశజులకు నుత్తేజకరమును, దేశాభిమానులకు నానంద దాయకమును అగునని నానమ్మకము. ఆంధ్రజాతి ఈ పుస్తకము మూలమున వృద్ధిమార్గమున కొన్ని యడుగులైనను తప్పక ముందునకు రాగలదనుట నిస్సంశయము. ఇట్టి ఉత్కృష్ట గ్రంథము చదువువచ్చిన ప్రతి యాంధ్రుఁడును చదివి ఇతరులకు ఇందలి యంశములను బోధించుట విధియని తలఁచెదను. ఇంతటి యుపయోగకరమగు గ్రంథము నిజాము రాష్ట్రములోని యాంధ్రదేశము నుండి వెలువడుట మహాభాగ్యమని యెంచుచున్నాను. ఈ విషయమున శ్రీ దోమకొండ సంస్థానాధీశుల యౌదార్యాభిమానముల మరల మరల బ్రశంసించు చున్నాను.

— మాడపాటి హనుమంతరావు

శ్రీ రామాయనమః

## గునుపాటి ఏనాదిరెడ్డిగారి అభిప్రాయము

శా. శ్రీరాజేశ్వర రాజవర్య స్వకుల శ్రేయంబుకై క్షత్రియా
చారంబిప్పుడు నుద్ధరించుటకునై చర్చించి వి
స్తార ద్రవ్యము వెచ్చఁబెట్టి కులతత్వంబిట్టిదం చెంతయున్
సారాచార విచార సత్కవులచే స్థాపించితౌ మేల్భళీ.

పంచపాది

సీ. మునుకవిసార్వ భౌముఁడు వేమ భూపాలు
డఘమర్షణస్నాన మనుదినంబు
నాచరించె నటన్న యామహావాక్యమే
వేదాధికారంబు విశదపరచె
కాటయవేమ భూకాంతు సతీర్థుఁడై
భాష్యంబుఁజదువఁడే బ్రాహ్మణుండు
కర్మలు వదలిన కారణంబున గంగతోఁ
బుట్టువు లటంచుఁ దొల్లిపలికి
రింతమాత్రముననే యినచంద్ర వంశ సం
బంధ బాంధవ్యముల్ బాసిచనునె

తే.గీ. రట్టడులు రాష్ట్రకూటులు రడ్లు రెడ్లు
వర్ణవికృతులు భాషలో వఱలు టరుదె
నేటికి శుభాశుభాచార నియతు లెల్ల
క్షత్రియులకును మనకును సమముగాదే.

చ. శ్రమమె ప్రయాసమంచనక శాంతముగా మదినోర్చి సత్కవుల్
క్రమమగు శాసనమ్ములును గ్రంథచయంబొడ గూర్చి సత్యమున్

విమల మనస్కులై తెలిపి విశ్రుత కీర్తిగడించి రాష్ట్రులై
సుమహితులై కృతజ్ఞత వసుంధరరెడ్డి కొలంబొనర్పఁగన్.

రెడ్డిరాజుల ఔదార్య శౌర్య సాహస విక్రమాదులు శ్రీనాథాది మహాకవుల వర్ణనలను మనజాతి యాచార వ్యవహారాదులును నా చిన్నతనము నుండియు జర్చించి చూచి రెడ్డికులము క్షత్రియ కులమను దృఢ మనస్కుండనై మిత్రులతోడను పండితులతోడను చర్చలు సేయుచుంటిని. బ్ర.శ్రీ. మ॥రా॥రా॥ శ్రీ చిలుకూరి వీరభద్రరావు పంతులుగారితోఁ జర్చించినపుడు రెడ్ల చరిత్రమును ప్రత్యేకముగ రచించెదమని చెప్పియుండిరి. బ్ర.శ్రీ. మ.రా.రా.శ్రీ వేటూరు ప్రభాకర శాస్త్రుల వారితోఁ జర్చించినపుడు రెడ్లచరిత్రమున కుందగిన ఆకరములను సమకూర్చితిని త్వరలో గ్రంథమును ప్రకటించెద ననిరి. ఆగ్రంథద్వయముంగను భాగ్యమిప్పటికిని లభించదయ్యె. శ్రీ.శ్రీ.జి.యన్.బి. సరస్వతీ స్వాములవారి సన్నిధిఁ బ్రస్తావనము కలిగినపుడెల్లఁ బెక్కులాధారములం దెలుపుచు రెడ్లు క్షత్రియులని నిరూపించుచుంటిని. నెల్లూర శ్రీ మహాముని కావ్యకంఠ గణపతి శాస్త్రులవారొక మహాజనసభ నేర్పరచి యుపన్యసించిరి. మా మండలములోని రెడ్డి ప్రముఖులెల్లరు నాసభ నలంకరించిరి. ప్రస్తావ వశమున శ్రీశాస్త్రులవారు రెడ్లు క్షత్రియులని నిరూపించు ఆజన్మసిద్ధమగు వేదోక్త కర్మలను రెడ్లు వదలుట న్యాయముగాదనియు స్వకర్మల ననుష్ఠింపవలయుననియు బోధించిరి. ఎన్నియో తరములనుండి నిలిచియున్న వేదోక్తకర్మల నిపుడెట్లాచరించవచ్చునని ప్రశ్నించితిని. ప్రాయశ్చిత్తాదులు శాస్త్రసిద్ధములనియుఁ గోరినవారినెల్లఁ బునీతులఁ గావించి గాయత్ర్యుపదేశము గావించుటకు సంసిద్ధుఁడననియు సెలవిచ్చిరి. పోయిన భారమును మరల మాపైఁ మోపకుడని పలికినది నేనే. ఆ విషయమే శ్రీ శాస్త్రులవారు తమ పీఠికయం దొకించుక సూచించిరి. శ్రీనాథాది మహాకవులు గంగసైదోడులని వ్రాయుటకుఁ గారణము వేదోక్త కర్మల మానుటయే. రెడ్డికులము సర్వవిధముల క్షత్రియ కులమనియే మదీయ దృఢాభిప్రాయము.

తమరీ విషయమై యెక్కుడు శ్రద్ధవహించి చక్కని పరిశోధకులును సత్కవి వర్యులును శతావధానులు నగు బ్ర. శ్రీ. మ. రా. రా. శ్రీ. వే. శ్రీమాన్ శేషాద్రిరమణ కవులను

వారికి బాసటగాఁ దమ సంస్థానా స్థాన కవులగు మ. రా. శ్రీ. శ్రీమాన్ పెద్దమందిడి వేంకట కృష్ణకవి గారిని నియమించినందులకా కవిత్రయమువారు మిక్కిలి పరిశోధనముఁ గావించి ప్రయాసమునకోర్చి అనేక స్థలముల కరిగి తగు ఆకరములను సంపాదించి యధార్థమగు రెడ్డికుల నిర్ణయ చరిత్రము రచించినందులకు శ్రీవారికిని "స్వధర్మేనిధనం శ్రేయః" అను భగవద్వాక్యము ననుసరించి స్వకుల శ్రేయ మభిలషించి వేనకొలఁది ధనమును వ్యయించి సోదాహృత పూర్వకముగ రెడ్డికులము క్షత్రియ కులమని దృఢపరచు గ్రంథము వ్రాయించినందులకుఁ దమకును దమ కుటుంబమునకును రెడ్డికులము కృతజ్ఞతాబద్ధమై యుండగలరని విన్నవించుచున్నాఁడ. చిత్తగింపవలయును.

గునుపాటి, ఏనాదిరెడ్డి, క్రొత్తూరు
ఇందుకూరుపేట పోస్టు, నెల్లూరు జిల్లా.

---

## కట్టమంచి రామలింగారెడ్డి గారి అభిప్రాయము



ANDHRA UNIVERSITY
BEZAWADA,
22nd Aug, 1927.

Dear S r,

Many thanks for your Reddy Kula Nirnaya Chandrıka, wh'ch s a most valuable and ınteresting contr bution to the History of the Reddy Communıty. It ıs a well-wr'tten book and the mater als collected are ably presented.

Yours sıncerely,
C.R. Reddy

శ్రీ

## హ. గుండేరావు గారి అభిప్రాయము



గద్వాల

భా.శు-5

౧౮౪౯

భోమహారాజ;

భవద్భిః ప్రేషితా రెడ్డికులనిర్ణయ చంద్రికా ఆమూలాగ్రం సాదరం సావిమర్శం విలోకితావ్యుత్పత్తి రెడ్డిశబ్దస్యయాతత్రప్రతిపాదితా। రెడ్డీ, రెట్టీ, మరాఠీ, చ మహారాష్ట్ర్యా ది యోగతః రాష్ట్రిప్రకృతికేనైవ భవితవ్యంష్విరెడ్డినా॥ రూఢాచారైః శిలాలేఖైః ప్రాచీన కవిసూక్తిభిః నిర్దోషం స్థాపితా రెడ్డిజాతే రాజన్యతా। వర్ణాశ్రమ విభాగే, యచ్చాసీ ద్రాష్ట్రహితం పురామన్యే తన్మేల నేనైవ తదిదానీం లభిష్యతే। అత్యున్న తార్కేందు వంశప్రసూతి రేవహి, రెడ్డిన్ సదా సదాచారే ప్రవర్త యతుసత్వరం.

హ. గుండేరావు

శ్రీ

# తాటికొండ తిమ్మారెడ్డిగారి అభిప్రాయము

మహారాజ రాజశ్రీ రాజా రాజేశ్వరరావు బహాదురు గారి దివ్యసన్నిధికి.

తిమ్మారెడ్డి సాష్టాంగ దండము లొనర్చి విన్నవించుకొను టేమనిన "రెడ్డికుల నిర్ణయచంద్రికను" సాంతముగాఁ గనియమందానంద కందళిత హృదయుఁడ నైతిని. కుచ్ఛిత బ్రాహ్మణుల స్వార్థ పరాయణత్వ బోధచేఁ జిరకాలమునుంచి బూడిదగప్పిన నిప్పులవలెఁ బ్రచ్ఛన్నముగ నున్న క్షాత్రవ్యక్తిని వెల్లడించుటకు వ్యయప్రయాసాదులను లెక్కింపక యీ గ్రంథము జారిత్రిక శాసనాది బహువిధ ప్రమాణ యుక్తముగా రచియింపజేసి రెడ్డిమహాజనులకు మఱచినక్షాత్ర ధర్మావేశమును గలుగ జేసినందుకు రెడ్డి సంఘమంతయుదమకు కృతజ్ఞులనుటకు నిసుమంతయు సందియములేదు. స్వధర్మాచరణావశ్యక మని కృష్ణభగవాను లానతిచ్చిన శ్రీ గీతానుసారము పాటుపడి నందుకు నా కృష్ణ పరమాత్ముఁడు తమ కాయురారోగ్య మొసంగవలయునని త్రికరణశుద్ధిగా బ్రార్థించువాడను. ఇంతే దండములు.

విధేయుఁడు

తాటికొండ తిమ్మారెడ్డి

## కంఠీరవాచార్యులగారి అభిప్రాయము

తాముపంపిన రెడ్డికుల నిర్ణయచంద్రికయను చరిత్ర గ్రంథము ఆధునిక సంప్రదాయానుసారులకు గుణకర్మలవల్ల జాతిసిద్ధించుననిన్ని, ప్రాచీన సంప్రదాయానుసారులకు శాసనముల ద్వారా క్షత్రియవంశీయులనీన్ని, ఉభయులకు ఆనందజనకములై విరాజిల్లగలదని నేను దృఢముగా నమ్ముచున్నాడ. ఇంతశ్రమించి ఈ గ్రంధమును తమవల్ల ప్రకటింప జేసిన భగవంతుడు తమకు శ్రేయస్సు కలుగజేయుగాక.

ఇట్లు శ్రేయోభిలాషి కంఠీర వాచార్యులు
వనపర్తి సమస్థాన్ విద్వాన్

## పుల్లగుమ్మి వేంకటాచార్యులగారి అభిప్రాయము

శ్రీమంత మహారాజరాజ శ్రీ దోమకొండ సంస్థానాధీశ్వర రాజారాజేశ్వరరావ్ బహద్దూర్ శ్రీ సన్నిధయే కృత ఆశీర్వాదః భవత్ ప్రేషితంపుస్తకం శ్రావణమాస ఏవమదంతి కంప్రాప్తం. తదామధ్వసిద్ధాంత స్థాపకాచార్యైః శ్రీసత్యధ్యాన గురు భిర్విద్వ త్స భాకృతేఆహ్వాయయితేన తన్నికటంగతాగతేనమయా క్షత్రియకులదర్పణం నామపుస్తకం దరీదృశితం తద్విషయకయుక్తి జాలంచ జాజ్ఞాయితం తేనక్షాత్రియీా భవత్సంతతిరితి నిర్మత్సరం జాగదితుం శక్యతే ఇతి గద్వాలా స్థానవిదుషః పుల్లగుమ్మి వేంకటాచార్య స్యాభిప్రాయః -- శ్రీమంత మహారాజ శ్రీ దోమకొండ సంస్థానాధీశ్వర రాజా రాజేశ్వరరావ్‌గారి సన్నిధికి తాము పంపిన పుస్తకము చేరినది. ఆ గ్రంధమంతయుఁ జూచినాఁడను. బాఁగుగానున్నది, దానిఁచేఁదాము క్షత్రియులని చెప్పుట ఏలాటియభ్యంతరముండదు.

గద్వాలాస్థాన విద్వాన్ పుల్లగుమ్మి వేంకటాచార్యః

# రాయప్రోలు సుబ్బారావుగారి అభిప్రాయము



తాముదయతోఁబంపిన రెడ్డికుల నిర్ణయచంద్రికం జదివి యానందించితిని. రెడ్లు క్షత్రియవర్ణమునకుఁ జెందిన వారను విషయమున సంశయములేని వాడనగుట ఇందలి హేతువాదమునాకుఁ జిరపరిచయము.

రెడ్డివర్ణస్థు లచిరము క్షత్రియ పాత్రములయిన ఆచార సంస్కారముల నుద్ధరించి ఆధునిక భారతము నుజ్జీవింపఁ జేయుదురని విశ్వసించు చున్నారు.

**హైద్రాబాదు. భాద్రపద బ॥ ౬ లు**



# కృతజ్ఞత

ఈ రెడ్డికుల నిర్ణయచంద్రికను శ్రద్ధాయుక్తులై పండితులచే వ్రాయించి ముద్రించి ఆంధ్ర చారిత్రక పరిశోధనకుఁ దోడుపడి, రెడ్డిసంఘమును తన జాతీయతా విషయమున మేలుకొలిపిన శ్రీ దోమకొండ సంస్థానాధీశ్వరులగు శ్రీ రాజా రాజేశ్వరరావు బహద్దరుగారు చాల ధన్యులు. ప్రశంసా పాత్రులు.

ఈ గ్రంథముపై ఖర్చులుపోగా మిగిలిన యాదాయమును హైద్రాబాదులోని రెడ్డి హాస్టలునకై యయాచితముగా ననుగ్రహించిన శ్రీ రాజులుంగారి యౌదార్యమును రెడ్డి విద్యార్థి వసతి గృహ కార్యనిర్వాహక సభ్యులు కడుంగడు ఁబ్రశంసించుచు వారికిఁ గృతజ్ఞతా బద్ధులై యున్నవారు.

రెడ్డి విద్యార్థి వసతి గృహము
హైద్రాబాదు, దక్కన్
కార్తీకశు ౧౫

ఇట్లు
సురవరము ప్రతాపరెడ్డి
గౌరవ కార్యదర్శి



క్షీరా రామేశ్వరాలయ గోపురమందలి యజ్ఞోపవీత ధారులగు రెడ్ల విగ్రహములు, పాలకొల్లు

# పీఠిక

బ్రహ్మశ్రీ శతావధానులు శేషాద్రిరమణ కవులును, శ్రీమాన్ పెద్దమందడి వేంకటకృష్ణ కవిగారును, బహుగ్రంథములను విమర్శించి రచించిన రెడ్డికుల నిర్ణయచంద్రిక నామూలగ్రముగాఁ జూచితిని. దీనికొక పీఠికను వ్రాసియిమ్మని వారు నన్ను గోరిరి. నేను సంతోషముతో నందుల కంగీకరించి యీ పీఠికను వ్రాయుచున్నాఁడను.

మిక్కిలి పరిశోధించి సత్యమును వెల్లడించిన యిట్టి యుత్తమ గ్రంథమునకుఁ బీఠికను వ్రాయునవకాశము లభించినందులకు నాకు సంతసమగుచున్నది.

జాతి భేదమే హిందూ దేశమునందు నశించిన బాగుండుననెడి యాందోళనము విస్తరిల్లు నీ యిరువదియవ శతాబ్దమునందుఁ దిరిగిఁయుఁగుల చర్చలచే నేమిప్రయోజనమని కొందఱు ధీమంతులు ప్రశ్నింపవచ్చును. జాతి వైషమ్యములు నశించుట వాంఛనీయమేయైనను జాతిభేదము నశించుట తత్తజ్జాతీయతకే భంగకరమగుట వలన నది స్పృహణీయము గాదని మాయభిప్రాయము.

వైషమ్యము వేఱు. భేదమువేఱు. ఒక మత సంప్రదాయమునకుఁ జేరిన వారిలో మత సంబద్ధాధికార తారతమ్యముండుట యొక విధమగు వైషమ్యము. ఒక రాజ్యమునకుఁ జేరిన వారిలో రాజకీయాధికార తారతమ్యముండుట యింకొక విధమగు వైషమ్యము. ఈ వైషమ్యద్వయము నిరసింపఁదగినదే యగును. భేదమట్టిదిగాదు. అది ప్రకృతిసిద్ధము. అది నశింపవలెననిన తత్తజ్జాతి ప్రకృతినే నశింపజేయవలెను.

ప్రకృతము మన దక్షిణ హిందూస్థానమునందు హిందువులలోఁ బ్రకృతి సిద్ధములగు మూడుఁజాతులు గలవు. వీనిని మన చరిత్రకారులు ఆది ద్రావిడులు, ద్రావిడులు, (ద్రావిడ పదము ఆంధ్రకర్ణాటములు కేరళములను గూడ సంగ్రహించును) ఆర్యులు -- అని వ్యవహరించుచున్నారు. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులార్యులలోని యంతర్భేదములు. "బ్రహ్మక్షత్ర విశస్త్వార్యాః" అని యమరసింహుఁడు చెప్పుచున్నాడు. ఆర్యపద మీమూఁడు వర్ణముల వారికి జాతి ప్రయుక్తనామమైయున్నది. కర్మ ప్రయుక్తనామము ద్విజాతిపదము.

**"బ్రాహ్మణ క్షత్రియ విశస్త్రయోవర్ణా ద్విజాతయః" మనుస్మృతి.**

పుట్టుకచే నొక జన్మము. సంస్కారముచే మఱియొక జన్మము గలవారగుటచే ద్విజాతులు.

హిందూమతమునందు రెండు శాఖలు గలవు. ఒకటి వైదిక శాఖ. ఇంకొకటి తాంత్రికశాఖ. ఆర్యులు సంప్రదాయమునందు వైదికులుగా నుండి జపపూజాస్తోత్రాదుల యందుఁ దాంత్రికులుగాఁ గూడానున్నారు. ద్రావిడులు తాంత్రికులు. ఆది ద్రావిడులు గూడాఁ తాంత్రికులే కాని ప్రస్తుతము చాల కష్టస్థితిలోనున్న వీరియందు మతశ్రద్ధా చిహ్నములు విరళములుగా నున్నవి.

వైదిక తాంత్రికశాఖలు ప్రధానభాగములలోఁ బరస్పరోపబృంహితములై యున్నను ఆధ్యాత్మిక శక్తిని స్వతంత్రముగా నొక్కొక్కటియే యభివృద్ధి పఱచుటకుఁ జాలియున్నవి. తాంత్రికశాఖకు (శైవవైష్ణవ సంప్రదాయములకు) సంబంధించినంత వఱకు ఆర్యులకును ఆర్యేతరులకును వైషమ్యము, కన్పట్టుచున్నది. ఆర్యులకు నార్యేతరులకునని చెప్పనేల? ఆర్యులలోఁగూడా బ్రాహ్మణులును, క్షత్రియులలోఁ గొందఱును, కొలఁది వైశ్యులును మాత్రమే వైదికాధికార సంపత్తిని గలిగియున్నారు. అధిక సంఖ్యాకులగు క్షత్రియ వైశ్యులు వైదికాధికార దూరులై కన్పట్టుచున్నారు. ఈ తారతమ్యము హిందూ మతస్థులలో నుండి పాఱద్రోలఁబడునపుడే హిందూమతము కళంక రహితమై శోభిల్లఁగలదు. అందులకు హిందూజాతులన్నియు సంకీర్ణములై పోనవసరములేదు. అధికార తారతమ్య రూపమగు వైషమ్యము మాత్రము, తొలఁగుట వాంఛ నీయమైయున్నది.

ఇది యెట్లుసాధ్యమగునని ప్రకృతమునందు విచారింపవలసియున్నది. వైదికుల యొక్క ధర్మప్రమాణ గ్రంథములు రెండు విధములుగా నున్నవి. సనాతన ధర్మబోధకములగు వేదములు మొదటి తరగతివి. ప్రాయికముగా సామయాచారిక ధర్మబోధకములగు స్మృతులు రెండవ తరగతివి. వీఁటిలో రెండవ తరగతి ప్రమాణ గ్రంధములు ఆర్యేతరులకు వైదికాధికారము నిచ్చుటలోఁ బ్రతికూలించుచున్నవి. ఆర్యులగు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యుల విషయములో మాత్రము వేదవేదోక్త కర్మాధికారముల

నిచ్చుటలోనేక కంఠములుగా నున్నవి. సంస్కర్తలు ముందుగా స్మృతులకుఁ గూడ విరుద్ధముగా సంస్కరణమును ముగించి పిమ్మట విశాల సంస్కరణమునకు దిగుట సుకరముగా నుండునని మా తలంపు. ఉన్న చట్టమననుసరించి సంస్కరించుటకును సంస్కారార్థము క్రొత్త చట్టమును సృజించుటకును మిక్కిలి తారతమ్యము గలదు. స్మృతులు చట్టములవంటివి. అవి కాలానుసారముగా మార్పుజెందుటకు దోషములేదుగాని యట్లు మార్పు సేయుటకు సంఘబలము గావలసియున్నది. ప్రాచీన స్మృతి సమ్మత సంస్కరణమునకే సంఘమునకు బలము చాలనపుడు క్రొత్త స్మృతిని రచించుటకు సంఘము శక్తమగునా? కనుక స్మృతిసమ్మత సంఘ సంస్కరణముచే ముందుగా సంఘమునందు బలమును గలిగించి సంస్కరణాభిమానమునంకురింపజేసి పిమ్మట సంస్కర్తలు తమ విశాలాదర్శమునకు గృషి సల్పనర్హులు.

స్మృతి సమ్మత సంస్కరణమునకు ప్రస్తుతము వేదాధికారములేని క్షత్రియ వైశ్యకులముల వారి నెఱుంగుట యత్యంతావశ్యకము.

రెడ్డికుల నిర్ణయ చంద్రిక దక్షిణ హిందు స్థానములోని యొక గొప్పజాతియొక్క తత్త్వమును బయల్పఱచి సంస్కరణాభిమానులకు జాలవరకుఁ దోడ్పడుచున్నది. గ్రంథకర్తలు రెడ్లను ఆర్యక్షత్రియులని ఋజువు చేయుచున్నారు.

వీరిచ్చిన కారణములలో మొదటిది పూర్వకాలమున రెడ్లు ప్రసిద్ధక్షత్రియ కుటుంబములతో సంబంధ బాంధవ్యములు సేయుట. ఎంత కనీసముగాఁ జూచినను వేయిసంవత్సరములకు ముందే హిందూసంఘములోని యంతర్జాతి వివాహములు నిలిచిపోయినవియని చెప్పవచ్చును. కనుక గ్రంథకారులు చూపించిన కారణము రెడ్లు క్షత్రియులని నిరూపించుటకుఁ జాలియున్నది. అప్పుడు కూడా జాత్యంతర వివాహములున్నవియని వాదమున కంగీకరించినను అనులోమములుండ వచ్చునుగాని ప్రతిలోమములుగూడ నుండుననుటకు వలను పడదు. ప్రతిలోమ వివాహములన్ని స్మృతి గ్రంధములలో నేకకంఠముగానిషేధింపఁబడియున్నవి.

గ్రంథకర్తలు చూపిన సంబంధములలో సూర్యవంశీయ కరికాల చోడవంశ సంభవుఁడగు భక్తీశ్వర చోడుని కొమారుఁడు భీమరాజు తన కొమారితె వేమాంబికను

రాజమహేంద్ర వరమునందలి అల్లాడరెడ్డికిచ్చి, పెండ్లి చేసిన సంబంధమొకటి. చంద్రవంశక్షత్రియుడగు దంతులూరి గన్నభూపాలుడు తన కొమారితె సూరాంబికను అద్దంకిధరణికోట కొండవీడులను బరిపాలించిన అనవేమారెడ్డికిచ్చి పెండ్లిజేసిన సంబంధ మింకొకటి, చంద్రవంశస్థుఁడును సుప్రసిద్ధుఁడునగు హరిహరదేవరాయులు తన కొమారితె హరిహరాంబను కాటయ వేమారెడ్డికిచ్చి పెండ్లిజేసిన సంబంధము మఱియొకటి. ప్రతి పక్షుల వాదప్రకారము రెడ్లు శూద్రులైన పక్షమున రాజ్యాధిపతులగు క్షత్రియులుతమ కొమారితెలను శూద్రులకిచ్చిరని చెప్పవలసివచ్చును. ఇది సకల ధర్మశాస్త్ర సమయాచార విరుద్ధముగాన నెంత మాత్రము విశ్వసింపఁదగి యుండదు. భీమరాజు, హరిహరరాయలు, గన్నభూపాలుఁడుగూడ శూద్రులనియే వాదించిరేని శాసనగ్రంథాధారములను విశ్వజనీన ప్రసిద్ధినిగూడఁ దిరస్కరించి “సర్వంకల్ల సాగరంకల్ల” అని వాదించెడి యట్టివారితో మాకు వాదింపఁబనిలేదు. పరాశర మాధవీయములో మాధవాచార్యులు “క్షత్రియ వైశ్య రూపేణోచ్ఛిన్న త్వాత్” అని చెప్పియుండిరి గాన హరిహరరాయలు మొదలగు వారు క్షత్రియులుగారని యొకవాదము రావచ్చును. పారాశరస్మృతిలోఁ బ్రాయశ్చిత్త కాండములో నాలుగు వర్ణముల వారికిఁ బ్రాయశ్చిత్తములు విధింపఁబడినవి. ఆ ఘట్టమునకుఁ గూడ మాధవాచార్యులు వ్యాఖ్యను వ్రాసినారు. పారాశర ప్రాయశ్చిత్త కాండము కలియుగము నిమిత్తమే లఘువుగా వ్రాయఁబడినదియని మాధవాచార్యుల వారును అతనితోటి నిబంధన కారులందఱును ఏకకంఠ్యముతో నంగీకరించుచున్నారు. కలియుగము నందు క్షత్రియ వైశ్యులే లేనియెడల వారికీఁప్రాయశ్చిత్తములను జెప్పనేల! పరాశరస్మృతి యందంతటను క్షత్రియ వైశ్యులనుద్దేశించిన విధులు గలవు. దానిని గలియుగ స్మృతియందురు. కనుక మాధవాచార్యులవారి పైవాక్యము పూర్వపక్ష వ్యాఖ్యాంశములోనిది యని చెప్పకతప్పదు.

కుంభకోణ శంకరాచార్య మఠములో నొక తాళపత్ర గ్రంధములో మాధవాచార్యుల వారు వ్రాసిన శాసనమొకటి గలదు. దానిలో నొక దీర్ఘ దర్శనము (ప్రాఫీసీ) గలదు. రెండు సంవత్సరముల క్రిందట నాకోరికపై మఠము యొక్క సర్వాధికారిగారు నాకొక కాపీని పంపినారు. దానిలో నుండి ప్రకృతమునకుపయోగించు వఱకుఁ గొన్ని శ్లోకముల నిచ్చట నుదాహరించు చున్నాను.

శ్లో॥ సత్యసంధంద యాశీలం ధీరోదాత్తగుణాన్వితం ॥
దాక్షిణ్య నిరతంధర్మ కుశలం శివతత్పరం ॥
ప్రతాపశాలినం వీరం తపోనిష్ఠం దృఢవ్రతం ॥
ఏవంవిధం పురస్కృత్య విరూపాక్ష స్యసన్నిధా ॥
పుణ్యాభిషేక విధినా అభిషిచ్యతతఃపరం ॥
సింహాసనంచ కటకం కిరీటం త్రిగుణాత్మకం ॥
కురువంశ ప్రసూతాయ ఇందుక్షేత్ర భవాయచ ॥
సత్యసంధాయ శాంతాయ రాజ్ఞేహరి హరాయచ ॥
దత్తంమయా దయాధీన చేతిసాధర్మ హేతవే ॥
సింహాసవ సపర్యాంస కృత్వాభూమి మపాలయత్ ॥
తతస్తుబుక్క భూపాల స్తత్సా మ్రాజ్యాభిషేచిత ॥
యధావత్సోపి పృథివీం అపాల యదరిందమ ॥
తతస్తద్వంశ జాఃకేచి త్సంరక్షిష్యంతి చాసనం ॥

---

తతస్సుక్షత్రియైః కైశ్చి దాక్రమ్య బలిభిస్వయం ॥
పాల్యమానే సతిపురే మర్మసంధివిభేదనైః
అతిక్రుద్ధారాజ్యలక్ష్మీః క్షత్రియాంస్తాన నంతరం ॥
యుద్ధేహనిష్య తిక్షిప్రం అకాండేచండ విక్రమః
యంత్రరూపేచ నగరే యదామర్మ విభేదనం ॥
తదాసింహాసనస్యాస్య విచ్ఛేదోజాయ తేధ్రువం ॥
తతస్తుబాహు జాస్సర్వే పలాయంతేదిగంబరాః ॥

---

ఈ శ్లోకములలో మాధవాచార్యులవారు హరిహరి రాయులను కురువంశ సంభవునిగాఁ గంఠోక్తిగఁ జెప్పుచున్నారు. హరిహర వంశమునకుఁ బిమ్మట మఱియొక

వంశము రాఁగలదనిచెప్పి దానికిఁ బిమ్మట నొక సుక్షత్రియ వంశముఁ గలదని దీర్ఘదర్శనముతోఁ జెప్పుచున్నారు. ఆసుక్షత్రియ వంశమే కృష్ణదేవరాయులవారు ప్రాదుర్భవించిన వంశము. శ్రీచక్రాకారముగాఁ గట్టబడిన విజయనగరములో మర్మసంధివిభేదము అనఁగా కట్టడముల మార్పుచే చక్రమర్మ సంధులకు విచ్ఛిత్తియై నపుడు విజయనగర నాశమగునని వారి దీర్ఘదర్శనము. అప్పుడు బాహుజులు పలాయితులగుదురని వారు చెప్పిరి. ఈ దురదృష్టయుత సందర్భము తల్లికోట యుద్ధానంతరము జరిగినది. వారు పై శ్లోకములలోఁ బ్రయోగించిన సుక్షత్రియ క్షత్రియ బాహుజశబ్దములు గూడఁ గలియుగములో క్షత్రియ సత్తకు వారి దృష్టి ప్రతికూలముగా లేదని తెలుపుచున్నది.

ప్రకృతము ననుసరింతము. రెడ్లు క్షత్రియులనుటకు గ్రంధకారులుచూపిన రెండవ కారణము రెడ్లు దానశాసనములోఁ దమను క్షత్రియులనుగాఁ జెప్పుకొనుట. హంపి నృసింహాలయ శాసనములో ప్రోలరెడ్డి తనను శ్రీరామవంశ సంభవ సుమిత్రపౌత్ర రాష్ట్రకూట రాజుగారివంశమున బుట్టినవానిగాఁ జెప్పుకొనుచున్నాడు. ఈ శాసనము రెడ్లు రాష్ట్రకూట క్షత్రియులని నిర్ధారణ సేయుటకుఁ దోడ్పడుచున్నది. శాసనములలో రెడ్డి పదమునకు బదులు రడ్డిపదము కన్పట్టుచున్నది. రాష్ట్రకూటులే రారోడులనియు రడ్డులనియు వ్యవహరింపబడినారని విమర్శకులగు చరిత్రకారులు సిద్ధాంతీకరించుటచే గ్రంథకారుల భారము చులకనయ్యెను. సంస్కృత భాషలలో రాష్ట్రశబ్దము రాజ్యవాచకముగా నుండుటచే గాక రాజవాచకముగాఁగూడ నున్నది.

"అహం రాష్ట్రీ సంగమనీ వసూనాం"

ఋగ్వేదము ౧౦ మం-౧౨౫ సూ౩ మంత్రం

"అహంరాష్ట్రీ । ఈశ్వర నా మైతత్.

సర్వస్య జగత ఈశ్వరీ" అని సాయనభాష్యము ఈశ్వర వాచకమగు రాష్ట్రశబ్దమునుండి స్త్రీ ప్రత్యయాంత రాష్ట్రీశబ్దమునిష్పన్నమగుచున్నది. ఈశ్వరుఁడనఁ గా అధిపతి. కూట శబ్దము శిఖరవాచకము. రాష్ట్రకూట శబ్దముయొక్క సముదాయార్థము "అధిపతులకు శిఖరము వంటివాడు" అని తేలినది. రారోడు పదము రాష్ట్రకూట

శబ్దభవమగు రట్టశబ్దమునుండి నిష్పన్నమగుచున్నది. నామైన దేశేనామ గ్రహణం అను న్యాయముచే భీమసేనుని భీముడనిట్లు రాష్ట్రకూటుని రాష్ట్రుఁడనవచ్చును. అసలు రట్టిపదమే వీరి మూలపురుషునకున్నట్లు గ్రంథకారులు చూపిన యింకొక యాధారమువలనఁ దెలియుచున్నది. అపుడు నామైక దేశ న్యాయావసరము లేదు. ఏ విధముగాఁ జూచినను రడ్డిశబ్ద వికృతియైన రెడ్డి శబ్దము రెడ్లు క్షత్రియులని చెప్పుటకు సహాయపడుచున్న విషయము స్పష్టము. రెడ్డిశబ్దము ఈశ్వరవాచకరాష్ట్ర శబ్దభవమనుటకు దేవతలకు రెడ్డిశబ్దము నుపయోగించిన సీసపద్యము గూడ గమనింపఁ దగియున్నది'. మలలపై సిద్ధహోబలము సింగారెడ్డి' తిరువళ్లూరు వీరరాఘవస్వామి దేవాలయమునందు శిలాశాసనములో పెదకోమటి వేమారెడ్డి తనను సూర్యవంశఁజునిగాఁ జెప్పుకొనుటయు, శ్రీ వైకుంఠ విష్ణుక్షేత్రము నందు శిలాశాసనములో రాజమహేంద్రవరపు నాగిరెడ్డి తనను సూర్యవంశజునిగాఁ జెప్పుకొనుటయుఁ గూడ నిచ్చట గమనింపఁదగి యున్నవి.

రాష్ట్రకూటులు సూర్య వంశజులేయైనను వారి లోఁగొందఱు చంద్రవంశజులమని చెప్పుకొనుటలోఁగారణము కొన్ని సంస్థానములలో రాష్ట్రకూటుల పురుషసంతతివిచ్ఛిన్నమై స్త్రీ సంతతి వచ్చియుండుననియు, అది చంద్రవంశమునకు సంబంధించినదై యుండుననియు నూహింపవలసి యున్నది. గుండ దండనాథుని భార్యకుప్పాంబిక సూర్యవంశజ బుద్ధయ రెడ్డి కొమారితెయని చెప్పుబూదపూరి శాసనము, గ్రంథకారులకు రెడ్లు క్షత్రియులని ఋజువు సేయుటకు వేఱొకసాక్ష్యమైయున్నది.

రాయచూరి శాసనములోఁ గోనగన్నారెడ్డి (బుద్ధయరెడ్డి తండ్రి) తననుమనుకుల మార్తాండుని గాఁ జెప్పుకొనుట బూదపూరి శాసనమునకు బలమునిచ్చుచున్నది.

రెడ్లు క్షత్రియులనుటకు గ్రంథకారులు చూపిన మూఁడవకారణము కవులు తమ గ్రంథములలో రెడ్లను క్షత్రియులను గావర్ణించుటయై యున్నది.

నిశ్శంకునికొమ్మనామాత్యుఁడు శివలీలావిలాసమున నల్లాడరెడ్డి కుమారుఁడగు వీరభద్రారెడ్డిని సూర్యవంశసంభవునిగాఁజెప్పుటయు, పట్టమెట్ట సోమనాథ సోమయాజి సూతసంహితలో ప్రస్తుత దోమకొండ సంస్థానాధీశ్వరుల పూర్వుఁడగు కామారెడ్డిని

సూర్యవంశజ కామినేని చౌదరిగారి వంశమునందుఁ బుట్టినట్లు చెప్పుటయు. కాణాదము పెద్దన సోమయాజి అధ్యాత్మ రామాయణమునందు ప్రస్తుత గద్వాల సంస్థానాధీశ్వరుల పూర్వుఁడగు సోమభూపాలుని సోమవంశజునిగాఁ జెప్పుటయు ద్విపద భారతమున కోరుకొండ దుర్గముఁ బాలించిన జయపురము రామిరెడ్డి తనను సూర్యవంశజునిగా జెప్పుకొనుటయు ముఖ్యముగా నిచ్చట గ్రంథకారులుదాహరించిన యాధారములు. వీరుచూపిన నాల్గవకారణము చాల ముఖ్యమైనది. అది రెడ్లు రాష్ట్రకూటులనియనుమానించుటకు సాధనమగుచున్నది. రాష్ట్రకూటులు సింహధ్వజ లాంఛనులు. చాలమంది రెడ్లు కూడా తాము సింహధ్వజ లాంఛనులమని చెప్పుకొన్నారు.

ఇట్లనేక కారణములచే గ్రంథకర్తలు రెడ్లను క్షత్రియులనుగా ఋజువు చేసియున్నారు. వీరు చూపిన గ్రంథశాసనాధారములవలన రెడ్లు క్షత్రియుల విషయములో నేను మిక్కిలి తృప్తుఁడనైతిని. నేను నెల్లూరు జిల్లాలోను రెడ్ల ననేకులను జూచియున్నాను. వారి ముఖనేత్రాది రేఖలను జూచినపుడు నాకు క్షత్రియులని తోఁచినది. దీనినొక గొప్పకారణముగా నేనుదాహరింపఁ దలంపక పోయినను తత్తజ్జాతి శారీర చిహ్న పరీక్షకుల కొకపనిని గల్పించుటకీ రెండు ముక్కలను వ్రాసియున్నాఁడను.

కొన్ని గ్రంథములలోను శాసనములలోను రెడ్లు చతుర్థులని యుండుటవలన వారు శూద్రులని యొక ప్రతివాదము వినఁబడుచున్నది. ఆ గ్రంథశాసనములోని చతుర్థపదము శూద్రపరమైనపుడు మనకొక సందేహము కలుగును. గ్రంథకారులనుకూలముగా నుదాహరించిన సంగతులు ఆయా గ్రంథములలోను శాసనములలోను గొప్పకొఱకు వ్రాయఁబడిన అసత్యములని చెప్పవలసి వచ్చును. లేదా ప్రతికూలముగా వ్రాయబడిన సంగతులు భ్రాంతి మూలకములని చెప్పవలెను. ఈ విషయములో గ్రంథకారులు చతుర్థపదము శూద్రజాతి పరముగాదని చెప్పుచు క్షత్రియులలోనే యొకతెగ వారి నా పదము చెప్పునని సయుక్తికముగా పరస్పర విరోధములను పరిహరించి సామరస్యము కలుగఁచేసి యున్నారు.

ప్రమాణ భూతములగు నాధారములకుఁ బరస్పరవిరోధము కలిగినపుడు విరోధ పరిహారమగునట్లు వ్యాఖ్యానముచేయుట మంచి పద్ధతి. ఒకవేళ కొందఱు రెడ్లు తమ గొప్పకొఱకుఁదాము క్షత్రియులమని జెప్పుకొనుటయు, కవులు ధనలోభముచే వారిని క్షత్రియులనుగాఁ బరికీర్తించుటయు జరుగవచ్చునని వాదమున కంగీకరించినను ప్రసిద్ధ క్షత్రియులగు చోడచాళు క్యాదులు రెడ్లకుఁదాము పిల్లల నిచ్చియు వారిపిల్లలను దాము పరిగ్రహించియు సంబంధములను నెరపుట లోభ మూలకముగాని దంభమూలకము గాని కానేరదుగదా!! రెడ్లు క్షత్రియులతో సంబంధములను జేసికొనినందున తమను క్షత్రియులనుగాఁ జెప్పికొనిరనుట సాహసము. ఇప్పుదు రెడ్లుతమను క్షత్రియులనుగానేలఁ జెప్పికొనిరనుట సమాధేయ విషయముగాదు. బ్రసిద్ధ క్షత్రియులు వారితో నెట్లు సంబంధముఁ జేసిరను విషయమేప్రకృతము. ఇచ్చట భ్రాంతియనుమానింప శక్యముగాదు. ఆంధ్రదేశములోనే నివసించి యాంధ్రులసంగతిని జక్కఁగా నెఱింగిన చోడకులోత్పన్నులకు భీమరాజు అల్లాడరెడ్డి వంశమును గుఱించి తెలుసుకొనఁ జాలక పోయెననుట ప్రాజ్ఞులచే విశ్వసింపఁదగిన విషయముగాదు. దంతులూరి గన్న భూపాలుఁ డు అనవేమారెడ్డి వంశమును హరిహరరాయలు కాటయ వేమారెడ్డి వంశమును దెలుసుకొన జాలకపోయిరనుట కూడ సాహసోక్తియే యగును. జయించి బలవత్తరముగాఁ బెండ్లి చేసికొనిరని చెప్పుటకు నిదర్శనములు లేశమాత్రములు లేవు. ధనలోభముచేఁ బిల్లల నిచ్చిరనుటకు గన్యాప్రదాతలు దరిద్రులుగారు. వారు గొప్పరాజులు కనుక గ్రంథకారుల వలంబించిన సామరస్య పద్ధతియే బాగున్నది. నాగపురపు ప్రాంతము నందలి రెడ్లకు ఇప్పటికి వేదోక్తా ధికారములున్న విధము చూడఁగా నీ సంగతి నింకను సులభముగాఁ బరిష్కరింప సాధ్యమగుచున్నది. వారు మాటలాడు మాతృభాష తెలుగుగా నున్నందున నాంధ్ర దేశము నుండి వలసవోయినవారని వారిని మనము నిశ్చయింపవచ్చును. వారిచ్చట నుండి వలసపోయిన సమయమున రెడ్లకు వేదోక్తాధికారములుండెననియుఁ బిమ్మట నీ యాంధ్రదేశములో స్వప్రమాదవశము చేతనో బ్రాహ్మణ సాహాయ్యకము లభింపమిచేతనో? యా యధికారము క్షీణించి నదనియును చెప్పవచ్చును. ఈ దేశములో బ్రాహ్మణులున్నంత మాత్రమున బ్రాహ్మణ సాహాయ్యకము లభింపవలసినదియని చెప్పుటకు వల్లపడదు. అందఱిచే వైశ్యులుగా

గ్రంథాలయ
18801

నంగీకరింపఁ బడిన మన కోమట్లకు ప్రస్తుతము బ్రాహ్మణ పూర్ణమగు మనదేశములో బ్రాహ్మణ సాహాయ్యకము మృగ్యమైయున్నది గదా!! ఈ సందర్భము నిజమైన పక్షమున నాంధ్రదేశీయ బ్రాహ్మణులకంటె నాగపుర ప్రాంత బ్రాహ్మణులు దారులని చెప్పవలసి యున్నది. ఇప్పుడు గుజరాతి దేశమునందలి వైశ్యుల (బనియాల) వలె మన రెడ్డికులులగు క్షత్రియులు యజ్ఞోపవీతశూన్యులై కన్పట్టుచుండుట శోచనీయముగానున్నది. కొందఱు నవనాగరికులగు రెడ్డిబాలకులు మాకా జందెములబాధ తిరిగియు వలదని చెప్పినను మా వంటివారు మాత్రము వారికీ బాధను తప్పక కలుగఁజేయవలెనని యున్నారు. అట్టి వారలు జందెములతో నుండిన తమ ప్రాచీనుల శిలా విగ్రహములను గమనింపఁ గోరెదను. ఇట్లు రెడ్లు రాష్ట్రకూటాపర నామక క్షత్రియులను నిర్ధారణమైయున్నది. అన వేమారెడ్డి అఘమర్షణ స్నానముచేసినట్లు దొరికిన గ్రంధాధారము నొకదానిని చదువరులకు జ్ఞాపక పఱచి యింతటితో నీ వాదకాండమును ముగించుచున్నాను. అఘమర్షణ స్నానమనఁగా అఘమర్షణ సూక్తముచేజలము నభిమంత్రించి స్నానము చేయుట. వేదాధికారము లేని వాఁడఘమర్షణ మంత్రములను బఠించుటయెట్లు పొసగును!

రెడ్లు ధర్మ శాస్త్రోక్త రీతిగాఁ బ్రాయశ్చిత్తము నాచరించుకొని తిరిగియు క్షత్రియోచిత సంస్కారములను బొందనర్హులని మా యభిప్రాయము. ఎన్ని తరములైనను ప్రాయశ్చిత్తమునకు ధర్మశాస్త్రమవకాశము నిచ్చుచున్నది.

“అథయస్య పితాపితా మహా ఇత్యనుపేతౌస్యాతాంతే బ్రహ్మసంస్తుతా ః తేషానుభ్యా గమనం భోజనం వివాహమితిచ వర్జయేత్ తేషామిచ్ఛతాం ప్రాయశ్చిత్తం యధాప్రథమేతిక్రమే ఋతురేవం సంవత్సరః అధోపనయనం తతఉదకోపస్పర్శనం ప్రతిపూరుషం సంఖ్యాయ సంవత్సరాన్యావంతో నుపేతాస్స్యుః సప్తభిః సావమానిభిః “యదంతి యచ్చదూరకే” ఇత్యేతాభిః, యజుష్పవిత్రేణ, సామపవిత్రేణాంగిరసేనేతి. ఆపితావ్యాహృతిభిరేవ అధాధ్యాప్యః అథయస్య ప్రపితామహాది నానుస్మర్యత ఉపనయనంతే శ్మశాన సంస్తుతాః తేషామభ్యాగమనం భోజనం వివాహమితిచ వర్జయేత్ తేషామిచ్ఛతాం ప్రాయశ్చిత్తం ద్వాదశ వర్షాణి త్రైవిద్యకం బ్రహ్మచర్యంచరేత్ అథోపనయనం

తతఉదకోపస్పర్శనం పావమాన్యాదిభిః అథగృహమేధోపదేశనం నాధ్యాపనం తతోయోనివర్తతే తస్య సంస్కారో యాప్రథమేతిక్రమే తతఉర్ధ్వం ప్రకృతివత్"

ఇవి యాపస్తంబ ధర్మ సూత్రములోని ప్రాయశ్చిత్త విధాయక వచనములు (మొదటి పటముల) దీనిలో మొదట బితృపితామహులుపనీతులు కానపుడు ప్రాయశ్చిత్తము చెప్పిఁరెండవ భాగములోఁ బ్రపితా మహాదులెందరైనను అనుపనీతులగునపుడు ప్రాయశ్చిత్తము చెప్పఁబడియున్నది.

దేశకాలానుసారముగా నా ప్రాయశ్చిత్తమునకు ప్రత్యామ్నాయములను విధించుటకుఁ బరిషత్తు కధికారము గలదుగాన నీ విషయములోఁ బరిషత్తు చెప్పిన ప్రాయశ్చిత్త ప్రత్యామ్నాయముల వలనఁ బూతుఁడై యుపనీతుఁడు కావచ్చును. యథోక్త ప్రాయశ్చిత్తమునే ఆచరింప నిచ్ఛగల వారట్లు చేయవచ్చును. కొందఱు పండితులు మొదటిభాగములో గూడ ప్రపితామహాదుల నుపనీతులగు వారికిఁ బ్రాయశ్చిత్తము విధింపబడియున్నది యని వ్యాఖ్యానము చేయుచున్నారు. ఏది యెట్లున్నను ప్రాయశ్చిత్తమున్నది యనుట నిర్వివాదము. రెడ్డి సంఘీయులు పునరుపనయనా పేక్షయు క్షత్రియోచిత్ర వైదిక కర్మాపేక్షయుఁ గలిగియున్న యెడల విశాల హృదయులగు పండితులు నిబంధన గ్రంధములను గూడఁ జక్కఁగాఁ బరిశీలించి ప్రాయశ్చిత్త వివరములను సుకరముగా నుపదేశింపసిద్ధులై యుందురని విశ్వసించుచున్నాను. •

శ్రీమాన్ శేషాద్రి రమణ కవులును వేంకటకృష్ణ కవిగారును రెడ్డికుల నిర్ణయ చంద్రికను విమర్శించి వ్రాసినట్లీ దేశములోని గుప్త క్షత్రియ వైశ్య జాతుల చరిత్రములను బయల్పఱచి దేశాభిమానులగు నాంధ్ర పండితులు కృతార్థులయ్యెదరని యాశించుచున్నాఁడను.

**మహాముని కావ్యకంఠ గణపతి శాస్త్రి**

**తిరువణ్ణామలై**

శ్రీ

# రెడ్డికుల నిర్ణయ చంద్రిక

## ప్రథమ ప్రకరణము

శ్లో॥ దిక్కాలాద్యనవచ్ఛిన్నా
నంత చిన్మాత్రమూర్తయే ।
స్వానుభూత్యేక మానాయ
నమశ్శాన్తాయ తేజసే ॥

ఆర్యావర్తము కర్మభూమి కాననిందు వసించువారలు స్వవర్ణోచిత కర్మలఁ గావింపవలయును. అందులకై ప్రతి మానవుఁడును నిజకులము నెఱింగితత్త దుచిత కర్మానుష్ఠానములచేఁ గడదేరుట ధర్మమై యున్నది. ఈయంశమే శ్రీరామ గీతయందిట్లు చెప్పఁబడియున్నది.

శ్లో॥ ఆదౌస్వవర్ణాశ్రమవర్ణితాః క్రియాః
కృత్వాసమాసాదితశుద్ధమానసః ।
సమాప్యతత్పూర్వముపాత్త సాధనః
సమాశ్రయేత్సద్గురుమాత్మ లబ్ధయే ॥

పైశ్లోక భావమువలనఁ “బ్రతిమానవుఁడు తొలుత వర్ణాశ్రమ ధర్మములను గుర్తించి యనుష్ఠించుచుఁ బరిశుద్ధ మానసుఁడు కావలయును”. పిదప ఆత్మోపలబ్ధి కొఱకు నాచార్యుని సేవింపవలయును” అని తెలియుచున్నది. జాత్యుచిత కర్మాదికములే యుభయసాధనములు గావునఁ బ్రతిమానవుఁడు కర్మానుష్ఠానమునకు ముందు జాతినెఱుంగుట యవసరమై యున్నది. భగవద్గీతలలో శ్రీకృష్ణుఁడు సైతము పూర్వులచేతఁ బూర్వతరులచేతను ననుష్ఠింపఁ బడినకర్మలను జేయుమని చెప్పియున్నాఁడు.

"శ్లో॥ కురుకర్మైవతస్మాత్త్వంపూర్వైః పూర్వతరంకృతం ।" ఈ శ్లోక భావమును బట్టికూడ మానవుఁడు తొలుత తనజాతి నెఱింగి పూర్వుల కర్మాదికముల గ్రహింపవలయునని తెలియుచున్నది. ఇంతియ గాక గీతలలో

శ్లో॥ శ్రేయాన్ స్వధర్మోవిగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ॥
స్వధర్మేనిధనం శ్రేయః పరధర్మోభయావహః ॥

**భగవద్గీతా. అధ్యా 3 శ్లో॥ 35**

అనుశ్లోకము వలనఁ గూడ "పరకీయమగు ధర్మము సుఖముగా నాచరించుటకు వీలైనను దానికంటెఁ దనధర్మమే దోషసహితమైనను మిక్కిలి శ్రేయస్కరమైనది. స్వధర్మానుసారముగాఁ బ్రవర్తించుచు మరణించినను గల్యాణము కలదు. కాని పరుల ధర్మము భయంకరమైనది. తిలకు భగవానుఁడీ శ్లోకమునకు వివరణము వ్రాయుచు నందు స్వధర్మ మనఁగా స్మృతికారులు చాతుర్వర్ణ్య వ్యవస్థాను సారముగఁ ప్రతిమనుజునకు శాస్త్రముచే విధింపఁబడిన వ్యాపారము" అని వ్రాసినాఁడు. కావున నిందుచేఁ బ్రతి మానవుఁడు తన జాతినెఱింగిన స్వస్వ కర్మాచరణమునకు నవకాశము చిక్కును కానఁ బ్రకృతి వ్యవహృత జాతులకనుచితకర్మల నెఱుంగుటకు జాతినిరూపణము మిగుల నవసరమై యున్నది. కావుననే సకల సద్గుణగణవిరాజ మానులు నీతివిద్యా విశారదులును శ్రీ మద్భాగ్యనగర రాజ్యమధ్య విద్యోతమాన శ్రీ మద్దోమకొండ సంస్థాన ప్రభుపుంగవులునగు శ్రీశ్రీశ్రీ రాజారాజేశ్వర రావు బహద్దరు గారీ రెడ్డి వంశీయ చరిత్రమును వ్రాయ మమ్ములను నియోగించినఁ దదాజ్ఞాను సారంబుగ నాంధ్ర ద్రావిడ కర్ణాటాది దేశవిద్యోత మానంబులును రెడ్డివీరుల పురాతన రాజధానులునగు **కొండవీడు, వినుకొండ, బెల్లముకొండ, అద్దంకి, ధరణికోట, కొండపల్లి, కొల్లేరు, కోరుకొండ, రాజమహేంద్ర వరము, రాయచూరు, ఆదవేని** మొదలగు ననేక రాజధానులను తిరువళ్ళూరు, తిరువణ్ణామలై, చిదంబరము, కుంభకోణము, కాంచీవరము, మధుర, శ్రీ వైకుంఠము, హంపి మొదలగు దివ్యక్షేత్రములను, బెజవాడ, గుంటూరు, నెల్లూరు, మద్రాసులోని ఓరియంటల్ లైబ్రరి ఆంధ్రసాహిత్య పరిషత్తు, ఎపిగ్రాఫికా కర్ణాటిక, తంజాపూరిలోని సరస్వతీ పుస్తక భాండాగారము, బొబ్బిలి, పిఠాపురము, విజయనగరము,

అలంపూరు, బళ్ళారి, ఆనగొంది, పానుగల్లు,వర్ధమాను, భూతపురము, కల్వకొలను లోనగు పట్టణములను గ్రామములను పుస్తక భాండాగారములను దర్శించి, అందలి శిలాశాసనములను ముద్రితాముద్రిత గ్రంథములను దేశచరిత్రములను అష్టాదశ పురాణములను శ్రుతిస్మృతులను గ్రామముల కైఫీయతులను దొరతనము వారిచేఁ బ్రకటింపఁ బడిన రిపోర్టర్లను విమర్శించి, వానిలోని యుపయుక్తాంశములను గ్రహించి రెడ్డికుల నిర్ణయచంద్రిక యను నీ గ్రంథము వ్రాయఁబూనితిమి.

## వర్ణవ్యవస్థ గుణకర్మలు

**"తమిద్గర్భం ప్రథమందధ్ర అపోయత్రదేవాః । సమగచ్ఛంతవిశ్వే ।**
**అజస్యనాభావధ్యేకమర్పితం। యస్మిన్ విశ్వానిభువనానుతస్థుః ॥**

బ్రహ్మాండమున దేవతలందఱు చేరియుండిరి. ఆ బ్రహ్మాండము తొలుత మహాసముద్రమునందడఁగి యుండెను. అందే సకల భువనములును సమస్త జీవరాసులును సృష్టికిఁ బూర్వమునందణగి యుండెను. అతఁడే సమస్త భువనములను పరమాత్ముని యాజ్ఞానుసారము సృజించెను. అతనియందే దేవతలందరడఁగి యుండిరి.

పై వాక్యముల వలన విశ్వమునంతఁ దొలుత భగవంతుండు సృష్టించెనని తెలియుచున్నది. "బ్రాహ్మణోస్యముఖ మాసీత్" లోనగు శ్రుత్యాదుల వలనను "యంతుకర్మణియస్మిన్ నవ్యయుక్త ప్రథమం విభుఃసత దేవప్యయంభేజే సృజ్యమానః పునః పునః పునః

తా. సృష్టికర్తయే జీవుని కల్పాంతరకర్మాను సారముగా నేకర్మయందు నియోగించెనో, యాజీవుఁడు మాటిమాటికి సృజింపబడుచు, బూర్వకర్మ ఫలవశమున జాతీయ కర్మనే యాదరించు" అను శ్లోకభావములవలనను జాతులు భగవన్నిర్మితములని చెప్పుచు నింకఁ గొన్ని దృష్టాంతములు విద్వాంసులు శ్రుతిస్మృత్యాదుల నుండి చూపుచున్నారలు. ఆర్షేయగ్రంథములు పెక్కులు జాతివిభాగము గుణకర్మలచే జరుపఁ బడునదేకాని వేఱుగాదని తెలుపుచున్నవి. వీనిని సమన్వయింప వలసియున్నది. యుక్తి వాదమునను సరించి శాస్త్రార్థములను ద్రోసివేయుట మిగుల నింద్యము. ధర్మనిర్ణయము

చేయునప్పుడు శ్రుతి స్మృతులు లోకాచారములు పురాణములు న్యాయమీమాంస ధర్మశాస్త్రములు వేదాంగములైన శిక్షా కల్ప వ్యాకరణ నిరుక్త జోతిషములు అను నీ పదునాలుగు విమర్శింపవలయును. అంతియెకాని కేవల యుక్తి వాదము ననుసరించి వాదించుట శాస్త్రము నవమానించుటతో సమానమగుననియు నట్టివాఁడు కులమునుండి బహిష్కరింపఁదగిన వాఁడని యున్నది.

శ్లో॥ ధర్మంజిజ్ఞాసమానా నాంప్రమాణం ప్రథమం శ్రుతిః ।
ద్వితీయం ధర్మశాస్త్రంతు తృతీయంలోక సంగ్రహః ॥

భారతానుశాసనీకము

శ్లో॥ పురాణన్యాయ మీమాంసాధర్మ శాస్త్రాంగమిశ్రితాః ।
వేదాఃస్థానాని విద్యానాం ధర్మస్య చ చతుర్దశ ॥

యాజ్ఞవల్క్యము. అ3 శ్లోకము

శ్లో॥ యోవమన్యేతతే మూలే హేతు శాస్త్రాశ్రయాద్ద్విజః ।
ససాదుభిర్బహిష్కార్యో నాస్తికోవేద నిందకః ॥

మనుస్మృతి ద్వి. అ.

ఇందుచే విశేషవిధులుగా జాతులు భగవన్నిర్మితములని చెప్పఁబడినను గుణకర్మలచే విభాగింపఁ బడినటులెందేని పూర్వగ్రంథముల యందుఁ గలదేమో విద్యాధికు లీవిధమున నెటులనభిప్రాయ మొసంగిరి తెలిసికొనుట ప్రతిజాతి చరిత్రమునకు నవసరమైయున్నది. ధర్మాధర్మ నిర్ణయమందు నేరములును మన్వాదుల సమయములు ప్రమాణములని యాపస్తంబులును హరదత్తాదులు చెప్పియున్నారు.

శ్లో॥ జన్మశారీర విద్యాభిరాచారేణశ్రుతేనచ ।
ధర్మేణచయథోక్తేనబ్రాహ్మణత్వం విధీయతే ॥
కామభోగ ప్రియాసీక్ష్ణాః క్రోధనా ః ప్రియసాహసాః ।
త్యక్త్వస్వధర్మారక్తాంగా ః తేద్విజాఃక్షత్రతాంగతా ః ॥

భారతము

తా. పుట్టువు దేహము విద్య ఆచారము వేదాదికము శాస్త్రోక్త ధర్మాచరణముల వలన మానవుఁడు బ్రహ్మత్వము నొందుచున్నాడు. కామోప భోగోప రతులు తీవ్రభావులు, కోపస్వభావులు సాహసులు స్వధర్మశూన్యులు రక్త దేహులగు బ్రాహ్మణులు రాజులగుదురని పై శ్లోకముల భావము. ఇందుచే భారతకాలమునఁ జాతుర్వర్ణ్యములు గుణకర్మముల బట్టియే మార్పునొందు చున్నట్లు నాచరణ శూన్యుఁడగు బ్రాహ్మణుఁడు జాతిచ్యుతుఁడై రాజుగమాఱుటచేఁ గులము గుణకర్మాను సారమనియుఁ దెలియును. ఈ అంశమే భారతమునందు నింకను విపులముగా సంశయ రహితముగాఁ జెప్పఁబడినది.

శ్లో॥ బ్రాహ్మణోవాప్య సద్వృత్త స్సర్వసంకరభోజనః ।
బ్రాహ్మణ్యం సమనుత్సృజ్య శూద్రోభవతి తాదృశః ।

కర్మభిశ్శుచిభిర్దేవివిశుద్ధాత్మాజితేంద్రియః ।
శూద్రోపి ద్విజవత్సేవ్యఇతి బ్రహ్మానుశాసనం ॥

స్వభావఃకర్మచ శుభం యత్రశూద్రేపితిష్ఠతి ।
విశిష్టస్సద్విజాతేర్వై విజ్ఞేయ ఇతి మేమతిః ।

నయోనిర్నాపిసంస్కారో నశ్రుతం నచసంతతిః !
కారణానిద్విజత్వస్య వృత్తమేవతు కారణమ్ ।

బ్రహ్మస్వభావఃకల్యాణి సమస్సర్వత్రమేమతిః ।
నిర్గుణం నిర్మలంబ్రహ్మ యత్రతిష్ఠతి సద్విజః ॥

**భారతము. అనుశాసనికము అధ్యా ౨౮**

పై శ్లోకముల భావము గూడ గుణకర్మముల వలన జాతివిభాగ మేర్పడినదనుట కనుకూలముగా నున్నదని తెలియుటకుఁదాత్పర్యము నుదాహరించు చున్నారము. “చెడునడవడి సంకర భోజనము గల బ్రాహ్మణుఁడు శూద్రుఁడగును, జితేంద్రియుఁడు కర్మశుద్ధుఁడు నగు శూద్రుఁడు బ్రాహ్మణునివలె సేవింపదగిన వాఁడని బ్రహ్మయను శాసించిన యంశము. శుభకర్మాచరణ శీలుఁడగు శూద్రుఁడు సామాన్యద్విజునికంటె శ్రేష్ఠుఁడు. జన్మహేతువు సంస్కారము సంతతి, అధ్యయనము వీటితోఁ బనిలేదు.

బ్రాహ్మణత్వమునకు నాచరణమే ముఖ్యము. వృత్తమువలననే బ్రాహ్మణుఁడగును, బ్రహ్మకు సర్వజాతులు సమము. నిర్గుణోపాసకుఁడగు వాఁడే బ్రాహ్మణుఁడు. బ్రహ్మత్వము సహితము గుణకర్మలవలన వచ్చుననియుఁ గర్మచ్యుతులగు బ్రాహ్మణులు శూద్రులౌదురనియు శూద్రులు బ్రాహ్మణులౌదురనియు నిందుస్పష్టముగాఁ జెప్పంబడినది కాన గుణకర్మల వలన విభజింపఁబడిన జాతులు కొంతకాలము కర్మలయందలి మార్పులచేత నుచ్చనీచతల నొందుచు వచ్చి నటుల భారతమే ప్రమాణము. రాజకుల సంభవుఁడగు ఋభునికుమారులు నూరుగురిలో నెనుబదియొక్కరు బ్రాహ్మణులైరను నీ క్రింది శ్రీభాగవతములోని శ్లోకభావము కూడగుణకర్మ మహిమవలన నుచ్చజాతినిఁ బొందవచ్చునని తెలుపుము.

"యవీయాంస ఏకాదశీతిర్జ్ఞాయంతేయాః పితురాదేశకరాః మహాశాలీనాః
మహాశ్రోత్రియా యజ్ఞ శీలాః కర్మవిశుద్ధాః బ్రాహ్మణాబభూవుః ॥

ఈ క్రింద నుదాహరించు హరివంశ శ్లోకమునందు నా భాగుఁడు అరిష్టుఁడను వైశ్యపుత్రులిరువురు బ్రాహ్మణత్వము బొందిరను విషయముననుసరించి కూడ గుణకర్మముల వలన జాతివిభాగమేర్పడినదనిఁ దోచుచున్నది. ఇంతియేగాక పూర్వజాతి శరీరముకూడ తపోమంత్ర సమాధ్యాదుల వలన జాత్యంతరము పొందునని పాతంజలి యోగశాస్త్రమందు

"జన్మౌషధిమంత్రతపస్సమాధిజా స్సిద్ధయః
జాత్యంతరపరిణామః ప్రకృత్యాపూరాత్ ॥

అని చెప్పఁబడియున్నది. యోగశాస్త్రముగాననందు యోగ ప్రాముఖ్యమున జాతులు మారునను నవకాశమీయఁబడినది. సర్వ గ్రంథములందును గుణకర్మముల వలన జాతి పరిణామ మేర్పడవచ్చుననియు రాను రాను స్మృతులు రచించిన కాలమునఁ గ్రిందిజాతులు నుచ్చజాతులు కానువీలులేదను కట్టుబాటులు బయలుదేరినట్టు విశ్వసింప నవకాశములు గలవు.

భూతసృష్టియు వర్ణవిభాగము శౌచా శౌచ విధులెట్లు ప్రపంచమునందుఁ గలిఁగినవి తెలుపుమని భరద్వాజుఁడు ప్రశ్నింప భృగుమహర్షి యీ క్రింది విధముగాఁ జెప్పియున్నాఁడు.

శ్లో॥ అసృజద్బ్రాహ్మణా నేవపూర్వం బ్రహ్మాప్రజాపతిః ।
ఆత్మతేజోభినిర్వృత్తాన్ భాస్కరాగ్ని సమప్రభాన్ ।
నవిశేషోస్తివర్ణానాం సర్వం బ్రాహ్మమిదంజగత్ ।
బ్రహ్మణాపూర్వ సృష్టంహి కర్మభిర్వర్ణతాంగతం ।
కామలోభ ప్రియాస్తీక్ష్ణాః క్రోధనాప్రియ సాహసాః ।
త్యక్తస్వధర్మారక్తాంగాః తేద్విజాఃక్షత్రతాంగతాః ।
గోభ్యోవృత్తిం సమాదాయపీతాః కృష్యనుజీవినః ।
స్వధర్మం నానుతిష్ఠంతితే ద్విజాః వైశ్యతాంగతాః ।
హింసారతిప్రియాలుబ్ధాస్సర్వకర్మోపజీవినః ।
కృష్ణాశ్శౌచపరిభ్రష్టాస్తే ద్విజాశ్శూద్రతాగతాః ।,
ఇత్యేతైఃకర్మభిర్వ్యస్తా ద్విజావర్ణాంతరంగతాః ।
ధర్మయజ్ఞ క్రియాచైషాంనిత్యం నప్రతిషిధ్యతి।
వర్ణాశ్చత్వారిత్యే తేషాం బ్రాహ్మీసరస్వతి ।
విహితా బ్రహ్మణాపూర్వంలోభస్త్వజ్ఞానతాఁగతాః ॥

మహాభారతము

ప్రజాపతియగు బ్రహ్మతొలుత బ్రాహ్మణులనే సృజించెను. వారు బ్రహ్మతేజము సూర్యునివంటి అగ్ని వంటి కాంతి గలవారు. ఆ కాలమున వర్ణభేదములేదు. ప్రపంచమంతయు బ్రాహ్మణజాతియే; కర్మలచేతనే వర్ణభేదమేర్పడెను. అప్పటి బ్రాహ్మణులలోఁ గొందరు గామలోభాదుల నాశ్రయించి క్షత్రియులైరి. గోపాలనమును గృషిని నాశ్రయించి కొందరు వైశ్యులైరి. హింసారతులును సర్వకర్మోపజీవనులై కొందరు శూద్రులయిరి; ఇటులఁగర్మాచరణ భేదముచే వర్ణాంతరములు బ్రాహ్మణులు పొందిరి.

తొలుతనందఱు బ్రహ్మసంతతిగా వ్యవహరింపఁ బడిన బ్రాహ్మణజాతి రాను రాను గుణకర్మానుసారముగ వృత్తులం బట్టి కులభేదము లొందినటుల వ్యాసులవారె భారతమున జెప్పియున్నారు.

శ్లో॥ నచర్మణో నరక్త స్యనమాంసస్యనచాస్థినః ।
నజాతిరాత్మనోజాతిర్వ్యవహారేణ కల్పితా ॥

**నిరాలంబోపనిషత్తు**

శ్లో॥ శూద్రోబ్రాహ్మణతామేతి బ్రాహ్మణశ్చైతి శూద్రతాం ॥

**మనుస్మృతి**

పై శ్లోకములన్నియు గుణకర్మవశమున జాతిపరిణామ మేర్పడవచ్చునని తెలుపుచున్నవి. ఆర్యులందరిచే శిరసావహింపఁబడుచున్న భగవద్గీతలలో సహితము గుణకర్మమును బట్టి చాతుర్వర్ణ్యమును నేనే సృజించితిని నేనే దానిని చేయని యవ్యయుఁ డనగుదునని తెలిసికొనుమనుభావము నిచ్చెడు శ్లోకము నీ క్రింద నుదాహరించు చున్నారము.

"శ్లో॥ చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః ।
తస్యకర్తారమపిమాంవిద్ధ్యకర్తారమవ్యయం ॥

**భగవద్గీతా । అధ్యా 4 ।,శ్లో. 13**

"శ్లో॥ నకులేన నజాత్యానక్రియాభిర్బ్రాహ్మణోభవేత్
చండాలోపిహివృత్త స్థోబ్రాహ్మణస్సయుధిష్ఠిరః ॥

కులము చేతకాని జాతిచేకాని బ్రాహ్మణుఁడు కానేరడు. క్రియ చేత మాత్రము బ్రాహ్మణుఁ డగును. వృత్తస్థితుఁడగు చండాలుఁడు బ్రాహ్మణుఁడగు ననుభావముగలపై భారత శ్లోకము వలన కూడ వృత్తులఁబట్టి జాతులు పరిణామముఁ బొందినట్లు దోచుచున్నది.

"శ్లో॥ బ్రాహ్మణక్షత్రియవిశాంశూద్రాణాంచపరంతప ।
కర్మాణి ప్రవిభక్తానిస్వభావప్రభవైర్గుణైః ।
శమోదమస్త పశ్శౌచంక్షాన్తిరార్జవమేవచ ।
జ్ఞానంవిజ్ఞానమాస్తిక్యం బ్రాహ్మ్యంకర్మ స్వభావజం ।
శౌర్యం తేజోధృతిర్దాక్ష్యం యుద్ధేచాప్యపలాయనం ।
దానమీశ్వరభావశ్చక్షాత్రం కర్మస్వభావజం ।

**కృషిగోరక్ష వాణిజ్యం వైశ్యంకర్మస్వభావజం ।**
**పరిచర్యాత్మకం కర్మశూద్రస్యాపి స్వభావజం ॥**

**భగవద్గీతా. అధ్యా. 18 శ్లో. 41-44**

ఓ పరంతపా! బ్రాహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులయొక్క కర్మలు వారియొక్క స్వభావజన్యములై (అనగాఁబ్రకృతిసిద్ధములగు) గుణములను బట్టి వేఱు వేఱుగ విభజింపఁబడిన శమము, దమము, తపస్సు, శుచిగానుండుట, శాంతి, సరళత (ఆర్జవము) జ్ఞానం (ఆధ్యాత్మ్యజ్ఞానము, విజ్ఞానము) వివిధజ్ఞానము ఆస్తిక్యబుద్ధియుననునివి బ్రాహ్మణుల యొక్క స్వభావములగు కర్మలు, శౌర్యము, తేజస్విత, ధైర్యము, దక్షత యుద్ధములో వెనుదీయకుండుట, దాతృత్వము ప్రజల నేలుటయను నివి క్షత్రియుల యొక్క స్వభావజన్యములగు కర్మలు, కృషిగోరక్షణ వాణిజ్యములు (వ్యవసాయపశుపాలన వాణిజ్యము) లను నవి వైశ్యునిస్వభావజన్య కర్మలు అటులే సేవించుట శూద్రునకు స్వభావజన్యకర్మయని పైశ్లోకముల భావము.

తిలకు భగవానుఁడు పై శ్లోకమునకు వివరణము వ్రాయుచు గుణకర్మలఁబట్టి జాతి విభాగమేర్పడెనను నంశ మీ క్రింది విధముగా వ్రాసియున్నాఁడు.

“చాతుర్వర్ణ్య వ్యవస్థ స్వభావజన్యగుణ భేదముచేఁ జెప్పబడినది. ఈ యుపపత్తి గీతలయందే యపూర్వముగా నున్నది కాదు, మహాభారతము నందున్న వనపర్వమునందు నహుష యుధిష్ఠిరుల యొక్కయు ద్విజవ్యాధుల యొక్కయు సంవాదముల యందును, (వన ౧౮౦——౨౧౧) శాంతిపర్వము నందలి భృగుభరద్వాజ సంవాదమునందును (శాంతి ౧౮౮) అనుశాసనీక పర్వమునం దుమామహేశ్వర సంవాదము నందును (అను ౧౪౩) అశ్వమేధపర్వమందలి యను గీతల యందును (అశ్వ ౩-౧౧) నీ గుణభేదము యొక్క యుపపత్తి కొంత మార్పులోఁగను పట్టుచున్నది. జగత్తునందలి వివిధ వ్యవహారములును, ప్రకృతి యొక్క గుణభేదముల చేతనే నడుచు చున్నవని పూర్వమునందే చెప్పఁబడినది. (ఎవరేమి చేయవలసినదియుఁ జాతుర్వర్ణ్య వ్యవస్థచే నిశ్చయింపఁ బడిన విషయము తిలకు భాష్యమున ౧౧౩ వ పుట చూడుడు) మనుస్మృతియందు నిట్లు చెప్పఁబడి యున్నది.

శ్లో॥ అధ్యాపనంచాధ్యయనం యజనంయాజనంతథా ।
దానంప్రతిగ్రహంచైవబ్రాహ్మణానామకల్పయత్ ॥
ప్రజానాంరక్షణందానమిజ్యాధ్యయమేవచ ।
విషయేష్వప్రసక్తి శ్చక్షత్రియశ్చసమాసతః ॥
పశూనాంరక్షణందానమిజ్యాధ్యయనమేషచ ।
వణిక్పథంసీదంచ వైశ్యస్యకృషి మేవచ ॥

విసర్త భీతిచే నాయాగ్రంధముల నుండి దృష్టాంతముల నుదాహరింప యితర గ్రంధములనుండి యీ యంశము స్థాపించు నాధారముల నొసంగి ప్రకృతము ననుసరించు చున్నారము

**"బ్రాహ్మణాదివర్ణంబు లెల్లను గుణకర్మంబులచే భేదిల్లుంగాని జననం బుచెభేదిల్లవు. జననంబు వలన బ్రహ్మతేజస్సంపత్తి యొదవ నేరదు. కావున బ్రహ్మవలన నుప్పతిల్లిన వారినెల్ల బ్రాహ్మణులనంజనదు. ఎఱుక వలనను గర్మోపాసానాదుల వల్లను దయా దాక్షిణ్యంబుల వలనను బ్రాహ్మణుండు నాబడు. ప్రజాసంరక్షణ సామర్థ్యంబు పరాక్రమంబు ఇంద్రియ నిగ్రహంబు దుష్టనిగ్రహ శైలియుంగలవాఁడు క్షత్రి యుండు.క్రయవిక్రయ నైపుణ్యంబు, బాశుపాల్యంబున గృషియుం గలవాఁడు, వైశ్యుఁ డు ద్విజార్చనాసక్తుఁడు జితేంద్రియుఁడు శూరుఁడు శీరకాష్ఠాదివహుఁడు శూద్రుఁ డననొప్పు. స్వకులోచిత ధర్మంబు పరజీవనంబు గావించు చందులైన అవివేకులుమ్లేచ్ఛు లనఁబడుదురు.**

**శుక్రనీతి. అధ్యా. 4-5**

"ఒక్క ఆర్యజాతివారిచే మాత్రము వర్ణాశ్రమములు కల్పింపఁబడినవి కాని యనార్యులైన నాగులలోను మిశ్రజాతుల వారైన బౌద్ధులలోఁ గల్పింపఁ బడి యుండలేదు. ఆర్యులలోనైన నిప్పటిరీతి వర్ణభేదములు గానరావు. ఆకాలమునందు వృత్తులంఁబట్టి కులభేదము లేర్పడినవి కాని కుల భేదమును బట్టి వృత్తులేర్పడి యుండలేదు...... ఆర్యులా కాలమునఁ బరిపాలనము సేయునాంధ్రుల గేవలము శూద్రులను గాఁ జూచి యుండలేదు. వారిని క్షత్రియులని పైకిఁ జెప్పుచువచ్చిరి గాని కర్మాధి కారము

కలిగింపక లోపల ద్వేషభావమును గలిఁగి యుండిరి. మొదట నామ మాత్రముగా నేర్పడిన వర్ణాశ్రమ బంధములు సడలి యున్నవిగాని కాలము గడచినకొలది గట్టిగా బిగింపఁబడుచు వచ్చినవి. మనుస్మృతియందుఁ జెప్పఁబడిన భేదకారణములు కల్పితములు గాని స్వాభావికములుగావు గనుక నవియెంతమాత్రము విశ్వసింపఁ దగినవి కావు."

ఆంధ్రుల చరిత్రము ౧౦ ప్రకరణము

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను నాలుగు జాతులీకాలమునందే యేర్పడినవి. వేదమంత్రములను రచించిన ఋషులసంతతి వారును, వేదాధ్యయనము చేసి యజ్ఞయాగాది క్రతువులు చేయువారును, జేయించువారును, అరణ్యములలో నివసించి పరతత్వ విచారణము చేయువారును బ్రాహ్మణులయిరి. దస్యులు మొదలగు శత్రువుల దండించి రాజ్యములు స్థాపించినవారు క్షత్రియులైరి. వ్యవసాయము మొదలగు వృత్తుల లోనున్న వారును వాణిజ్యము చేయువారుననగు నితరార్యులందఱును వైశ్యులైరి. ఆర్యులకు లోఁబడిన యనార్యులందఱును శూద్రులుగా నెంచఁబడిరి. ఇట్లు మొట్టమొదట గుణ కర్మముల ననుసరించి వర్ణవిభేద మేర్పడినది. కాని యిప్పటి వర్ణమువలె నప్పటిజాతి, ఇతరులు ముట్టినంత మాత్రముననను, ఇతరులతోఁ గలిసి భుజించినంత మాత్రముననను, జెడిపోవునది కాదు. తక్కువ జాతుల వారియొద్ద యెక్కువ జాతివారు విద్య నేర్చుకొనుటయు, నౌకరియొద్ద నౌకరు భుజించుటయు, నౌకరి పిల్లల నౌకరు చేసికొనుటయు గుణకర్ములఁ బట్టి, యొకవర్ణము లోనివారు మఱియొక వర్ణములోఁ జేరుటయునప్పుడు చెల్లుచుండెను. క్షత్రియుఁ డగు విశ్వామిత్రుఁడు బ్రహ్మర్షియై విశ్వామిత్ర గోత్రులగు నిప్పటి బ్రాహ్మణుల కందఱకు మూలపురుషుఁడయ్యెను. బ్రాహ్మణ పుత్రికయగు దేవయాని క్షత్రియుండగు యయాతిని వివాహమాడి క్షత్రియ వీరులగు యాదవులకు మూలజనయిత్రి యయ్యెను. బ్రాహ్మణులును క్షత్రియుఁడగు కృష్ణుఁ డును దాసీ పుత్రుఁడగు విదురుని యింట విందారగించిరి. శ్వేతకేతు, ఆరుణేయుఁడు, సోమసుష్మి, సత్యయజ్ఞి, యాజ్ఞవల్క్యుఁడు, అను ముగ్గురు బ్రహ్మర్షులు నగ్ని హోత్ర విధానమంతయు జనకమహారాజు నొద్ద నేర్చుకొనిరనియు జనకుఁడు బ్రాహ్మణుఁ

డాయె ననియు శతపథ బ్రాహ్మణము (శతపథ ౧౧-౬-౨-౧)చెప్పు చున్నది. శ్వేతకేతు ఆరుణేయుఁడును, అతని తండ్రియగు గౌతముఁడును, బాంచాల దేశపు పరిషత్తునకుఁ బోయి ప్రవాహ జైబిలియను రాజునొద్ద బ్రహ్మ విద్య నభ్యసించిరనియు నంతవఱకు నావిద్య క్షత్రియులకే తెలియుననియు బ్రాహ్మణులకుఁ దెలియదనియు ఛాందోగ్యమున (ఛాందోగ్యము -౪-౨౨) జెప్పఁబడినది అయిదుగురు బ్రహ్మర్షులును ఉద్దాలక ఆరుణియను మహోపాధ్యాయుఁడును కైకయ రాజగుఅశ్వపతికి శిష్యులై యాశ్రయించి బ్రహ్మవిద్యను సంపాదించిరి (శతపథము). రైక్వుఁడను బ్రాహ్మణుఁడు జానశ్రుతి పుత్రాయణుఁడను శూద్రునికొమార్తెను వివాహమాడి యతనికి బ్రహ్మవిద్య నేర్పెను. కవషుఁడను దాసీ పుత్రుఁడు బ్రహ్మర్షిత్వము చెందెను. సత్యకామ జాబాలుఁడను కులగోత్రము లెరుకలేని పిల్లవానికి వాని సత్యసంధత్వమును మెచ్చి ఋషులు బ్రాహ్మణత్వ మొసంగిరి. ఇందువలన సత్య ప్రియత్వమును విద్యా సంపదయు నేజాతి మనుజునినైననప్పటి కాలములో బ్రాహ్మణత్వమునకు నర్హునిసేయుచుండెనని స్పష్టమగుచున్నది.

హిందూ మహాయుగము 3 ప్రకరణము

"శ్లో॥ విశ్వామిత్రో వశిష్ఠశ్చ మాతంగోనారదాదాయః ।
తపోనిశేషై స్సంప్రాప్తముత్తమత్వం నజాతితః, ॥

**శుక్రనీతి అ ౪, శ్లో.౪**

"అను శుక్రనీతి శ్లోకము సయితము గుణకర్మముల వలననే జాతి విభాగ మేర్పడినదని బోధించుచున్నది.

పూర్వోక్త నిదర్శనముల నన్నింటిని సమన్వయించి చూచితిమేని పూర్వకాలమున మొదట కులభేదములు లేవనియు పిదప గుణకర్మలచే వర్ణవిభాగ మేర్పడినదనియు రాను రాను కులకట్టు బాటులు స్మృత్యాదుల యందు వ్రాసినప్పటి నుండి వర్ణాశ్రమ ధర్మములకు బిగువుచిక్కెననియుఁ దెలియుచున్నది. గుణకర్మములనేలుచు వర్ణాశ్రమ ధర్మముల ననుసరించుచు నేదేని రాజ్యవిప్లవములలో దేశము వదలినపుడు నాచార

వ్యవహారాదుల కాచార్యులగు బ్రాహ్మణుల సమావేశముతటస్థింపనపుడు మఱల శూద్రప్రాయులగుచు వచ్చినటులం గూడా మన శాస్త్రములలోఁ గలదు, ఒకమాఱు స్థిరపడిన క్షత్రియత్వము కొంతకాలమునకు లోపించుటయు, మఱికొంత కాలమునకు సదనుష్ఠానవశమునఁబూర్వాభ్యున్నతి నొందుటయుఁ బూర్వాచారమని యుదాహృత శ్లోకభావముల వలనను వ్యక్తమగుచున్నది. కొందఱీ క్షత్రియజాతులు ఖండాంతరా గతులనియుఁ గావుననే బ్రాహ్మణ పురోహితత్వము బడయఁజాలక జాతిశూన్యులైరని యందురు, గాని యిదినిరాధారము. వీరు భారత వర్షమునందు జనించి క్షత్రియపద వాచ్యులై కర్మచ్యుతులై శూద్రప్రాయులైరను సంగతి గ్రంధాంతరములందుఁగలదు. ఐతరేయ బ్రాహ్మణ సప్తమ సంచికలోనున్న శునశ్శేపునికధలో విశ్వామిత్రునకు ౧౦౦ కుమారులుండ నందేబదిమంది పిత్రాజ్ఞ నుల్లంఘించి పుండ్రశబర పుళిందాదులైరను కథ పైదానికి మాతృక కావచ్చును. వశిష్ఠుని యాగధేనువగు శబలను విశ్వామిత్రుఁడు బలవంతముగాఁ గొనిపోవనెంచశ బలవిజృంభించెననియు, దాని యవయవముల నుండి యవనకాంభోజ బర్బరాది జాతులు పుట్టిరనుటచే నాయాజాతులన్నియు భరతవర్షమున జనించినవనియే విశ్వసింపవలసి యున్నది.

ఇందులకుదాహృతములగు శ్లోకములు.

"శ్లో॥ తవ్య తద్వచనం శ్రుత్వా సురభి స్సా సృజ త్తదా ।
తస్యా హుంభారవో త్సృష్టాః పల్లవా పల్లవా శ్శతశో నృపాః ॥
భూయ ఏవాసృజ ద్ఘోరాన్ శకాన్ యవనమిశ్రితాన్ ।
తైరాసీ సంవృతాభూమిశ్శకైర్య వన మిశ్రితైపి ॥

రామాయణము, బాలకాండ అధ్యాయము౫౪

శ్లో॥ తస్యా హుంభారవా జ్జాతాః కాంభోజా రవిసన్నిభాః ।
ఊధసస్త్వధ సంజాతాః పహ్లవాశ్శస్త్ర పాణయః ।
యోనిదేశా చ్చ యవనా శ్శకృద్దేశా చ్ఛకాస్తధా ।

అధ్యాయము ౫౫

శ్లో॥ శవకైస్తు క్రియాలోపా దిమాః క్షత్రియజాతయః ।
వృషలత్వం గతా లోకే బ్రాహ్మణాదర్శనేన చ ।
పౌండ్రకా శ్చోళద్రవిడాః కాంభోజా యవనా శ్శకాః ।
సారదాః పల్లవ శ్చీనాః కిరాతాః దరదాః ఖశాః ।
ముఖబాహూరుపజ్జానాం యా లోకే జాతయో బహిః ।
మ్లేచ్ఛవాచ శ్చార్యవాదస్తే సర్వే దశ్యవ స్మృతాః ।

**మనుస్మృతి ౧౦ అధ్యాయము**

ఆదిములగు క్షత్రియ జాతులు బ్రాహ్మణ సమావేశములేనివారై దూరమేగుటచే శూద్రులైరి. పౌండ్రకులు, చోళులు, ద్రవిడులు, కాంభోజులు, యవనులు, శకులు ,పారదులు, పల్లవులు, చీనులు, కిరాతులు, దరదులు, ఖశలులోనగు సర్వజాతుల వారలిటులనే జాతిచ్యుతులైరి. అన్యభాషాశ్రయము గలవారగుటచే వీరలు దస్యులని గూడఁ బిలువంబడుచున్నారని పైనుదోహరించిన శ్లోకముల భావమైయున్నది.

గుణకర్మ విభాగముచే క్షత్రియత్వము బడసి చిరకాలము క్షత్రియ ధర్మము లవలంబించి రాజ్యపాలనమునకు సీమాంతరముల కేగినవారిని జాతిచ్యుతులని మన పెద్దలు భావించిరి. ఇందులకనియే కాఁబోలు చాళుక్యులు తమ వెంట బ్రాహ్మణులఁ గొనిపోవుచు బ్రాహ్మణకుటుంబములఁ బోషించుచు వారలకుఁగుల బ్రాహ్మణులని పేరు పెట్టిరని యూహింపనవకాశము గలుగుచున్నది. చోళులు పల్లవులు లోనగు పూర్వరాజన్యులు క్షత్రియులైనను వారల క్షత్రియత్వము దేశీయపండితు లంగీకరింపక వారిని శూద్రులుగాఁ బరిగణించుటయు వారలు తిరుగఁబడి క్షత్రియులమని చెప్పుకొనుటఁ జూచి కలియుగమున క్షత్రియులే లేరని వ్యవహరించి యందులకు పపత్తులను గలిగించిరనియుఁ దోచుచున్నది.

గుణకర్మలచే క్షత్రియత్వము బడసిన పవిత్ర జాతిపరిపాలనమున కితరదేశముల కేగినంత మాత్రమున శూద్రత్వము బడయుట యనుభవ విరుద్ధము. పూర్వోక్త గుణకర్మ విభాగములచే జాతులేర్పడెనను శ్లోకములకు విపరీతమగు వ్యాఖ్యానములతో జాతులు

భగవత్సృష్టములని సిద్ధాంతము పూర్వవిద్వాంసులు గావించిరని తలంచుటలో సాహసములేదు. ఇంతకు దీని వలన దేలిన సారము క్షత్రియులు, బ్రాహ్మణాదులవలెనే గుణకర్మముల వలన జాతినార్జించి దూరదేశావాసముచే మరల క్షత్రియత్వము గోలుపోయిరని తెలియును. ఇట్లు క్షత్రియత్వమును గోలుపోయిన జాతులలో రెడ్డికులమునొక దానిగా లోకము భావించుచున్నది. కాని రెడ్డిజాతి పూర్వవిద్వాంసుల కపట నాటకమును భేదించి తమ క్షత్రియత్వమును పూర్వమునుండి తెలుపుకొనుచు వచ్చినది. గాన గుణకర్మ విభాగజన్యమగు క్షత్రియత్వము గ్రంధరూపముగను వ్యవహార రూపముగను, రెడ్డివారియెడ రూఢమై యున్నదని తెలుపుచు నిందులకు బాధకముగఁ గలియుగమున క్షత్రియులు లేరను శాస్త్రాంశములను రాబోవు ప్రకరణములో విమర్శింతుము.

  

శ్రీరస్తు

# రెడ్డికుల నిర్ణయ చంద్రిక

## రెండవ ప్రకరణము

ఇపుడు హిందూ దేశమని వ్యవహరింపఁబడు మన మాతృదేశమునకుఁ బూర్వనామమార్యావర్తమని మనపురాణాది గ్రంథముల వలనఁ దెలియుచున్నది. **ఆర్యాః ఆసమంతాత్ వర్తంతే అత్రేత్యార్యావర్తః** అనువ్యుత్పత్తి వలన ఆర్యులంతటను వర్తించు భూమిగావున దీని కార్యావర్తమను నామము వచ్చినటుల గ్రహింపనగును.

**"ఇమంమేగంగేయమునే సరస్వతి శుతుద్రిస్తోమం ।**
**సచతాపరుష్ణ్యాఅసిక్న్యామరుద్వృ ధేవితస్థాయార్జి**
**యే శ్రుణహ్యాసుషోమయా ॥**

**ఋగ్వేదము**

**శ్లో॥ అధగ చ్ఛేతరాజేంద్ర దేవికాంలోకవిశ్రుతాం ।**
**ప్రసూతిర్యత్రవిప్రాణాంశ్రూయతే భరతర్షభ ॥**

**భారతము, అరణ్యపర్వము. అధ్యా**

ఉదాహృతభాగముల వలన గంగా యమునా సరస్వతిఁసింధునదమునకు నుపనదులగు వితస్థకు జీలమనియు అసిక్నికి చీనాబనియుఁ పరుష్ణికి రావియనియు ఆర్జికీ యాయను దానికి బియాసనియు శుతుద్రికి సట్లజ్ అనియుఁ ప్రస్తుతము వ్యవహరించుచున్నారు శతద్రు వరుష్ణీ అసిక్నీ సింధు ప్రముఖనదీ ప్రాంతములందు నార్యులు స్థిరనివాసవము నేర్పరచుకొని రనియు బ్రాహ్మణులు దేవికా నదీ తీరమున వసించిరనియు గ్రమముగ వీరలు దేశమునందంతట వ్యాపించిరని సాముదాయికార్థము చే నూహింప వీలుకలుగు చున్నది.

**ఆర్యావర్తపుటెల్లలు**

ఉత్తరమున హిమాలయము దక్షిణమున రామేశ్వరము చెంతగల సముద్రము తూర్పున బంగాళాఖాతము పశ్చిమమున సముద్రము ఎల్లలుగాగల పదునేడు లక్షల మైళ్ళ వైశాల్య భూభాగమును నిప్పుడు హిందూదేశమని వ్యవహరించుచున్నారు. మన పురాణములందు నార్యావర్తమునకు బ్రహ్మావర్త మధ్యదేశ నామములు గనుపట్టుచున్నవి.

**ఆర్యావర్తపు పురాణపుటెల్లలు**

**"ఆసముద్రాచ్ఛవై పూర్వాదాసముద్రాచ్ఛపశ్చిమాత్ ।**
**హిమవద్వింధ్య యోర్మధ్యమార్యావర్తం విదుర్బుధాః ॥**

(సిందునదమునకు నుపనదులగు వితస్థకు జీలమనియు అసిక్నికి చీనాబనియుఁ పరుష్ణికి రావియనియు ఆర్జికి యాయను దానికి బియాసనియు శుతుద్రికి సత్లజ్ అనియుఁ బ్రస్తుతము వ్యవహరించుచున్నారు.)

తూర్పుపడమర సముద్రములు ఎల్లలుగాఁ గల హిమవద్వింధ్య పర్వతముల యొక్క మధ్యదేశమార్యావర్తమని పై శ్లోకభావము.

**(మనుస్మృతి)**

**శ్లో॥ హిమవద్వింధ్యయోర్మధ్యం యత్ప్రాగ్వినశనాదపి ।**
**ప్రత్యగేవప్రయాగాచ్ఛ మధ్య దేశః ప్రకీర్తితాః ॥**

"హిమవత్పర్వతమునకు వింధ్య పర్వతమునకు నడుమదిగాను సరస్వతీనది గుప్తమైన వినశనదేశమునకుఁ దూర్పుదిక్కుగాను ప్రయాగకుఁ బడమరదిగానుండెడి స్థలము మధ్య దేశము" అని చెప్పుటచే నార్యావర్తమునకు మధ్యదేశమని నామాంతరమున్నటుల స్ఫురించుచున్నది.

**"శ్లో॥ సరస్వతీదృషద్వత్యో ర్దేవనద్యోర్యదంతరం ।**
**తందేవ నిర్మితందేవ బ్రహ్మావర్తంప్రచక్షతే ॥**

సరస్వతీదృషద్వతియను రెండునదుల యొక్క మధ్య ప్రదేశము దేవతలచే నిర్మింపబడి బ్రహ్మావర్తమను నామముతో వ్యవహరింపఁబడుచున్నదని భావము.

అర్యులుపై నుదాహరించిన ఎల్లలుగల యార్యాపర్తమున వ్యాపించుటేగాక దక్షిణాపథమునకుఁ గ్రమక్రమముగారాదొడంగిరి. దేశచరిత్రములను బూర్వగ్రంథ ములను సమన్వయించి చూచితిమేని తొలుత వేదములు పుట్టెననియు నాకాలమున జనులెట్టి కట్టుబాటులు లేక స్వతంత్రముగా నుండిరనియుఁదరువాత కాలమున రాజ్యవిభాగములేర్పడి రాజ్యతృష్ణ యంకురించిన కొలది సంగ్రామములు జరిగెననియు భారతాదీతిహాసంబులీ కాలంబునరచింపఁబడెనని నిశ్చయమగుచున్నది. తరువాత భారతీయులు పరస్పర నాశనభూతమగు సంగ్రామముల నుండి విముఖులైన పిదప గల్పవ్యాకరణములు రచింపబడెను. తరువాత బౌద్ధమతమతి వ్యాప్తినొంది దేశమంతటను విస్తరించెను. ఆవల పురాణములు ధర్మశాస్త్రములు రచింపఁబడియందు భూతకాలరాజుల చరిత్రములనన్నిటిని భవిష్యచ్చరిత్రములని వ్రాసిరి. వర్ణాశ్రమధర్మములు వృత్తులనుబట్టియు గుణకర్మములను బట్టియుఁ బూర్వోక్త విధముగా నేర్పడినట్లును శ్వేతకేతువు వివాహనియమము నాచరణము నందుంచినట్లును క్రమముగా నార్యా వర్తమునఁబురాణ ధర్మము లాచరణలోనికి వచ్చినట్లు భోజమహారాజు వ్రాసిన సమరాంగణమునందు సైతము గలదు. భరతవర్షమును సూర్యవంశీయులగు రాజులును చంద్రవంశీయులగు యదువృష్ణ్యంధకాది రాజకుటుంబములవారును చిరకాలము పరిపాలించి ధర్మములస్థాపించిరి. బ్రాహ్మణోత్తములు ధర్మబోధకులై దేశమునందాస్తిక్య ము నెలకొల్పిరి. వైశ్యులు కృషివాణిజ్యాది వృత్తులయందుమగ్నులై దేశము సుభిక్షముగావించి సుపరి పాలనకుఁ దోడ్పడిరి. శూద్రులు సేవావ్రతలోలురై పై నుదాహరించిన మూడు వర్ణములవారి కనుకూలముగా వర్తించి ఆర్యావర్తనము సర్వసంపదలతోఁ దులఁ దూగుటకుఁ గారకులైరి. ఇట్టి భారతవర్షమును బరిపాలించిన రాజకుటుంబములఁ దెలిసికొని వానియడ గృతజ్ఞులగుటయు నా వంశీయులెవరో గుర్తించుటయుఁ జారిత్రాభిరతులగు మానవుల విధియై యున్నది. మన పూర్వగ్రంథములలో రాజకుటుంబముల పూర్వవృత్తాంతములు విరళముగాఁ గలవు. గాని యవియన్నియుఁ గలియుగమున సంతరించినటుల నీ క్రింద నుదాహరించిన

గ్రంథభాగముల వలన దెలియును. ఆ గ్రంథభాగములెంత వఱకు విమర్శనకు నిలుచునో వాని కెంతవఱకుఁ బ్రాముఖ్యమునీయవచ్చునో వాని నిరాకరింతుమేని రాజకుటుంబములు కలియుగమునఁ గూడఁ గలవనుటకుఁ బ్రమాణములేవియో నిశ్చయించుట ప్రకృతమై యున్నది.

1. శ్లో॥ బ్రాహ్మణాః క్షత్రియాః వైశ్యాః శూద్రావర్ణాస్త్రయోద్విజాః ।
యుగేయుగేస్థితాస్సర్వేకలా వాద్యంతయో స్థితౌ

పురాణాంతరము

2. శ్లో॥ క్షత్రియ వైశ్య యోరేతత్మా – లేఅభావాత్తచ్ఛుద్ధిర్న విచార్నతే

ప్రాయశ్చిత్తేందు శేఖరము

3. శ్లో॥ క్షత్రియాదేః కలావభాన్న లిఖ్యతే ॥

ధర్మసింధు

4. శ్లో॥ క్షత్రియ వైశ్య జాత్యోశ్చ స్వరూపేణో చ్ఛిన్నత్వాత్

పరాశర మాధవీయము.

5. శ్లో॥ మహాపద్మపతిః కశ్చిన్నందః క్షత్రవినాశకృత్ ।
నందాంతం క్షత్రియకులం వేదవైదిక సంయుతం ।
భవిష్యతి తత శ్శూద్రప్రాయం వైశ్యకులం తథా ।

అత్రిస్మృతి.

6. శ్లో॥ ఇక్ష్వాకూణా మయం వంశస్సు మిత్రాంతో భవిష్యతి

భాగవత నవమస్కంధము

శ్లో మహానందిసుతో రాజన్ శూద్రాగర్భోద్భవో బలీ ।
మహాపద్మపతిః కశ్చిన్నందః క్షత్రివినాశకృత్
క్షత్రవేషవిహీనా శ్చ శూద్రాచారైక తత్పరాః ।
వింధ్యస్య దక్షిణే దేశే సముద్రప్రాంతమండితాన్ ।

కళిగాంధ్రవిదర్భాంగదేశా నాక్రమ్య భూమిపాః ।
త దాది భూమిపాలా శ్చ సూర్యసోమసముద్భవాః ।
పూర్వోక్తేన ప్రకారేణ భవిష్యంతి న సంశయః ।

మార్కండేయ పురాణోత్తర ఖండము

పై శ్లోకముల వలనఁ గలియుగమున క్షత్రియులుగాని, క్షత్రియ కుటుంబములుగాని, లేవనుట స్పష్టమగుచున్నది. సుబోధముగా నుండుటకై పై శ్లోకములకుఁ గ్రమముగా దాత్పర్యము వ్రాయుచున్నాము.

1. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులందఱు ప్రతియుగమునందు నుందురు. క్షత్రియులు వైశ్యులు మాత్రము కలియుగమునందు లేరు.

పురాణాంతరము.

2. క్షత్రియవైశ్యులు కలియుగంబున లేరు గావున వ్రాయుటలేదు.
3. క్షత్రియవైశ్యులు కలియుగంబున లేరు గాన వారలగూర్చి విచారణ సేయంబడదు.
4. క్షత్రియ వైశ్యులు స్వరూపశూన్యులైరి.

పరాశర మాధవీయము

5. మహాపద్మపతియను నామాంతరముగల నందుఁడు క్షత్రియవంశము వినాశనము చేయఁగలఁడు. అందుచేనందున కనంతరము వేదాచార సంయుతమగు క్షత్రియవంశము శూద్రప్రాయము కాఁగలదు వైశ్యులు గూడనిటులే యగుదురు.

6. సూర్యవంశములోనిదగు ఇక్ష్వాకుని కులము సుమిత్రుఁడను వానితో నంతమొందును"

భాగవతము

7. మదశాలియు దుర్మార్గుండునగు మహానందుఁడను రాజు రాజ్యమును బాలించుచు శూద్రకన్యను బెండ్లియాడగలడు. శూద్ర స్త్రీ గర్భమునందు బుట్టిన మహాపద్మఁ డనురాజు. క్షత్రియులతో సంబంధ బాంధవ్యముల నపేక్షింపగా వారలుపేక్షింప నాతఁడు సంగ్రామములో క్షత్రియుల జయించి కారాగార వాసులుగా నొనర్ప

క్షత్రియులు శూద్రాచారులై రాజవేష శూన్యులై చెడిపోగలరు. తుదకు వానిచే విముక్తులయి వింధ్యమునకు దక్షిణమునందును సముద్రప్రాంతములయందు నున్న కళింగ, అంగ, విదర్భాంధ్రాది దేశములను పూర్వోక్త సోమ సూర్య వంశజులగు రాజులాక్రమించుకొని మున్ను చెప్పిన చొప్పున శూద్రప్రాయులుగ వర్తింపగలరని పై శ్లోకముల భావము.

మార్కండేయ పురాణము

కలియుగమునందు క్షత్రియులు లేరని పూర్వోక్త విధముగా ధర్మశాస్త్రములందుఁ బురాణములందు స్వార్థపరులుకొన్ని ప్రక్షిప్తాంశములు జేర్చి సర్వవిధముల చేతను క్షత్రియులని నిశ్చయింపఁదగిన సూర్యచంద్ర వంశజులను చతుర్థ జాతులని చెప్పి లోకము కన్ను గప్పి యున్నారు. పై వాక్యములన్నియుఁ బూర్వోత్తర సందర్భశూన్యము లనియుఁ గలియుగమున క్షత్రియవంశములు పెక్కులు మిగిలినవి గ్రంథాంతర సాక్ష్యములు గలవు. చాళుక్యులు చోళులు రాష్ట్ర కూటులు కాకతీయులులోనగు రాజులు పదియవ శతాబ్దము వఱకుఁదాము క్షత్రియులమని చెప్పుకొనుచు వచ్చిరి. ఆంధ్రదేశము నంతయు నేకరీతిగాఁ జిరకాలము పరిపాలించిన రెడ్డివీరులు కూడ తాము క్షత్రియులమని చెప్పుకొన్నటుల శాసనాది దృష్టాంతములు గలవు. వానినన్నిటి నటులుంచి పూర్వోక్త పురాణాంశముల సత్యాసత్యములను గూర్చి విమర్శింతము.

**శ్లో॥ బ్రాహ్మణాః క్షత్రియాః వైశ్యాః శూద్రా వర్ణాస్త్రయో ద్విజాః**
**యుగే యుగే స్థితా స్సర్వే కలా వాద్యంతయో స్థితిః**

అను శ్లోకమే పురాణములోనిదో స్పష్టముగాఁ జెప్పఁబడలేదు. ఏ పురాణములందు న్గానరాదు, శూద్రకమలాకరము నందు సైతములేదు. కొందఱు శూద్రకమలాకరమునందున్నది చెప్పెదరు. ఆమాట విశ్వసనీయము కాదని "క్షత్రియ వైశ్యాశ్చసంత్యేవ" అను శూద్రకమలాకర వాక్యమే తెలుపుచున్నది. ఆ శ్లోకము ప్రమాణరహితమనుటకుఁ బ్రాచీన నిబంధన కారులు నెవ్వరైనను దమ గ్రంథముల యందు దృష్టాంతముగాఁ దీసికొనఁబడకఁ పోవుటయే దార్కాణము. కాన నీ శ్లోకమును గూర్చిన చర్చ ప్రకృతముగాదని వదలుచున్నారము.

**"క్షత్రియ వైశ్యయో రేతత్కాలే అభావాత్తచ్ఛుద్ధిర్న విచార్యతే ॥**

అను ప్రాయశ్చిత్తేందు శేఖర వచనము సైతము కల్పితవాక్యమని, ప్రక్షిప్తమని, యా గ్రంధమునందలి క్షత్రియ వైశ్య ధర్మవాక్యములే ప్రతిపాదించు చున్నవి. క్షత్రియ వైశ్యులే లేరని యా గ్రంధకర్త తలంచినయడల వారల ధర్మములను జెప్పవలసిన ప్రసక్తి యుండదు గదా! క్షత్రియ వైశ్యధర్మములను గూర్చి యీక్రిందివిధముగా వ్రాసిన తద్గ్రంధకర్త కలియుగమున క్షత్రియ వైశ్యులే లేరనిన తాను వ్రాసిన క్షత్రియ వైశ్యధర్మములన్నియు నిరర్ధకములు కావలసి వచ్చును.

**"క్షత్రియవైశ్యయోర వ్యేవం । క్షత్రియస్తురణేప్పష్టందత్వా ప్రాణపరాయణః । సంవత్సర వ్రతంకుర్యాత్ । క్షత్రియా యాంశూద్రాజ్ఞాతః క్షత్తా । రాజన్యాత్ శూద్రాయాం జాతః ఉగ్రః । విప్రాయాం వైశ్యాజ్ఞాతః సూతః । జ్ఞానకృతే క్షత్రియస్వామి కేతాదృశగోవధే ష్మణాసం । అజ్ఞానకృ తేవైశ్యసంబంధి గోవధేమాసం క్షత్రియాదేర్భర్తుః పాద మాసః । క్షత్రియస్వస్య తావతేకామతో పహారేషాణ్మాసి కం । వైశ్యస్య త్రైమాసికం ॥ ప్రాయశ్చిత్తేందు శేఖరం.**

ఇట్లు వైశ్యధర్మమున క్షత్రియ ధర్మములు కలియుగ ప్రవర్తనమునందుఁ జెప్పిన ప్రాయశ్చిత్తేందు కారుఁడు. కలియుగమున క్షత్రియ వైశ్యజాతులు లేవనినచో నీవివరణ మొసంగుట స్వవచనావ్యాఘాతమేగదా. కావునఁ గలియుగమున క్షత్రియ వైశ్యులున్నందుననే ప్రాయశ్చింత్తేందు కారుఁడువారల ధర్మములఁ దన గ్రంధమున వాకొనియుండుట సత్యముగాని లేరని చెప్పుట సత్యమునకు దూరము.

(3). **"క్షత్రియాదేఃకలావభావాన్నలిఖ్యతే"** ధర్మ సింధువు.

క్షత్రియాదులు కలియుగంబున లేరు గావున వారలఁ గూర్చి వ్రాయలేదను భావముగల ధర్మ సింధువు నందలి పై శ్లోకము ప్రక్షిప్తమని కల్పితమని తద్గ్రంధస్థమగు క్షత్రియ వైశ్య ధర్మవాక్యములే బోధించుచున్నవి. **"క్వచిల్లేఖస్తువ్య త్పాదన మాత్రార్థోనే దానీముపయుజ్యత ఇతిప్రాయః ఉపేక్ష్యతే"** అనఁగాఁ గొన్ని విషయములు ప్రస్తుతమునం

దుపయుక్తములు గాకపోయినను వాటినిఁ దెలియనిమిత్తము వ్రాయఁబడునను భావముగల పై వాక్యము ననుసరించి క్షత్రియ వైశ్యధర్మములు ధర్మసింధు కారుఁడు వ్రాసెనే కాని, క్షత్రియ వైశ్యులు కలియుగమునందు సైతము గలరని వారి ధర్మముల వ్రాసియుండలేదని వాదమున కంగీకరించినను యది సరికాదు. ఏలయన ధర్మసింధువు, నిర్ణయ సింధువును బట్టి వ్రాయఁబడినటుల ధర్మసింధువులోని "దృష్టాపూర్వనిబంధాస్ నిర్ణయసింధుక్రమేణ సిద్ధాంతాస్ ప్రాయేణ మూలవచనానుర్ఝిత్యలిఖామిబాల బోధాయ" అను వాక్యమువలన ధర్మ సింధువు బాలబోధకొఱకు మూలమువదలి వివరముగా నిర్ణయ సింధువుననుసరించి వ్రాయబడెననుట సత్యము. నిర్ణయ సింధువులోనెచ్చటను క్షత్రియవైశ్యులు కలియుగములో లేరను అంశము కానుపింపదు. గాని క్షత్రియ వైశ్య ధర్మములు పెక్కులు గనుపట్టుటవలన ధర్మసింధువు నందలిపూర్వోక్త వచనము ప్రక్షిప్తమని యీ క్రింద వ్రాయబడు తద్గ్రంథస్థక్షత్రియ వైశ్యధర్మముల వలనఁ దెలియుచున్నది. "**నిష్కామ క్షత్రియాదేః సాత్త్విక పూజాకరణే మోక్షాతిశాయః**" నవరాత్రి ప్రకరణం "**క్షత్రియ వైశ్య యోస్తు పురోహితప్రవ రావితి సర్వసిద్ధాంతః ॥ విప్రోదశాహంక్షత్రియోద్వాదశాహం వైశ్యోపంచదశాహం। శూద్రో మాసః**" కావున ప్రమాణము కానేరదు. ప్రాయశ్చిత్తేందు శేఖర ధర్మసింధువు లందలి పై వాక్యములు మొదటిది స్వీయలేఖనమునకు వ్యతిరేకము రెండవది శ్రుతి స్మృతీతిహాసపురాణ శిష్టాచారనిబంధనములకు విరుద్ధము. ఇదియుఁ గాక యీ రెండు గ్రంథములత్యంతాధునికములగుటచే నే ప్రకారముచేనైనా ప్రమాణములుగా, బరిగణనీయములు కాఁజాలవు. పురాణేతిహాసముల నుండి, కలియుగమున క్షత్రియులున్నటుల ముందు నిరూపింపఁ బోవుచున్నారము. గావునఁ దద్విరుద్ధమగు పరాశరమాధవీయము నందలి కలియుగమున క్షత్రియులు వైశ్యులు లేరనునంశము గూడఁ బ్రక్షిప్తమని భావింప నవకాశము గలదు. గావున నాల్గవ నెంబరును విమర్శింప మానితిమి.

(4) మహాపద్మఁడు క్షత్రియ వంశము రూపుమాప క్షత్రియవంశములు శూద్రప్రాయము లయ్యెననునది యిఁక విమర్శనీయము. మహాపద్మపతి యనువాఁడు మహానందుని పుత్రుఁడు. మహాపద్మసేనుని యధిపతి క్షత్రియ నాశకుడయ్యెను గాని

యిందుఁగూడ క్షత్రియశబ్దమాత్రమున సమస్త క్షత్రియ వంశములని మాత్రము చెప్పగూడదు. ఎవరు రాజ్యాభిషిక్తులై తన్నెదురించిరో యట్టి క్షత్రియులకే మహాపద్మపతి నాశకుఁడు. అటులెదురించినవారు మాత్రమే నశించిన వారగుట జరిగినది. పరశురాముఁ డిరువదియొక్కమారు పృథ్వియందలి క్షత్రియులను సంహరించెను గదా! ఒక పర్యాయము పృథ్వి నిక్షత్రియమైనచో రెండవ పర్యాయము క్షత్రియులెచటనుండి వచ్చెదరు? ఇరువది యొక్క తూరియు భూమి నిక్షత్రియమగుచువచ్చెనా? అటులెన్నటికి జరుగదు. ఎవరు రాజ్యాభిషిక్తులో ఎవరు తన్నెదురించిరో? యట్టి రాజులనే పరశురాముఁడెదరించి తెగటార్చెను. గాని యందఱఁ దెగటార్పలేదు. మహాపద్మపతి యొనర్చిన క్షత్రవినాశన మిట్టిదే! గావున వీని మూలమున సకలక్షత్ర వినాశనముఁ గావింపబడినటులఁ జెప్పలేదు. భాగనత ప్రకారము చూచిన యడల, మహానందుని పిమ్మట 650 సంవత్సరములకు జరాసంధుని వంశమునందుఁ బురంజయుండను రాజు గలిఁగెను. పురంజయుఁడు గూడ క్షత్రియ నాశకుఁడైనటులఁ చెప్పఁబడెను. మహానందుడే క్షత్రియవంశమునంతయు రూపుమాపినచోఁ బురంజయుని నాటికి క్షత్రియవంశములు మిగలవు. గావున మహానందుఁడు తన్నెదురించిన క్షత్రియులను మూర్ధాభిషిక్తులైన రాజులను మాత్రము చంపెనని నిశ్చయింపవలయును. "భాగవత పంచమస్కంధము" నందలి శ్లో..." జగతీమ ర్బుదాన్యే కాదశ వత్సరాణాంబుభుజే"అనువాక్యమువలనఁ బ్రియవ్రత రాజు పదునొకండర్బుదముల సంవత్సరముల పర్యంతరము రాజ్య స్థితియందుం దగలడు అని పేరుగలదు. దీనిచేఁ బదునొకం దర్బుదములు ప్రియవ్రతుఁ డు రాజ్య మేలునపుడు కలియుగము పలమారు వచ్చును. కాన క్షత్రియాభావము కలియుగమునఁ గలదనుట యెన్నటికిఁ బొసంగదు.

సూర్యవంశము సుమిత్రునితో నశించెననుటయు విమర్శనీయమె, ప్రథమమున నిక్ష్వాకునకు నూర్గురు పుత్రులున్న సంగతి శ్రీమద్రామాయణము చదివిన యెల్లరెఱింగిన విషయమే. ఆ నూరుగురిలో నిరువది యైదుగురు పూర్వ సముద్రప్రాంతమునను, ఇరువది యైదుగురు పశ్చిమసముద్ర తీరభూములయందును, మువ్వురు

స్వీయరాజధానియందును మిగత నలువది యేడుగురు దక్షిణోత్తర భూములయందును రాజ్యమును బాలించిరి. స్వీయరాజధాని యందున్న మువ్వురి వంశ వర్ణనము చేయంబడినది. మిగతావారి వంశ వర్ణనములందుఁ గానరావు, ఆ మువ్వురిలోఁ బ్రథముఁడగు వికుక్షిక్రమము విశేషించి వర్ణింపఁబడినది. అందుఁగూడ రాజ్యాభిషిక్తుల వంశము మాత్రమే యభివర్ణితమగుచు వచ్చినది. ఇక్ష్వాకు వంశములో నంతిముఁడైన సుమిత్రుడెంత కాలమువఱకుఁ గలిలోనుండి యెప్పుడు మరణించెనో నిర్ణయింప వీలుకాదు. ఇతని కంటె కొన్ని పురుషాంతరములకుఁ బూర్వుఁడగు మరువుకలియు గాంతము వరకు నుండియే యున్నాఁడనుటకు నాధారములు సైతము గలవు.

"శ్లో॥ దేవాపిశ్శంతనోర్భ్రాతామరు శ్చేక్ష్వాకువంశజః ।
కలాపగ్రామ అసాతేమహాయోగ బలాన్వితౌ ।
తావిహేత్యకలేరంతే వాసుదే వాను శిక్షితౌ ।
వర్ణాశ్రమయుతం ధర్మం పూర్వవత్ప్రథయిష్యతః ॥

భాగవతం. ద్వాదశస్కంధం.

"శ్లో॥ దేవాపిః పౌరవోరాజామరు శ్చేక్ష్వాకువంశజః ।
కృతేయుగహాగత్య క్షత్రప్రావర్త కౌహితౌ ॥

విష్ణుపురాణం

ఉదాహృత శ్రీభాగవత విష్ణుపురాణాంశముల వలన సుమిత్రుని పూర్వుఁడగు మరువే, క్షత్రియధర్మస్థాపనార్థము కలియుగాంతము వఱకు నుండునటుల స్పష్టముగాఁ దెలియుచుండ సుమిత్రునితో రాజవంశమంతరించెననుట పొసఁగనేరదు గానఁ గలియుగమున నిక్ష్వాకు సంబంధమగు సూర్యవంశమున్నదనియే నిర్ధారణము చేయవలసి యుండును, ఈ సుమిత్రునకు విశ్వవరుఁడు కూర్మ్ముఁడను నిరువురు కుమారులున్నట్లు వంశభాస్కరమను గ్రంథము వలనఁ దెలియుచున్నది. ఈయధ్యాయమునకంటెఁ బై యధ్యాయమునందు వికుక్షితమ్ముఁడగు నిమిరాజువంశ వర్ణనము చేయంబడెను. నిమిరాజు వంశమున లోపమెవ్వరిది లేదు, దండక రాజువంశమునందు లోపమెచ్చటఁ గానుపింపదు. ఇక్ష్వాకు మహారాజు కుమారులు నూరుగురి వంశ మొకమాఱు

నష్టమెన్నటికిఁ గాఁ దగునవకాశములు లేవు కొంచెము విచారణము చేసినయెడల నిక్ష్వాకు కుమారులలోఁ దొంబది తొమ్మిది మంది రాజకుమారుల రాజవంశములున్న వనియే నిరాక్షేపముగాఁ దోపకమానదు. ఇటులనే చంద్రవంశమునందుఁ గూడ నహుషుని వంశమభివర్ణింపఁబడినది. అతని యారువురి కుమారులలో యయాతివంశము వర్ణింపఁ బడినది. అతనికైదుగురు తనయులు కలిగిరి. వారిలో పంచముని వంశము మాత్రము క్షేముని వఱకు వర్ణింపఁబడినది. ఈ వంశము క్షేమునితో నంతము చేయఁబడెను. ఈ క్షేమునికిఁ గొన్నితరముల పూర్వుఁడగు దేవాపి మిగిలియే యున్న శ్లోకములిది వఱకే యుదాహరించి యున్నారము. కలియుగమునందు దేవాపి రుచిరాశ్వపుత్రికయగు శాంతను బెండ్లి యాడెనని కలికి పురాణమునందీ క్రింది విధముగా వ్రాయంబడి యున్నది. శ్లో॥ **రుచిరాశ్వసుతాం శాం తాం దేవా పేత్వంసముద్వహా"** కావునఁ గలియుగమునఁ జంద్రవంశము సయితము కలదు. మన పురాణములందు క్షత్రియులేగాక వైశ్యులు సైతము లేరని పూర్వులు సిద్ధాంతీకరించి యున్నారు. ఇది వింతలో వింత, వైశ్యులు సంగ్రామమున నశించిరందమా! వారలెప్పుడు రాజ్యాధికారులైనట్లు గాని, యుద్ధమొనరించి నటులఁ గాని, యే స్మృతీతిహాస పురాణముల యందు వక్కాణింపఁబడలేదు.

కలియుగమారంభముకాఁ గనే వైశ్యులందఱు తపంబొనరించుటకు వనంబుల కేగిరని సమాధానము చెప్పుకొందమనినట్లు ప్రమాణములించుకైనఁ గానరావు. కావున కలియుగమున వైశ్యులు లేరనుట సత్యమునకు దూరము. కలియుగమున క్షత్రియవైశ్యులున్నటులఁ పురాణములందు, ననేక ప్రమాణములు గలవు. నిందు దిక్ప్రదర్శనముగా గొన్నిటిని మాత్రమే నుదాహరించు చున్నారము.

**శ్లో॥ కలౌతు బీజభూతాస్తు కేచిత్తిష్ఠంతి భూతలే ।**
**తథైవ దేవాపిమరూసాంప్రతంసమవస్థితౌ ॥**

కలియందు దేవాపి, మరువేగాక కొందఱు క్షత్రియులు బీజభూతులుందురని పై శ్లోకభావము బీజభూతులను పదమునకుఁ బరస్త్రీసంగమము వలన జనించినవాఁ

డని, యర్థము కొందఱు పండితులు జెప్పి కలియుగమున క్షత్రియులు లేరనువాదము నిలువఁ బెట్టుచున్నారు. బీజభూతశబ్దమునకుఁ బరస్త్రీ జాతుఁడను నర్థమేకోశముల యందుఁ గనుపించుటలేదు. కాన నిది ప్రమాణముకాఁ జాలదు. దానినే ప్రమాణముగా విశ్వసించినచో.

"శ్లో॥ బ్రహ్మక్షత్ర విశాశ్శూద్రాః బీజార్థేయ ఇహాస్థితాః ।
కృతేయుగేహితైస్సార్ధం నిర్విశేషస్తధా భవన్ ॥

అను శ్లోకమునందలి కలియుగమున బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులు బీజభూతులై వర్తింతురను దానికిఁ గూడఁ బూర్వోక్తార్థమును గ్రహించినచోఁ గలియుగమునఁ జాతుర్వర్ణ్యములు సంకరములని విశ్వసింప వలసివచ్చును, ఈయర్థమెన్నటికిని సమంజసము కానేరదు.

"శ్లో॥ బ్రహ్మ బీజాత్సముత్పన్నో మంత్ర సంస్కారవర్జితః ।
జాతిమాత్రోపజీవీచ సభ వేద్బీజ బ్రాహ్మణః ॥

బ్రాహ్మణబీజముచే స్వస్త్రీయందుద్భవించి మంత్ర సంస్కార వర్జితుఁడై జాతి మాత్రముతో జీవించువాఁడు బీజబ్రాహ్మణుఁడని చెప్పంబడును" అను భావముగల యీ శ్లోకము వలన బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులు బీజభూతులైయుందురను విషయమునకు మంత్రసంస్కారవర్జితులై జాతిమాత్రముచే జీవించు వారని సర్వజనాదరణీయమగు నర్థమగుచున్నది.

"శ్లో॥ కృతేతుమానవాధర్మాస్త్రేతా యాంగౌతమాః స్మృతాః ।
ద్వాపరేశంఖలిఖితాః కలౌపారాశరాః స్మృతాః ॥

అను పరాశరస్మృతి వచనము వలనఁ గలియుగ వర్ణాశ్రమములకుఁ బ్రాముఖ్యమగు ధర్మశాస్త్రము పరాశర స్మృతియని స్పష్టమగుచున్నది. అపరాశరస్మృతి యందు క్షత్రియ ధర్మములు పెక్కులు చెప్పంబడి యుండుటచేఁ గలియుగము నందు క్షత్రియ వర్ణమన్ని వర్ణములతోఁ బాటున్నదని నిశ్చయింప నభ్యంతరముండదు

క్షత్రియధర్మములఁ జెప్పు శ్లోకములఁ బరాశర స్మృతినుండి దీసి యీక్రింద నుదాహరించి కలియుగమును క్షత్రియులన్నటులు నిశ్చయింతుము.

శ్లో॥ క్షత్రియోపికృషింకృత్వాదేవాన్ విప్రాంశ్చపూజయేత్ ।
జాతోవిప్రోదశాహేన ద్వాదశా హేనభూమిపః ।
వైశ్యఃపంచదశాహేన శూద్రోమాసేనశుధ్యతే ॥

అధ్యా 3 శ్లో॥ ౪

భాండస్థమంత్యజానాంతు జలందధిపయఃపిబేత్ ।
బ్రాహ్మణ క్షత్రియోవైశ్యాఃశూద్రశ్చైవప్రమాదతః ।
బ్రహ్మకూర్చోపవాసేనద్విజాతీనాంతునిష్కృతిః ।

పరాశరస్మృతి అధ్యా ౧౧ శ్లోకం ౩౦

ఈ విధముగాఁ బరాశర స్మృతియందు నిరూపింపఁబడిన క్షత్రియ ధర్మములు క్షత్రియులు కలియుగమునందుండిరనియే నిర్ధారణము చేయుచున్నవి. కలియుగమున క్షత్రియులు లేరేని కలియుగ ధర్మప్రవక్తయగు పరాశరుఁడు క్షత్రియ ధర్మములు తనస్మృతియందుఁ బలుతావులఁ జెప్పఁబని యుండదు.

"శ్లో॥ ద్విజానాంబాహుజానాంచ విట్ఛూద్రాణాంత థైవచ ।
కలిజానాం విశేషణనిస్తారంవిస్త రాద్వద ।
శ్రుణుదేవి భవిష్యాణాంభక్తా నాంచరితంకలౌ ।
సదామిసంగ్రహేణైవ శ్రవణాద్భక్తి వర్ధనం ।
తస్యమాసీద్వైశ్యవర్యః స్వభావరిపుసంజ్ఞకః ।
తస్మిన్నగర పిత్యాఖ్యోవైశ్యంశ సముద్భవః ।
కలానాథోభవేద్వైశ్యః సదావైశ్యధనోయువా ।
ఉగ్రస్థానం సదాత్రాస్తి సప్తజాతిర గోచరం ।
నరసింహ ఇతిఖ్యాతస్తత్రాభూత్ క్షత్రియాధిపః ।

**పేణాపూరంనామశుభం పుణ్యం పుణ్యజనాస్పదం ।**
**కలికంసాహ్వాయః కశ్చిద్వైశ్యోభూత్తత్రవశ్యధీః ।**
**భక్తాన్సర్వే శివంధ్యాత్వాకలావే సంభవంతిహి ।**

**శివరహస్యఖండము । నవమాంశము**

శంకరుని పార్వతి యొక్క నాఁడు కలియుగమునందు జనింపనున్న బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రుల వృత్తాంతముల జెప్పుమని యడుగగా నిట్లు చెప్పెను. కలియుగము నందలి భక్తుల చరిత్రమును ఓ దేవి చెప్పుచున్నాఁడను వినుట వలన భక్తి యతిశయించును. పుష్పపురియందు స్వభావరిపు సంజ్ఞతో నొక వైశ్యుఁడు జన్మించగలడు. అతని తదుపరి నగరసీతియు కలానాధుఁడను వైశ్యులిరువు రవతరింప గలరు. పిమ్మట నరసింహనామక క్షత్రియోత్తముఁ డభ్యుదయింపఁ గలడు. పిదప పేణాపురమునందుఁ గలికంపుడను వైశ్యుఁడు ధ్భవింపఁ గలడు. వీరలు నన్ను ధ్యానించి భక్త వతంసులగుదురు.

ఈ తాత్పర్య భావముల వలనఁ గలియుగమున క్షత్రియవైశ్యులు కూడ నుందురని తెలియుచుండ గలియుగమున క్షత్రియులు లేరనుట సాహసము. పూర్వోక్త చర్చాదికముల వలనఁ గలియందు క్షత్రియులుండిరనియు, తెల్లంబగుచున్నది. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రజాతి నిర్ణయము నాయాదేశములందలి అనిర్దిష్ట శిష్ట వ్యవహారముల వలనఁ దెలిసికొననగును. వర్తమాన కాలమందుఁ గూడ అనగొంది విజయనగరము పర్లాకిమిడి జయపురములోనగు క్షత్రియ సంస్థానములాంధ్ర దేశమునను, జోధపూరు, ఉదయపురి, బొందిరా, బీకానూరు, ఇందూరు, కాశ్మీరు, నేపాలులోనగు క్షత్రియ సంస్థానములుత్తర హిందూస్థానమునను తిరువాన్కూరు అనంతశయనము మున్నగు క్షత్రియ సంస్థానములు దక్షిణహిందూ దేశమునను నేటికిఁ గలవు కలియుగమునందు క్షత్రియులాచారాదికము లందు వెనుక బడియుందురని గ్రంథాంతరములలోఁ గలదు.

"శ్లో॥ **నశిష్ఠ కౌండివ్యధనుంజయా నాంగో త్రోద్భవాః**
**కాశ్యపగోత్రజాతాః శూద్రాఇవాత్యంత గృహీత వేషాః ।**
**భూసాభవిష్యంతి కలౌ యుగేహీ ॥**

కలౌయుగే స్నానవిహీన కాశ్చ సంధ్యాది వేదోక్త సుకర్మశూన్యాః ।
సర్గాతి దోషేణవినర్జితాశ్చభూసా భవిష్యంతిహిచిత్రకేతో ॥
మార్కండేయ పురాణ ముత్తర భాగము

వశిష్ఠ, కౌండిన్య, ధనుంజయ, కాస్యప, గోత్రజాతులగు క్షత్రియులు కొందఱు శూద్రులవలె ప్రచ్ఛన్న రూపధారులై కలియుగమున వర్తింతురనియు మఱియు వేదవిహితస్నాన సంధ్యాదికర్మ శూన్యులై భూపరిపాలన మొనర్చు చుందురనియుఁ బై శ్లోకముల భావము క్షత్రియులాచారాదికములందు వెనుకబడి యుండుటకుఁ గారణము నీ క్రింద నుదహరించు చున్నారము.

శ్లో॥ మహాపద్మాఖ్య నగరేస్థిత్వా నందోబహోబలః ।
శాశిష్యతినసం దేహస్సర్వదేశ స్థితాన్నృపాన్ ।
తేతుతస్యనమస్కారం నకరిష్యంతి భూమిపాః ।
శూద్రాగర్భోద్భవాత్వాచ్చ వేదోక్త విధిహీనతః ।
క్షత్రవంశోద్భవాభావాన్న కరిష్యంతితస్యతు ।
నమస్కారంహి రాజేంద్ర సర్వదేశస్థితాన్ నృపాన్ ।
తస్మాత్కోపాత్పద్మపతిః నందోబలపరాక్రమః

శ్లో॥ తంహిత్వానంద భూపాల స్సర్వసైన్యసమావృతః ।
ఆర్యావర్తాదికాన్ దేశాన్గమిష్యతి చరాజతాన్ ।
ఏవంతాస్తాంశ్చ భూపాలాన్ నమిష్యతినసంశయః ।
మమకార్యోనమస్కార ఇతివాచంసుదారుణం ।
సూర్యవంశోద్భవాభూపాశ్శృత్వా రోపసమన్వితాః ।
యుద్ధాయైవహితేవ ర్వేకరిష్యంతిహి నిశ్చయం ।
తేషాంనా మానివక్ష్యామిశ్రుణుభూపసమాహితః ।
సాంఖశ్చదాపలశ్చైవనాగ పుర్యధిపౌవరౌ ।

మందకః కట కాధీశఃపత్తిసాతశ్చభూపతిః ।
గయాధీశాధిపో వీరో దండకారశ్చభూపతిః ।
దండకారశ్చకేదార దేశరాజశ్చవీర్యవాన్ ।
చిత్రకూటాధిపోవీరో మంథనాథశ్చభూపతిః ।
అంథతీదేశనాథశ్చ కాకలో హీరభూపతిః ।
బ్రహ్మావర్తాధిపో వీరోరంతిలారశ్చ వీర్యవాన్ ।

ఏతేచాన్యేచబహస్సంభూయ క్షత్రియోత్తమాః ।
నందభూపేనభూపాలాః యుద్ధంకృత్వాదినత్రయం ।
జితాస్తేనమహారాజన్..కారాగృహప్రతిష్ఠాశ్చకార ఇష్యతిశాసనాత్ ।
కారాగృహేవర్తమానాస్వాచార పరివర్జితాః ।
క్షత్రవేషవిహీనాశ్చశస్త్రాస్త్ర పరివర్జితాః ।
స్నానసంధ్యా విహీనాశ్చశూద్రాచారైక తత్పరాః ।
శూద్రానితోదకం సమ్యగ్గృహ్యామానాశ్చభూమిపాః ।
మత్స్య మాంసాదినశ్చైన శూద్రా ఇవశిఖా వృతాః ।
కారష్యంతిరాజనః శాసనాన్నందభూపతే ః ।
ఏకచ్ఛత్రాంసపృథి వీమనుల్లంఘిత శాసనః ।
సంవత్సరశతం నందః పాలయిష్యతి మేదినీం ।
కారాగృహేవర్తమానాః పంచాశద్వత్సరాత్పరం ।
సాంఖప్రముఖ రాజానో హైన్యవృత్యేక జీవనః ।
నందస్యచ నమస్కారంకృత్వాముక్తాశ్చతేనవై ।
నియోజితాశ్చతేనైవ నందేనైవదురాత్మనా ।
కృషికర్మపరాశ్చైవ భవిష్యంతిన సంశయః ।
కించిత్కాలంహితత్రైవ స్థిత్వాసాంఖముఖానృపాః ।
వింధ్యస్యదక్షిణే భాగేసముద్రప్రాంతమండితాన్ ।

**కళింగాంధ్ర విదర్భాంగ దేశానాక్రమ్య భూమిసాః ।**
**తదాదిభూమి సాలాశ్చసూర్యసోమ సముద్భవాః ।**
**పూర్వోక్తేనప్రకారేణ భవిష్యంతిన సంశయః**

**మార్కండేయ పురాణం**

వీర్యవంతుఁడగు నందరాజు మహాపద్మ నగరమును రాజధానిగా జేసికొని రాజ్యముసేయుచు సర్వదేశస్థ నృపాలురను శాసించగలడు. నందరాజు శూద్ర స్త్రీ గర్భమున జనించినవాఁడగుటచే క్షత్రియులెల్లరు నతనికి నమస్కారాదులొనర్పనందున నందరాజు కోపావిష్టుఁడై యారాజోత్తముల నెల్లజయించి నమస్కారాది గౌరవములఁ బడయఁదలంచి సర్వసైన్యమావృతుఁడై బయలుదేరివచ్చి ఆర్యావర్తాదిక దేశమందలి కొందఱు రాజులచే నమస్కారములను గొనగలడు. సూర్యవంశ సంజాతులగు రాజులీ కరిన వాక్యములు విని ప్రచండ రోషా వేశులై తమతమ సైన్యములతో గూడినంద రాజుపైకి యుదమొనరింప బయలుదేరి పోయిన వారిలో ముఖ్యులు.

నాగపురి ప్రభువులగు సాంఖలుఁడును. దావలుఁడును కటకాధీశుఁడైన మందకుఁడు. పత్తిపాత ప్రభువు, బలవంతుడగు గయాధీశుఁడు దండకారుడను రాజపుంగవుఁడు వీర్యవంతులగు దండకార కేదార రాజులును, చిత్రకూటాధి పతియు మంధనాధుడను రాజు. అంధతీ దేశనాధుఁడు కాకలోహీర భూపతి బ్రహ్మావర్త ప్రభువు అంతిలారప్రభువు మొదలగు ననేక సూర్యచంద్ర వంశ క్షత్రియోత్తములు నొకటిగఁ జేరి నందరాజుతో మూడు దినములుపోరాడి యోడగలరు. నందుని శాసనప్రకారము వారలు కారాగృహమునందు బంధితులగుదురు. అది మొదలు బంధితులగు రాజులు వేదోక్తాచారాదికములు మాని శూద్రానీతో దకాదులఁ ద్రాపుచు శూద్రప్రాయులుగాఁ జేయఁబడుదురు. కారాగృహస్థులగు రాజులిట్టిహీన జీవనముతో నుండుటకు విసికి నమస్కరించిన పిదప వారల నారాజు విడువగలడు. ఇట్లు కారాగృహ విముక్తులగు రాజులు జాత్యుచిత సంస్కార శూన్యులై కృషి కర్మపరులై ప్రవర్తింపగలరు. ఈ రాజులు కొంత కాల మిటులుండి సముద్ర ప్రాంతములగు వింధ్యాద్రి దక్షిణ భాగమునంగల గళింగవిదర్భాంధ్రాంగాది దేశములు చేరుదురని పై శ్లోకముల ముఖ్యభావము.

వీనినన్నింటిని సమన్వయించి చూచితిమేని కలియుగమున రాజకుటుంబములు ప్రసిద్ధములైనవి చాలా కలవనియు గొన్ని వర్ణాశ్రమధర్మములు కలియుగాంతమున నెలకొల్పుట కింకను బీజభూతములుగా నిలిచియున్న వనియుఁ మఱి గొన్ని క్షత్రియకుటుంబములు పరశురాముని యొక్కయు మహానందునియొక్కయు విజృంభణము వలన ప్రచ్ఛన్నములై దూరదేశములకేగి కర్మాభావము వలనను బ్రాహ్మణ సందర్శనము లేక పోవుటవలనను శూద్రప్రాయములయ్యెననియుఁ బురాణముల సారాంశమై యున్నది. దీనినిఁ బురస్కరించుకొని స్మృతీతిహాసములలోఁ గొన్నిటియందుఁ గలియుగమున క్షత్రియులే లేరను సిద్ధాంతములనుఁ బూర్వపండిత ప్రముఖులు ప్రవేశపెట్టి యుందురు. దేశచరిత్రములు శాసనములు సవిమర్శనముగా బరిశీలింతుమేని సూర్యచంద్ర రాజన్యకుటుంబములు పెక్కులు గానవచ్చుచున్నవి. ఇందుఁ బలువురు యజ్ఞయాగాది క్రతువులు గావించి తమ క్షత్రియ ధర్మముసార్థకము గావించుకొని యున్నారు. అట్టి వారలలో రాష్ట్రకూటులు, చాళుక్యులు, చోళులు లోనగురాజులు చేరియున్నారు. కాకతీయులు, దేవగిరి యాదవులు, కదంబులు, గాంగులు, గుప్త వంశీయులు క్షత్రియధర్మములతో నలరి సూర్యచంద్ర వంశజులమని చెప్పికొని వేదోచితా సారములతోఁ బ్రవర్తించి సుప్రసిద్ధివహించి యున్నారు.

వర్ణాశ్రమ ధర్మముల కట్టుబాటులు పూర్తిగా బిగిసి జాతులు బ్రహ్మనుండి సంభవించినవను సిద్ధాంతములు సర్వత్ర ప్రతిపాదింపఁబడిన యీ కాలమున గూడ సూర్యచంద్ర వంశముల నుండి యభివృద్ధి నొంది గుప్త ప్రాయములుగానున్న క్షత్రియ వంశములు పెక్కులు గలవు. అట్టి క్షత్రియ కుటుంబములు శూద్ర ప్రాయములుగా బాహ్యదృష్టికిఁ గాన వచ్చినను క్షత్రియ ధర్మములు వారి యందు విశేషించి కనుపట్టుటయు శాసనాదుల యందు మేము సూర్యచంద్ర వంశీయుల మనియుఁ జెప్పుకొనుట తఱచుగాఁ గనబడుచునే యున్నవి. పురాణ-కాలమునందు క్షత్రియు కుటుంబములన్నియుఁ దమలోఁ దాము సంబంధ బాంధవ్యములు సలుపుకొనుచు సమానప్రతిపత్తితో వర్తించినట్టులనే చరిత్రయుగము నాటి చోళ చాళుక్యాదులు గూడ తమలోఁదాము సంబంధము చేసికొనుచు సమప్రతిపత్తి గలిగి యున్నట్లు

బెక్కులాధారములు గలవు. ఈ జాతినుండి బయలువెడలిన క్షత్రియజాతుల నేలకో మన పండితులు చతుర్థ వంశీయులని వ్యవహరించినారు. ఈ చతుర్థ వంశీయులే విశేషించి క్షత్రియచ ధర్మావలంబకులుగాను ఋషిగోత్ర సంబంధులుగాను, శాసనాంతరముల యందు సూర్యాది వంశజులుగా నుండుటచే క్షత్రియులకుఁజతుర్థ వంశమను పేరు మనదేశ పండితులు ప్రసాదించిరని తెలియుచున్నది. స్వయం వ్యక్తిగల ప్రచ్ఛన్న క్షత్రియులు విజృంభించి తాము సూర్యచంద్ర వంశ క్షత్రియులమని చెప్పుకొనినటులు రాబోవు ప్రకరణమునందు శాసనాద్యాధారములతో రెడ్డి తెగను గూర్చి విమర్శము చేయునప్పుడు సహేతుకముగా ఋజువు చేయుదుము.

ఆంధ్రదేశమ్మున సుప్రసిద్ధులైయున్న రెడ్డివీరులు రాజ్యపాలన సాహసవిక్రమాది గుణతేజో బలసంపదలందు క్షత్రియులనఁదగి యున్నారు. వీరిని కవులు కొందఱు చతుర్థవంశజులుగాఁ జెప్పినను క్షత్రియులతో వీరు సంబంధ బాంధవ్యములుచేసి దాన ధర్మాధికములొనరించి క్షత్రియులమని చెప్పుకొనుటకఁ బ్రమాణములుదాహరించి రెడ్డి వీరులు క్షత్రియులని స్థాపించుట ప్రకృతమై యున్నది. కలియుగమున క్షత్రియజాతికలదు. గావున నట్టి క్షత్రియ జాతులలో రెడ్డి జాతి యొకటియని నిర్ణయించి రెడ్డివీరులు సుప్రసిద్ధములగు సూర్యచంద్ర వంశ క్షత్రియులలోని వారని నిర్ణయించుటకు నింత విమర్శము చేయవలసి వచ్చినది. తొలుత చరిత్రయుగము నాటి క్షత్రియ జాతుల చరిత్రములు వారి బాంధవ్యములు తెలిపి వారికి రెడ్డి శాఖకుఁ గల సంబంధము నెఱింగి పిమ్మట మవాత్త రాంధ్ర దేశ బరిపాలనము గావించిన యీజాతికిఁ గృతజ్ఞుల మగుదుము.



శ్రీరస్తు

# రెడ్డికుల నిర్ణయ చంద్రిక

## మూడవ ప్రకరణము

ఆంధ్ర దేశమునందున్న రెడ్డిజాతి క్షత్రియజాతియని చెప్పుటకు ముందీ దేశమును బాలించిన రాజ కుటుంబములను రాజ్యపాలన విశేషములఁగూర్చి తొలుత గొంచెము చెప్పవలసి యుండును, అప్పటికిఁగాని విషయము సమగ్రముకాఁజాలదు. ఆంధ్రభృత్య వంశమగు శాతవాహనవంశము, చిరకాలము రాజ్యముపాలించి, యంతరించిన పిదపఁ బల్లవులు, పరిపాలన భారమువహించి కాంచీ మండలమునకుఁ జెందిన ద్రవిడ దేశ భాగములు తెలుఁగు దేశము పరిపాలించిరి. వీరలాంధ్రులనియు నాంధ్రరాజ కుటుంబములతో సంబంధ బాంధవ్యములు జరిపిన సంగతి చరిత్రకారులు పలువురు విశ్వసించినదే. పల్లవరాజ్యావసాన కాలమున రాష్ట్రకూటులు కర్ణాటాంధ్ర దేశముల నాక్రమించుకొన నారంభించిరి. రాష్ట్ర కూటులలో సుప్రసిద్ధుఁడగు నింద్రవర్మ యారవశతాబ్దము నందుఁ జాళుక్యజయసింహునిచే నోడింపఁబడెను. పిదప చోళవంశము కర్ణాటాంధ్ర ద్రవిడ దేశముల నొక్కమొగి నాక్రమించుచు ముందునకు వచ్చెను, వీర్యవిక్రమ భాసురులగు చోళుల విజృంభణము నంతయునాపుటయేగాక చోళవంశమును చోళరాజ్యమునుఁదమలోఁ గలుపుకొని చాళుక్యులు ప్రసిద్ధులైరి. ఆవల రెడ్డివీరులు నాంధ్రదేశమున స్వతంత్ర పతాకము స్థాపించి తెలుఁగుదేశమును తెలుఁ గు బాసను వెలయజేసిరి. ఈ రెడ్డివీరులు కృష్ణా గోదావరి మండలములు కర్నూలు కడప మండలములోని పెక్కు భాగములు, నిజాము రాష్ట్రములోని మహబూబునగరు, రాయచూరు, మెదకు, నల్లకొండ, వరంగల్లు మొదలగు మండలములు స్వతంత్రముగా రెండుమూడు వందల సంవత్సరములు పరిపాలించి యంతః కలహశీలురగు వెలమవీరుల యొక్కయుఁ, బరరాజ్యాకర్షణ ప్రవీణులగు యవనవీరులయొక్కయు, సావాసములకు బలియై పూర్వోశోభ గోల్పోయిరి. వారలు నిర్మించిన కొండవీడు, అద్దంకి, ధరణికోట, వినుకొండ, బెల్లముకొండ, కొండపల్లి, కోలేరు, కోరుకొండ, మె..కు,

రాయచూరు మొదలగు దుర్గరాజములు ఒందినకృతులు, రచించిన ఉద్గ్రంథములు, పాలించిన విశాలరాజ్యములు, స్థాపించిన శాసనములు, కట్టించిన ప్రఖ్యాత దేవాలయములు, నొసంగిన బ్రాహ్మణాగ్రహారములు నేటికిc జరిత్రమున శాశ్వతముగా నున్నవి. ఇంచుమించుగ దొమ్మిదవ శతాబ్దమునుండి యాంధ్రదేశమున సుప్రసిద్ధులుగ నుండి అంతకుమున్నెన్నడో యాంధ్రదేశమునc జేరి యాంధ్రులలోc గలసిపోయిన ఈ వీర వంశ చరిత్రముc గులము దెలిసికొనుట ప్రత్యాంధ్రులలో నొకటిగ నున్నది.

ఆంధ్రదేశమును బాలించిన రాజవంశములలో రెడ్డివారలే కుటుంబమునకుc జెందినవారో క్షత్రియులతో వీరలకు నెటనెట సంబంధములు కలసినవో వీరలు క్షత్రియులనుటకు నేమేని యాధారములు గలవేమో తెలిసికొనుటతో నీప్రకరణము సంపూర్ణమగును గావున ప్రకృతమునకుc గడంగుదము.

రెడ్డివీరులు రాష్ట్రకూట వంశీయులనుటకుc జరిత్రములు సహాయపడుచున్నవి. రాష్ట్రకూటులు సూర్యవంశీయులు చంద్రవంశీయులు నగు క్షత్రియవర్యులు. గావున రెడ్డి వీరులను గూడ క్షత్రియులని వ్యవహరించుటకుc దగిన యాధారముల నార్జింప వలసియున్నది. రాష్ట్రకూటరాజగు మూcడవ కృష్ణుడుదియోలితామ్ర శాసనమునందుc దన వంశమునిట్లు చెప్పుకొనెను.

**శ్లో॥ క్షితితలతిలకస్త దన్వయేన క్షతరిపుదన్తి ఘటోజనిష్ఠ రట్టః ।**
**తమను చసుత రాష్ట్రకూట నామ్నాభువివిదితో జని రాష్ట్ర కూటవంశః**

ఆ వంశమునందు రాజశిరోమణియగు రట్టుcడు మూలపురుషుcడనియు నతని పుత్రుcడు రాష్ట్ర కూటుcడనియు నతcడే రాష్ట్రకూట వంశమునకుc గర్తయని పై శ్లోక భావము. దీనిచే రట్టులు రాష్ట్ర కూటులొకరనియే నిర్ణయమగుచున్నది. వీరు (మాన్యఖేటపు) రాష్ట్రకూటులు తమ శాసనములలోc దాము చంద్ర వంశజులమనియు యాదవాన్వ యులమని తెలుపుచున్న విధము నీక్రింద నుదాహరించుచున్నారము.

**"శ్లో॥ తారాచక్రాంశ షండావృతగ గనసరః పద్మి నీ రాజహంసా ।**
**త్రైలోక్యా కాధిపత్య స్థితమదన మహారాజ శుభ్రాతపత్రాత్ ।**

లావణ్య క్షీరసింధో ర్ద్యుతిరజ తగిరేర్దిగ్వధూదంతపత్రా
ద్వంశస్సోమాదయంతు త్రిభువనకమలా వానసౌధాదుపేతః ॥
తస్మాత్ప్రియః కులగృహంభవన మ్మహిమ్నః ।
క్రీడాస్పదంస్థితి మహర్ధిగభీరతా నాం ।
ఆపన్న సత్వ పరిపాలన లబ్ధకీర్తి ।
ర్వంశోబభూవ భువిసింధునిభోయ దూనాం ॥
పరిణత పర మండలః కలావా ।
న్ప్రవితతబహుళ యశోంశుపూరితాశాః
శశధర ఇవదంతి దుర్గరాజోయదు కులవిమలవియ త్యధోదియాయ॥

ఉద్వృత్తచైత్య కులకందల కాంతిహేతు
స్త్రావతారమక రోత్పురుషః పురాణః
మద్వంశజాఃజగతి సాత్యకివర్గభాజ
స్తుంగాఇతి క్షితిభుజః ప్రథితాబభూవుః

చంద్రవంశము నందు యదుకుల మొకటి గలదు. అందు మూలపురుషుండు దంతిదుర్గ రాజు. తద్వంశులు తుంగులనుపేరం బ్రసిద్ధులు (రాష్ట్ర కూటులని వీరిని వ్యవహరింతురు). వీరు సాత్యకివర్గసంభూతులని పై శ్లోకముల భావము. రాథోడులని వ్యవహరింపఁబడు రాష్ట్రకూటులు సూర్యవంశజులమని చెప్పుకొనినారు. క్రీ.శ. ౮౬౬ నాఁటి సిరూరునిడగుండి శాసనమువలన అమోఘవర్షుఁడను రాష్ట్రకూట రాజు. రట్టకందర్పుఁడు. రట్టవిద్యాధరుడు. రట్టవంశోద్భవుఁడు. రట్టరాజ్యము, రట్టకులభూషణుఁడు మొదలగు విశేషములుగలవాఁడని తెలియుచున్నది. ఇటులే పలువురు రాష్ట్రకూటరాజులు తాము రట్టవంశజుల మనియేకాక సామములచెంత రట్టపదము నుపయోగించుకొనుచు వచ్చిరనుటకు అమ్మరాజు శాసనమునందలి, "గంగరట్టబలై స్సార్థం ద్వాదశాబ్దాన హర్నిశం" అను భాగమునఁగలగంగ రట్టపదము సహాయము కాగలదు. రాథోడులకు కన్నోజ్ అయోధ్య పూర్వ నివాసమనియు వీరిలోనొక శాఖవారు యోధపురసంస్థానాధిపతులైరనియు, వేఱొకశాఖవారు దక్షిణహిందూ దేశమునకు వచ్చి చోళులకు సామంతులై యుండిరనియు, వీరిలో గొందఱు

వ్యవసాయకులుగను, మఱికొందఱు గ్రామాధికారులుగను నిలువబడిపోయిరని చరిత్రము వలనఁ దెలియుచున్నది. ఇంతవఱకుఁ జేసిన చరిత్ర విమర్శనము వలన రెడ్డివారు సూర్యచంద్ర క్షత్రియ వంశములకు సంబంధించిన రాష్ట్ర కూటులనియు, రాష్ట్రకూటులుత్తర హిందూస్థాన ప్రాంతముల నుండి తొలుత కర్ణాటమునకుఁ బిదప నాంధ్రదేశమునకు వచ్చి, తొలుత రట్టులనియుఁ, బిదప రడ్డులనియు, నావల రెడ్డులనియు వ్యవహరింపఁబడుచు సామంతులుగా, గ్రామాధికారులుగాఁ, గర్షకులుగా నుండి యాకాలముననున్న రాజకుటుంబములతో సమానగౌరవ ప్రవత్తుల బడసిరని విశ్వసింపవలయును. రాజకీయ వ్యవహారములలో చోళులు రాష్ట్రకూటుల నాలోచించినటుల శాసనములందుండుటయే యందుల కాధారములు. రాష్ట్రకూటులే రెడ్డివారనునంశము మేము స్వయముగాఁ గల్పించినది కాదు. సుప్రసిద్ధ చరిత్రకారులగు శ్రీయుత చిలుకూరి వీరభద్రరావుగారు, శ్రీయుత మల్లంపల్లి సోమశేఖరశర్మగారు కీర్తిశేషులయిన శ్రీయుత కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణ రావు ఎం.ఏ. గారుకూడ తమ తమ గ్రంథములయందు నేకీభవించినారు. కావున వారి వారి గ్రంథములనుండియు బ్రస్తుతోప యుక్తాంశముల నుదాహరింతుము.

"రెడ్డిశబ్దము రాట్శబ్దము నుండి ఏర్పడినది. గావున రెడ్డియనఁగా రాజని అర్థమగుచున్నది. కాపు శబ్దమునకుఁ కావలికాచువాఁడు (రక్షకుడు) అని అర్థము. ఇయ్యవి పండితులు సైతము చెప్పెడి యర్థములు. ఇపుడు కాపుశబ్దము రైతు వ్యవసాయకుడు అను శబ్దమునకుఁ బర్యాయ పదముగా వ్యవహరింపఁబడుచున్నది.

ప్రాచీన కాలమున రట్టులను నొకజాతి ప్రజలు భరతఖండమున నివసించు చుండిరని వేదముల వలనను శాసనముల వలనను మనకు స్పష్టముగాఁ దెలియుచున్నది. వీరిలో రట్టులు లేక రాట్టులు, ఆరట్టులు, లాటులు, విరాటులు, మరాటులు, వరాటులు, కిరాటులు, భల్లాటులు, అందీ రాటులు, ఖగరాటులు మొదలగు శాఖా భేదములు గలవు. వీరిలోఁ గొందరకు భోజులనియు నామాంతరము కలదు. ఈ భోజులలో ననేకులిప్పుడు కమ్మశాఖవారిలో నున్నారు. ఈ రాట్టశాఖలవారు తొలుత సింధునదీతీర ప్రాంతభూములందును బిమ్మట గంగానదీ తీర భూములందు నటుపిమ్మట గౌతమీకృష్ణా

నదీతీర భూములందు నివసించుచుఁ గ్రమముగ హిందూ దేశమున వ్యాపించిరి. వీరెల్లరు వేరు వేరు దేశములకుఁ బోయి దేశభేదముచేతను, భాషాభేదము చేతను వేఱు వేఱు నామములతో నేటికాలమున వ్యవహరింపcబడుచున్నారు. వీరు తొలుత కంపిలానగర ప్రాంత దేశమున నివసించి యందుండివచ్చిన వారగుటచే వీరికి కాంపులని వ్యవహారనామము కలిగినది. కంపిలానగరమే కాంపిల్యనగరమని భారతాది సంస్కృతగ్రంథముల వ్యవహరింపcబడుచు బ్రాంచాల దేశమునకు రాజధానిగా నుండెను. మనదేశము నందలి పూర్వపు తెలుంగు శాసనములలోఁ గాంపులనిస బిందుకముగా వ్రాయబడియుండెను. పశ్చిమ హిందూస్థానమందు రాట్టులు నివసించు దేశమునకు రాట్టివాడి యని వ్యవహార నామముగలదు. రాట్టవాడి రాజవంశమునకే రాఠోడ్ లేక రాథోడ్ రాజవంశమని ప్రఖ్యాతి కలిగినది. ఈ రాట్టవాడి రాజకుటుంబమే యొకటి రాష్ట్రకూట రాజవంశముగాఁ బరిగణింపcబడినది. ఈ రాట్టవాడి లేక రాథోడ్ సీమ నుండి యాంధ్రదేశమున కేతెంచి నివసించియున్న రెడ్లనే పూర్వపు దెలుcగు శాసనములలో రద్ధోడి కాంపులని యప్పటి శాసనవిలేఖకులు వ్రాసి యుండిరి. ఏది యెట్లున్నను రెడ్లని వ్యవహరింపcబడెడి తెగలవారు రాట్టజాతులకు సంబంధించిన వారనుటకు సందియము లేదు. వీరెల్లరాంధ్ర జాతులతోడి సంబంధ బాంధవ్యముల చేతను ఆంధ్రభాషను మాతృభాషగా గైకొన్న వారగుట చేతను ఆంధ్రజాతి వారైరనుటకు సందియము లేదు.

ఆంధ్రుల చరిత్రము, మూcడవ ప్రకరణము. 114-115-116 పుటలు నాలుగవ ప్రకరణము.

మఱియు "వీరికి రాజపుత్రరాఠోడులతో సంబంధముండవచ్చుననియు రెడ్లను వారు వీరిసంతతిగా నెన్నcబడుచున్నారు" ఢిల్లిదర్బారు పుట 305.

తక్కినవానిని విస్తరభీతిచే వదలుచున్నారము పై విషయముల సమన్వయము వలన రాఠోరు రాష్ట్రకూటశాఖలకుఁ జెందినవారె రెడ్డి వారని విశదమగుచున్నది. రాష్ట్ర కూటులు మాన్యఖేటము రాజధానిగాఁ గలవారు. మాన్యఖేటము నిజాము రాష్ట్రమందలి మాలిఖేడయియున్నది. ఇంతియగాక రాష్ట్రకూటులు రట్టలూరు పురవరాధీశులమని

చెప్పుకొనిరి. ఈ రట్టలూరు నిజాము రాష్ట్రమందలి "యుస్మానాబాదు" జిల్లాలోని లాటూరని చరిత్రకారులచే నిర్ణయింపఁబడినది. దీనిచే రాష్ట్ర కూటులని వ్యవహరింపఁ బడు రెడ్లు తొలుత ఉత్తరహిందూస్థానము నుండి మహారాష్ట్ర దేశము మీదుగా నిజాము రాష్ట్ర కర్ణాటాంధ్ర దేశములందు వసించుచుఁ గడప కర్నూలు మండలములు చేరి తరువాత దేశమునందంతట వ్యాపించి స్వతంత్ర రాజ్యములు స్థాపించి యప్పటి క్షత్రియ కుటుంబములన్నింటితో సంబంధ బాంధవ్యములను సలిపిరని ముందు నిరూపించు చున్నారము.

చాళుక్యులు చంద్రవంశజులమని శాసనములందుఁ జెప్పికొని యున్నారు. దిఙ్మాత్రముగ గొన్నిటిని నీక్రింద నుదాహరింతుము.

రాజమహేంద్రవరము జిల్లాయిలాకా పెరాపురములో కుంతి మాధవా లయములో విమానమెదుట పాతియున్న శిలాశాసనము.

శ్లో॥ **శ్రీభర్త నాభిగంభీర సరస్సరసి జాతభూత్**
**పద్మభూర్భ్వాతలో కానామేతస్మాదుద్భ వేద్యతిః ।**
**మునీంద్రస్తస్యపుత్రోత్రిరత్రేర మృతదీధితిః ।**
**సోమోభూరి గుణస్తోమః వంశకర్తాతతో బుధః**
**తతఃపురూరవో నామశ్చక్రవర్తి స్సువిక్రమః ।**
**తస్మాదాయురభూత్త స్మాన్నహుషోధపురుర్విభుః**

తతో జనమేజయః తతః ప్రాదీశః । తస్మాత్సం యాతిః । తతస్సా ర్వభౌమః । తతోమహాభౌమః ఇత్థమనేకనరపతి షుగతేషు పాండుర్నామనర పతిరుద్బభూవ । పుత్రాస్తస్య ధర్మజ భీమార్జుననకులసహదేవాః పంచేంద్రియవత్పంచ విషయగ్రహణః తత్రసార్థః ॥

శ్లో॥ **జిత్వాపాండవ రక్షణం సురగణం గాండీవినావజ్రిణం ।**
**యుద్ధేపాశుపతాస్త్రమంధకరిపుర్లబ్ధ్వాదదైత్యాన్ బహూన్ ।**
**ఇంద్రార్ధాసనమప్యశాయిజయినాయత్కాలకేయాదికాన్ ।**
**జిత్వాస్త్వైరుమకారి వంశవివినచ్ఛేదః కరుణాంవిభోః ।**

తతోర్జునాదభిమన్యుః। తతః పరీక్షిత్। తతోజనమేజయః తతః క్షేమః। తతోనరవాహన। తతశ్శతానీకః । తస్మాదుదయినః । తత్రప్రభృతి ష్వవిచ్ఛిన్న సంతానేషు సింహాసనాసీనే ష్వేకోనషష్టి చక్రవర్తిషు గతేషు తద్వంశే విమలాదిత్య నామరాజ, జేగీషయాద్ధ క్షిణపథంగత్వా త్రిలోచన పల్లవ మధిక్షిప్య హరిహయ లోకాంతర మగమత్ తస్మిన్కాలే తస్య మహాదేవ్యంతర్వత్ని పురోహి తేవ సార్ధం వేమునామాగ్రహార ముపగమ్య తద్వాస్తవ్యేన విష్ణుభట్టసోమయాజినాదుపాత్ నిర్విశేష మభిరక్షతాం। సానందవం విష్ణువర్ధన మనూత॥ తస్యకుమారస్య మానవ్యగోత్ర హరితిపుత్ర ద్విపక్ష క్రమా ఖిలాని కర్మాణి కారయిత్వా మావర్ధయతన్। సదమాత్రా విదితవృ త్తాన్తస్య న్నిర్గతస్య చాళుక్య గిరేర్నందాం భగవతీంగౌరీ మారాధ్య కుమార నారాయణ మాతృగణాంశ్చ సంతృప్త శ్వేతాతపత్రక శంఖ పంచమహారణ కనకదండ గంగాయమునాధునీస్వకుల క్రమాగత వినిక్షిప్తాని సానర్మదా పర్యంతం సార్ధకంత్రైలక్షం దక్షిణపథమపాలయామాస ॥

ఇలివేటు తెలుగు శాసనము ౯౪

విశాఖపట్టణము యిలాకా విజయనగరము సంస్థానము బాబతు నెల్లిముక్కు ఠాణాలో చేరిన పంచదార్లశివారు దోమపాలిగ్రామమునకు నుత్తరమున నున్న శ్రీ ధర్మ లింగేశ్వర స్వామి వారి ఆలయములో నున్న కల్యాణమంటపము నందలి శిలా శాసనము.

శ్లో॥ శ్రీ సంవృద్ధిం చిరమురుతరాం శ్రేయసాం సత్రపన్యా ।
శ్రీ మన్నాభి సరోరుహాదుదభవద్విష్ణో రజశక్తిమాన్ ।
తత్రా (స్యా) త్రిస్సమజేజనస్సభగవాన్ తన్నేత్ర తశ్చంద్రమా ।
తస్మాజ్జాత సుధాకరా త్సురగణై సంసేవ్యమానో బుధః ।
తత్పుత్రశ్చ, పూరూరవక్షితిపతి ర్భూపాల చూడామణిః ।
తదన్వయే జాయతి పాండుభూపస్తతోర్జునో శాశ్వతరాజమం
దన స్తతోభిమన్యుక్షితిపాల శేఖరస్తతః పరీక్షిజ్జనమేజయశ్చ
తదన్వయే జాయతి విష్ణువర్ధనస్సంవర్ధనో రాజకులస్య సంతతి ।
శ్చళుక్య శైలాతపశాలి నందితైర్దుర్గార్చితా ద్వ్యైఃకృతవిక్రమస్తుతైః ।

ఆశీదిందుకులాగ్రణిర్జనపతిశ్చాళుక్య భీమేశ్వర ।
స్తస్యక్షాత్రపవిత్ర శైవపదవీవృత్తం విచిత్రంభువి ।
తేనైకార్పిత వైభవాత్థలు సదాచాళుక్యభీమేశ ఇ।
త్యాఖ్యామాపదపూర్వికామిహ కుమారారామభీమేశ్వరః ।
తద్వంశేవిమలాదిత్యః హృత్యప్రత్యర్థివిక్రమః ।
శశాసయశ సోసాంద్రవింధ్య సింధ్వంతరాంధరాం ।
తదాత్మజో రాజనరేంద్రభూవరో భూర్యాభి వేద్రాజమహేంద్ర నాయక ।
స్తదాఖ్య యారాజ మహేంద్ర సంజ్ఞకం రమ్యప్రదం రాజిగగౌతమీతటే ।
తస్యపుత్రకులోత్తుంగ ........

పై శాసనము నందలి చాళుక్యుఁడగు రాజనరేంద్రుఁడు భారతములో సయితము నన్నయభట్టుతో తానుచంద్రవంశుఁడనని యిట్లు చెప్పుకొని యున్నాడు.

చ. హిమకరుఁదొట్టి పూరుభరతేశ కురుప్రభుపాండుభూపతుల్
క్రమమునవంశకర్తలనఁగా మహినొప్పిన యస్మదీయ వం
శమునఁ బ్రసిద్ధులై విమలసద్గుణ శోభితులైన పాండవో
త్తముల చరిత్ర నాకు సతతంబు వినంగనభీష్టమెంతయున్.

భారతము । ఆదిపర్వము అ అ పద్యము ౧౪

పై శాసన గ్రంధప్రమాణముల వలన చాళుక్యులు చంద్రవంశ క్షత్రియులనుటకెంత మాత్రము సందియముండదు. వీరిలో ననేకులశ్వమేధములొనర్చి నటుల వారల శాసనములలోఁ గలదు. దిఙ్మాత్రముగఁ గొన్నిటి నీ క్రింద నుదాహరింతుము.

## ఇంద్రవర్మకి రాణ్డగూరు తామ్ర శాసనము

స్వస్తి శ్రీమతాం సకల భువనసంస్తూయమానమానవ్యసగోత్రాణాం స్వామి మహాసేవక పదాబ్జధ్యానదానాణాం.... అశేషమహీభృతాశ్వ మేధావబృధ స్నానపవిత్రీ కృతమానాం స్వయశో విజయార్చిత త్రైలోక్య చాళుక్యానాం కులమలం కృత్వా..... శ్రీన్ద్రవర్మమహారాజః

## పొలమూరు తామ్ర శాసనము

క్రతు సహస్ర యాజిహిరణ్యగర్భ ప్రసూతః ఏకాదశాశ్వమేధావ భృతస్నానవిగత జగదేన స్కఃసర్వభూత పరిరక్షణచుంచుః విద్వద్విజ జగురు వృద్ధత పస్విజనాశ్రయో మహారాజః మాధవ వర్మ ఆపిచ స్వస్తిశ్రీ మతాం...... వరవరా హలాంఛనే క్షణ క్షణవ శీకృతారాతి మండలానామశ్వమేధావ భృథస్నాన పవిత్రీకృతిపుషాం చాళుక్యా నారి కులమలంకరిష్ణో

(శక్తి వర్మ ప్రభు బఋశాసనము ౪౦౯ పుట 2వ జం. ఆం. సా. పరిషత్పత్రిక)
కందూరువుదయ చోడమహారాజు శాసనము, జడిచర్ల,

**శ్రీ జయత్యావిష్కృతంవిష్ణ ర్వారాహం క్షోభితార్ణవం ।**
**దక్షిణోన్నత దంష్ట్రాగ్రవిశ్రాంతం భువనం వపుః ॥**

శ్రీమతాంసకల భువనసంస్తూయమాన మానవ్యసగోత్రాణాం హారితిపుత్రాణాం కార్తి కివరప్రసాద లబ్ధరాజ్యానాం సప్తలోక మాతృభిసప్తమాతృభి వర్ధితానాం కార్తికేయ పరిరక్షణ ప్రాప్త కల్యాణ పరంపరాణాం భగవన్నారాయణ ప్రసాద సమాసాదిత వరాహలాంఛన క్షణ క్షణ వశీకృతాశేష మహీంభృతా చళుక్యానాంకుల మలంక రిష్ణోరశ్వమేథావ భృథస్నాన పవిత్రీకృతగాత్రస్య శ్రీపులకేశి వల్లభ మహారాజస్య ప్రియతనయః కీర్తివర్మ శ్రీ పృథ్వీవల్లభ మహారాజాః । తాస్యాత్మజః సత్యాశ్రయ శ్రీపృథ్వీవల్లభ మహారాజ పరమేశ్వర స్తస్య ప్రియతనయః విక్రమాదిత్య భట్టారక స్తస్మాత్మజః విజయాదిత్య శ్రీ పృథ్వీవల్లభ మహారాజాధిరాజ పరమేశ్వర భట్టారక స్యాజ్ఞయా భట్టపదేశా నాచార్యస్వామినా షట్త్రింశదుత్తరే షట్ఛతె శకవర్ష వర్తమాన విజయరాజ్య సంవత్సరేషు ద్వాదశ వర్తమాన వైశాఖ శుక్ల త్రయోదశ్యామియం ప్రాకారే బంధకృతిమితి ।

**ఇలివేటి శాసనములు** ౨౩

గుంటూరు జిల్లా బాపట్ల తాలూకలోఁజేరిన శిరిపూదెతామ్రశాసనమునందు సత్యాశ్రయ వల్లభేంద్రుఁడను చాళుక్యుఁడశ్వమేధములొనరించి నటుల వేలశాసనములు గలవు. దృష్టాంతమునకై ఒకటిమాత్ర ముదాహరింతుము.

స్వస్తిశ్రీమతాం.................... అశ్వమేధావభృధస్నాన పవిత్రీ కృతవపుషాం చాళుక్యానాంకుల మలంకరిష్ణుసత్యాశ్రయవల్ల భేంద్రతద్భ్రాతకుబ్జ విష్ణువర్ధనః తత్సుతోజయసింహ

ఇట్టి సక్షత్రియులును చంద్రవంశీయులునగు చాళుక్యులలోఁజేరిన రెండవ విజయాదిత్యుని తనయుడఁగు కలివిష్ణువర్ధనునకు రాష్ట్ర కూటులలో మూడఁవ వాఁడగు గోవిందరాజు తన పుత్రియగు శీలమహాదేవినిచ్చి వివాహమొనరించినటులఁ జరిత్రలయందుఁ జెప్పియుండుటచేఁ జాళుక్యులకు రాష్ట్రకూటులకును బూర్వ బాంధవ్యముండె ననుట స్పష్టము. రాష్ట్రకూటులే రెడ్లనియిది వరకే నిర్ణయించుకొని యుంటిమి. దీనిచేఁ బూర్వపు రెడ్లకు చంద్రవంశజులగు చాళుక్యులకు బాంధవ్యమున్నటులఁ దెలిసినది. రాష్ట్రకూటులు ప్రభుత్వ దశఁగోల్పోయి సామాన్య స్థితికి వచ్చి పౌరులలోఁ బ్రాముఖ్యమునొందిరి. కావుననే రాజకీయ వ్యవహారములలో జాళుక్యులు రాష్ట్రకూటులతోఁ ప్రజాపక్షమున భాషించి నటులఁగలదు. చాళుక్యులంతతోఁ బోక సూర్యవంశ క్షత్రియులగు చోళరాజులతోఁ గూడ బాంధవ్యము చేసిరి. పూర్వచాళుక్యులలోని విమలాదిత్యుఁడు చోళుఁడగు రాజేంద్రచోడుని సోదరియగు కుందవాదేవినిఁ బెండ్లియాడెను. చాళుక్యుఁడగు రాజ రాజు చోళకన్యయు తన మేనమామ పుత్రికయునగు అమ్మంగదేవినిఁబరియణయమయ్యెను. కులోత్తుంగ చోళుఁడను చాళుక్యరాజు చోళుఁడగు రాజేంద్రచోడుని పుత్రికయగు మధురాంతకిని బెండ్లాడెను. తరువాత చాళుక్యవంశ మించుమించుగాఁ చోళవంశముగా మారెను. ఇందువలనఁ దేలునది సూర్యవంశజులును కాశ్యపగోత్రులునగు చోళులకు జంద్రవంశజులును మానవ్యసగోత్రులునగు చాళుక్యులకు బాంధవ్యములు గలవనియుఁ జాళుక్యులు చోళులుగా మారిరనియు విశ్వసింపవలయును. ఇటులనే రాష్ట్ర కూటులు (రెడ్డివీరులు) చాళుక్యులతోఁగలయుటయేగాక సూర్యవంశజులగు చోళులతోఁ గూడ సంబంధ బాంధవ్యములు చేసిరనియు, బాంధవ్యబలముచే గొందఱు చోళులమనికూడ వ్యవహరించుకొనిరనియు నిశ్చయించుకొనుటకు నాధారములు కానవచ్చు చున్నవి. ఏబదియవ శతాబ్దారంభమునుండి రాష్ట్ర కూటులు రెడ్డివారనియె వ్యవహరింపఁబడుచు వచ్చిరి. అభినవభట్ట బాణ విరచిత "వేమభూపాలీయమ"ను నొక సంస్కృత గద్య కావ్యము కొండవీడునుఁ బరిపాలించిన అనవేమారెడ్డి కంకితముగా వ్రాసెను. అందీ వేమారెడ్డికి బూర్వుఁడగు కామభూపాలుఁడభివర్ణింపఁబడెను.

రెడ్లకు జగనొబ్బగండ బిరుదముంట వలనను ఆకాలమునకు సరిపడి యితఁ డేయని విశ్వసింపదగిన కామయచోడునిశాసనము .........

రాష్ట్రకూటులకురట్టడియను పేరున్న సంగతి చరిత్రజ్ఞులెరుంగనిది కాదు. రట్టడియను ఉపనామము రెడ్డివారికి సహితము పూర్వము నుండుటచె, రెడ్డివారు రాష్ట్రకూటులు సూర్యవంశజులని గుర్తింపవచ్చును. రెడ్డి పదమునకు బదులు నామాంతమున రట్టడిపదము వాడిరనుటకు, స్వస్తిశ్రీ కులోత్తుంగ చోడదేవర విజయ రాజ్య సంవత్సర ౧౫ శ్రాహిమీనమాస శుద్ధ పంచమి నాణ్ణచూడగంగదేవని..... మధ్యాహ్న ........ సందిగా నిచ్చితిమి. దీనికి ముందు మార్గముదప్పితిమేని గొంగక రాజునానదివ్వేతప్పిన శ్రీ భీమేశ్వర మహాదేవర యానదీనికి సాక్షికరెప్పన విట్టపరట్టడియు మావిణిడి మేడపు నాయకుని కొడుకు పారాయణుండును బొడ్డనపూణ్ణికామిరట్టయు.... రట్టడి సోమప్రోలినాయండు.

నెల్లూరి మండలములోని కావలిలోఁ గనుపించుట వలనను ఇంక నితర విశ్వసనీయ సంబంధ బాంధవ్యముల వలనను జగనొబ్బగండ కామయ దేవ చోడమహారాజే తప్పక వేమాధిపునికూటస్థుఁడగు కామభూపాలుఁడని చరిత్రకారులు భావించిరి. ఈ వంశము మూలపురుషుఁడగు ప్రోలరాజు గూడ విక్రమ సింహపురమను నామాంతరముగల నెల్లూరు పురాధ్యక్షుఁడగు తుఖ్ఖారఘట్టుని పుత్రికయగు అనంతాంబికను బెండ్లాడినటులఁ గలదు. ప్రోలరెడ్డి అద్దంకి బాలించు కాలమున విక్రమసింహపురి (నెల్లూరు) ని సూర్యవంశజులును మనుమసిద్ధి సంబంధులునగు చోళులు పాలించు చుండిరి. గావున అనంతాంబిక చోళులయింటి యాడుపడుచనుటకు సంశయము లేదు. కావున రెడ్లకు సూర్యవంశజులగు చోళులకు సంబంధమున్నదను మాటసత్యమని చరిత్రాధారములతో సిద్ధాంతమైనది. ఇంతియేఁగాదు.

శ్లో॥ శచీవశక్రస్యశివేవశంభోఃపద్మేవసాపద్మవిలోచనస్య ।
వేమాంబికాచోళకులేందు భీమభూపాత్మజాభూన్మహిళాస్యజాయా
శ్రీ వేమభూమీశ్వర వీరభద్రభూనాథ దొడ్డక్షితి పొన్నభూపాః ।
అల్లాడశౌ రేరభవన్కు మారాస్త స్యాయథాపంక్తి రథస్యపుత్రః ॥

కోరుమల్లి శాసనము

అను శాసనబాగము వలన భక్తీశ్వర చోడనృపాలుని పుత్రుండగు భీమభూపాలుఁడు త ౖ పుత్రియగు వేమాంబికను అల్లాడ రెడ్డి కొసంగి పాణిగ్రహణము గావించినటులఁ దెలియుచున్నది. ఈ యంశమునే శివలీలా విలాస గ్రంధకర్తయగు నిశ్శంక కొమ్మనామాత్యుఁడు గూడ యీ క్రింది విధముగఁజెప్పియున్నాఁడు.

**మ ॥ భరితశ్రీనిధి యమ్మహీర మణుఁడొప్పం జోళబత్తిక్షితీ**
**శ్వరసూనుండగు భీమలింగ మనుజేంద్ర శ్రేష్ఠుసత్పుత్రిభా**
**స్వరకారుణ్య దశాజనావన విధాసంధాత్రి వేమాంబికన్**
**వరియించెన్నతి భక్తి గౌరవధృధ వ్యాపార నిత్యాంబికన్**

**శివలీలా విలాసము**

**మ. ఆన వేమక్షితిపాలు పౌత్రియగు వేమాంబామహాదేవికిన్**
**ఘనుఁడయ్యల్లడ భూమిపాలునకు సంగ్రామస్థలీ గాండివుల్**
**తనయుల్ వేమవిభుండు వీరవసుధాధ్యక్షుండు దొడ్డ ప్రభుం**
**డును నన్నయ్యయు బాహువిక్రమ కళాటోపప్రతాపోన్నతుల్**

**కాశీఖండము**

అన వేమభూపాలుని పౌత్రియగు వేమాంబచోళ బత్తి రాజకుమారుఁడగు భీమలింగచోడుని పుత్రికయని శివలీలా విలాసకాశీఖండములు దెలుపుచుఁ బూర్వాంశమును స్థాపించు చున్నవి. చోళవంశజయగు వేమాంబిక అనవేమారెడ్డి దౌహిత్రియనుట వలన భీమయ లింగచోడుని భార్య అనవేమునకిఁ బుత్రికయయ్యె. నిట్లు భీమయ లింగచోడుని మామయగు అనవేమారెడ్డికి వియ్యంకుఁడగు చోళబత్తి సూర్యవంశ క్షత్రియుఁడనుటకు నీ క్రింద బ్రమాణములు దాహరించు చున్నారము.

**శ్లో॥ సూర్యోయస్యకులేశ్వరో గుణనిధి శ్రీచోళబత్తిఃపితా।**
**సంత్రాణాంశరణార్థినాం సదవనం షట్కాలమీశార్చనం।**
**కించావారితమన్న దానమఖిలేనిత్య ప్రజాంభూభుజాం।**
**ధన్యోయంచిరమన్న దేవ నృపతీర్జాగర్త్యజయ్యఃపరైః॥**

**ప్రసంగరత్నావళి**

శాసనమునందలి యున్న దేవుఁడు కూడ సూర్యవంశజుఁడని యీ క్రింద నుదాహరించు భీమఖండ పద్యము వలనఁదెలియుచున్నది.

...భానుమత్కుల వీరభద్రాన్న దేవేంద్ర గర్వసంరంభంబుగట్టి పెట్టి
**భీమఖండము**

ఇందుచేత సూర్యవంశజులును కాస్యప గోత్రులునగు చోళులకు రెడ్డివీరులకుఁబంద్రెండవ శతాబ్దము నుండి సంబంధ భాంధవ్యములు ధారాళముగ గలవని స్పష్టపడినది.

చోళుఁలలో బత్తీశ్వరుఁడన్న మదేవుఁడే గాక ననేకులు శాసనములందును గ్రంధములందు సూర్యవంశజులమనియె వ్రాసికొనియున్నారు. వానిలోఁ గొన్నిటిని చదువరులకుఁ దెలియుటకై నీ క్రింద నుదాహరింతుము.

చోడవంశ సంభవుఁడు కవి శిఖామణియునగు నన్నెచోడుఁడు తాను సూర్య వంశమునఁజనియించితిననియుఁ గాశ్యపగోత్రుఁడననియు తన తల్లియగు శ్రీసతి హైహయ (కాలచుర్య) వంశమున జన్మించెనని కుమార సంభవమున జెప్పికొనెను.

**"సీ॥ కుతలంబు నడుకొనఁ గొలకొండగానిల్పి**
**శరనిధిగ్రొచ్చిరిసగర సతులు**
**మిన్నులపై బారుచున్నయేరిలఁదెచ్చి**
**వారాశినించె భగీరథుండు**
**గోత్రాచలము లెత్తికొని వచ్చికడచన్న**
**రత్నాకరము గట్టి రాఘవుండు**
**జలధిమహీసతి మొలనూలుగాఁజుట్టి**
**పాలించెఁగరి కాలచోడవిభుఁడు**

**వరుసనిట్లు సూర్యవంశాధిపతులంబు**
**నిధియె మేరగాఁగ నిఖిల జగము**
**నేలిచనిన వారికెనవచ్చుసుశ్లాఘు**
**ధనుఁడునన్నెచోడజనవిభుండు.**

**చ. అరినరపాలమౌళి దళితాంఘ్రియుగుండయి పాకనాటి యం**
**దిరువది యొక్క వేయిటి కధీశుఁడు నాజనుచోడబల్లికి**

న్నిరతర కీర్తిక గ్రమహిషీతిలకంబును హైహయాన్వయాం
బరశశిరేఖయైన గుణభాసిని శ్రీసతికిన్దనూజుఁడన్

క. పాత్రుఁడన సదృశ కాశ్యప, గోత్రుఁడ సచ్చరితనుభయకులశుద్ధుండన్
మిత్రాన్వయ శేఖరుఁడ ప, విత్రీకృత దేహుఁడను వివిధయజ్ఞములన్

కుమార సంభవము అవతరణిక.

కమ్మనాటిలోని కొణిదెనయందలి యోపిలిసిద్ధివదేవ మహారాజుల శాసనము.

శా. శ్రీమత్కౌస్తుభరత్నభూషణరుచి శ్రీరమ్యవక్షస్థలం
దామందారల తాంతదామనవదివ్యామోద పాదాబ్జజా
తామేయామరసింధు వారిశ్రిత పూతాసర్వలోకుండునౌ
నాముల్లోక విభుండు చక్రిగల దైక్యవ్యష్టిదానాథ్యుఁడై

ఉ. అతటి దాల్పునాభిలలితాబ్దమునందుదయించె బ్రహ్మసం
ప్రీతిగ నావిరించికిమరీచి జనించె మరీచి కన్వయ
ఖ్యాతుడు బుట్టెకస్యపుడు కస్యపసంయమికుద్భవించె లో
కాతతరమ్యమూర్తి కమలాప్తుడు సూర్యుడు వంశకర్తయై.

మ. ఘనుడాసూర్యున కన్వ యద్విజుడనంగా రాజధర్మంబతా
దనుపై కల్పిత రాజయోగముననుండం గాను వైవస్వతుం.
దనఘుండాతని కుద్భవించె మనువుద్యద్దండ శాస్త్రార్థత
త్వనిజాచార సమస్త ధర్మనయశాస్త్ర ప్రౌఢికాచార్యుడై

ఇట్టి మనువంశంబున నిక్ష్వాకుండు బుట్టె, నిక్ష్వాకు వంశంబునఁగాకుత్సుండు బుట్టె నాతనికి బృధివితన పేరస్ గొండిచన పృథుండుబుట్టె పృథువంశంబున మాంధాతబుట్టె మాంధాత వంశంబున బురుకుత్సుండుబుట్టె బురుకుత్సుని వంశంబున సాగరంబు దనపేరం జేసిన సగరుండు బుట్టె, సగరవంశంబున దిలీపుడు బుట్టె దిలీపవంశంబున నతీతానాగత వంశకర్తయైన రఘువు బుట్టె, రఘువంశంబున నారాయణావతారుండైన శ్రీరాముండు బుట్టె శ్రీ రామవంశంబున నలచక్రవర్తిబుట్టె, నలునికిఁబుండరీకుండు బుట్టె బుండరీకుని వంశంబున నాదిరాజుల...కడంక.....

బ్రధితుంన కరికాలచోడ చక్రవర్తి బుట్టె, భానువంశంబు కరికాలవంశంబునాన్ బేరుకొనిచతుస్సాగర పర్యంతనుహీ చక్రంబుగా.... వాలి.... వాత...... పాలించె

క. అట్టికరికాలనృపతికిఁబుట్టెను మహిమాను చోడుభువి నతనికిఁ దా
బుట్టిరికరి కాలుఁడు సిరి, గట్టనుగులు దొండమాఁనుఘనదశవర్మల్

క. అకరికాలనరేంద్ర ప్రాకటవంశమునఁబుట్టె భాస్కరకుల రత్నాకర
చంద్రుడు రిపుచయ, భీకరుఁడ ధికుండు చోడబిజ్జన బిరుదై

క. పల్లపుతో ఘనబిజ్జన, ప్రల్లదమున వచ్చుపాము బట్టినగనియా, తెల్లజుఁడి
చ్చె గుణాంకము గొల్లభిగొని జనులుగండ గోపాలుడనన్

క. దండిపదాంబుజగండర, గండరగండండు వీరఖని బిజ్జనయున్
దండిగఁబదిమువ్వరనొగి, గండండ్లను దానునిలి సెగటకములోనన్

చ. బిరుదునుగొన్న యా తెలుగు బిజ్జనమన్మడు మల్లి దేవుడ
చ్చెరువగుచున్న పొత్తపియచెన్నగు వీడును వ్రాలిపాక నా
డిరువది యొక్క వేయి జనమేలుచుఁ బల్లపుదండుఁగెల్చిత
త్కరినర కుంభమౌక్తి కవితాతతిఁబుచ్చెనిజాసి పుత్రికన్

చ. అతనికిఁబుట్టిరొప్పమధురాంతక పొత్తపిచోడ సిద్ధభూ
పతియును మల్లిదేవుడును బాహుపరాక్రమ విక్రమక్రముల్
నతనరనాథ బాలకదన స్థిరపాదసరోజ వైభవా
వితతసముద్రకాంచి పరివేష్టిత భూపరిరక్షణక్రముల్

క. ధరపొత్తపి సిద్ధనరే, శ్వరునికి నుదయించి భూమిసన నేలిరి స
చ్చరితులు పొత్తపిసోమే, శ్వరదేవుడు మల్లిదేవవసుధాధిపుడున్

ఉ. భూపదిలీపుఁడై పరగుపొత్తపిసిద్ధని తమ్ముమల్ల ధా
త్రీపతికిన్ సమస్త జగతీ పతికిన్ సుతులుద్భవించిరా
శాపరిపూర్ణకీర్తులు భుజాబలవంతులు నైనతొంటియ
య్యోపిలిసిద్ధియున్ గులసముద్ధరణుండగు మల్లిదేవుడున్

క. అపొత్తపిసోమేశ్వర, భూపతికిన్ దమ్ముమల్లభూపాలునకై
యోపిలిసిద్దికింˆదమ్ముడు, దీపితసితకీర్తి మల్లిదేవుడు బరగెన్ ఎ

క. పరగినమల్లి దేవ నరపాలుడు పొత్తపిచోదవంశ శే
ఖరుడిన వంశకర్త యనగాగడువాలివిరోధి రాజసం
హరుణుడె తొంటితాతలక్రియన్ దగపొత్త పిరాజధానిగా
ధరసకలంబునేలె విదితంబగు బాహుపరాక్రమంబునన్.

క. ఆమల్లి దేవునకు కులభామాతిలకంబు పుణ్యభామిని గౌరీ
శ్రీ మహదేవికి బుట్టెంˆద, పోమహిమఫలమ్ము దానపొడవైనగతిన్

క. ఇనుడుదయ మైనయట్టుల, మనవుదయంబైనయట్లు మతిరఘురాముల్
జనించినట్లు కులవ, ర్థనువోపిలిసిద్ధివిభుడు దానుదయించెన్

మ. కరికాలోత్తమ చోదవంశమున దాగౌరీ మహాదేవికిన్
సురభుల్ కల్పమహీజముల్ సురనదీ.... మణుల్
ధరణే కాకృతి బుట్టెనోయనగా..............

ఉ. ఓపిలి సిద్ధివల్ల పరమోన్నత టెంకణ చక్రవర్తి నా
జ్ఞాపరిక్షితాఖిలదిశావలయున్ ఘనదానకర్ణులీ
లాపరిపూర్ణరమ్య శుభలక్షణమూర్తి జయంతునశ్వశి
క్షాపురుహూతు బేరుకొనగా జనుచోడకులైక భూషణున్

మ. సకలాధీశనతోత్తమాంగపరి భూషారమ్యపాదాబ్జహా
టక నారాయణ భానువంశ నృపచూడారత్ను సిద్దెప్పబం
ధుకవీంద్రద్విజ రక్షుగాస్యపసగోత్రున్ బారక వ్రాతమి
త్రకుమాయోపిలసిద్ధి జెప్పదగును దృఢ్గండగోపాలునిన్

చ. తననిజవృత్తియంతవి తతంబుగయోపిలిసిద్ధపిన్నసి
ద్ధనకుననుంగుదమ్ముడు ప్రతాపమునన్ సనికమ్మనాదుసే
కొనిగణ పత్యధీశుదయగూడి తదాజ్ఞవహించి యేలెపా
వనమగునారు వేలుననవద్య పరాక్రమ విక్రమంబునన్

వ. ఇట్లేలిసప్త సంతానంబులు దేవబ్రాహ్మణవృత్తులు సమస్త ధర్మంబులు పరిపాలించి స్వచరణ సరోరుహవిహిత విలోచన ప్రముఖాఖిల పృధివీశ్వర కారితకావేరీ తీరకరికాల రత్నప్రదీ పాహిత కుమారగజాంకుశ యొరయూరి పురవరాధీశ్వర సూర్యవంశోద్భవ కాశ్యపసగోత్రజగనొబ్బగండ కీర్తి నారాయణ...... సమస్త ప్రశస్తసహితం..... శ్రీమన్మహా మండలేశ్వర యోపిలిసిద్ధనదేవిచోడమహారాజులు స్వస్తి శ్రీ శకవర్షంబులు ౧౧౪౬ అగుతారణ నామసంవత్సర కార్తీకశు ౧౧ శుక్రవారము కమ్మనాటిలో నిజ రాజధానియైన కొట్టియదొాన శ్రీ శంకరమహాదేవరకు గణపతిదేవ మహారాజులకు ధర్మముగా హవిర్బలి యర్చనలకు అంగరంగ భోగాదులకు వందులమోగడచెర్వు దేవభోగమాచంద్రార్కము స్వీకార పరిహారముగా నిచ్చితిమి మంగళము స్వదత్తాం

కొణిదెనయందున్న శ్రీశంకరస్వామియాలయము బహిర్ద్వారము యొక్క సోపానములక్షుఁదూర్పునశేషాహిని చెక్కఁబడిన రాయితూర్పుదక్షిణము రెండు ప్రక్కల వ్రాసియున్న శాసనము.

చ. **త్రిభువన గీతికీర్తి నరదేవశిఖామణి కామధారుణీ**
**ప్రభుతనయుండు మండలికభర్గుడు భర్గపదాబ్జషట్పదుం**
**డభినవరాముదర్యమ కులాగ్రణి గుండియ పూడిభక్తితోన్**
**ద్రిభువనమల్లదేవుడు ప్రథితీగ శంభునకిచ్చెభక్తితోన్**

స్వస్తి చరణ సరోరుహన విహీత విలోచన త్రిలోచ ప్రముఖాఖిల పృధ్వీశ్వర కారితకావేరీ తీరకరికాలకులరత్న ప్రదీపాహిత కుమారగజాంకుశ శ్రీమన్మహా మండలేశ్వర త్రిభువన మల్లదేవ చోడమహారాజులు. శక వర్షంబులు ౧౯౯౯ అగునేటి విషువు సంక్రాంతి నిమిత్తమున కమ్మనాటిలోని గుండియపూడి, నిజ రాజధానియైన కొట్టియదొాన శ్రీ బల్లేశ్వర మహాదేవరకు ఆచంద్రార్కముగా దేవ భోగమునకు నిచ్చితిమి.

ఉ. **అంబుజనాభునానభి నుదయంబయి వేధ మరీచిఁగాంచెలో**
**కంబులకెల్ల పూజ్యుఁడగు కశ్యపుఁడాతనికిన్ జనించెవి**
**శ్వంబు వెలుంగజేయ గదివాకరుఁడమ్ము నికుద్భవించెవా**
**నింబొగడం జతుశ్రుతులు నేరకయున్న వినాకు శక్యమే.**

క. అతనికి సకలలోక, ఖ్యాతుఁడు మనువుద్భవించి యనవద్యమతిన్
చాతుర్వర్ణస్థితిర, క్షాత్రత్వరవృత్తి ఁబరగె సర్వోత్తరుఁడై.

శా. లోకాలోకతటీ విహార కలనాలోలద్యశస్సింహుఁడై
స్తోకాపాదిత పుణ్యమూర్తి మనుపుత్రుండాక్రమ క్రీడయై
నేకచ్ఛత్రముగాఁగ భూమివలయంబెల్లన్ బ్రశాసించెని
క్ష్వాకుండ ప్రతిమాన దానమహిమా కల్పోజ్వలాకారుఁడై

క. ఆయిక్ష్వాకులకులంబున, సాయంతన సప్తజిహ్వా సాదృశ్య శ్రీ
స్ఫాయత్ప్రతాపనిధి నారాయణ నిభపుణ్యమూర్తి రఘువుదయించెన్

మ. మునిలోకంబు ప్రశంససేయ జగములో మోదంబు వొందంగదు
ర్జనతా నిగ్రహతత్పరాత్ముఁడగుచున్ సద్వృత్తి సంరక్షణం
బునరాగిల్లుచునేలె రామనృపుఁడీ భూచక్రమున్ దత్కులం
బునరాజన్యు లనేకులిద్ధరణిఁబెంపున్ బొందిపాలించినన్.

క. పిదపఁగరి కాలచోళుండుదయంబయి జలధిపరిమి తోర్వీవలయం
బుఁదనకుఁబంట పొలమ్మగ నెదురెందునులేక పేర్మియెసకంబెసగన్

ఇటులనే రెట్టమతము కామాందకము మొదలగుననేక ప్రబంధములయందును శాసనములందును చోళులు సూర్యవంశ క్షత్రియులని చెప్పంబడినది. గ్రంథ విస్తర భీతినవి యెల్లనిట నుదాహరింపమానితిమి.

ఈ నిదర్శనముల వలన జోళరాజులు యజ్ఞయాగాదు లాచరించిన సూర్యవంశ క్షత్రియ శిఖామణులనియు గాలచుర్యులనఁబడు హైహయులతో సంబంధ బాంధవ్యములు గలవారని స్పష్టమైనది. ఇట్టి చోళవంశ సంభవుండగు చోళబత్తితో రెడ్డివారు సంబంధమునెరిపిరి కాన చోళులకు బాంధవులగు హైహయులకు సయితము రెడ్డివార్లు సంబంధులని విశ్వసింపవచ్చును.

ఎటులఁజూచిన రెడ్డివారలన్ని తెగల క్షత్రియోత్తముల తోడను సంబంధములు చేసినట్లు తెలియును.

శ్లో ॥ పౌత్రీంకాటయ వేమయక్షితిపతేః పుత్రీంచకాటప్రభో ।
దౌహిత్రంచతురర్ణ వీం హరి హరక్షోణీపతేశ్శాశితుః ।
తన్నామ్నావిది తాహ్వయాం హరిహరాంబా చారుమగ్రాహయ
త్వైణౌవేమమహీశ మల్లనృపతిస్సామ్రాజ్యలక్ష్మ్యాసమమ్ ॥

కోరుమల్లి తామ్రశాసనము.

ప్రాచ్యలిఖిత పుస్తకాలయమునందలి వ్రాతప్రతుల నుండి యీ శాసనభాగము వ్రాసితిమి. ఈ శ్లోకము "పుత్రీంకాటయ వేమయక్షితిపతేః పుత్రీంచకాటప్రభో" అనియుండదగునని వేటూరి ప్రభాకర శాస్త్రిగారు దలంచుచున్నారు. పై పాఠ ప్రకారము చూచిన విద్యానగరమును హంపి విజయనగరమున్పాలించిన హరిహరాంబ దౌహిత్రి (మనుమరాలు) అల్లాడరెడ్డి పెద్ద కుమారుఁడగు వేమారెడ్డికి భార్య యనియుఁదేలును. మార్పుచొప్పునం జూచిన హరిహర రాయుని యల్లుఁడు కాటయ వేముఁడని యుఁ దేలును. ఈ చర్చ కెడమిచ్చిన గ్రంథము పెరుగును. ఏ విధముగఁజూచిన హరహరాంబ హరిహర రాయులరక్త సంబంధురాలు పుత్రిగానిండు, దౌహిత్రిగానిండు రెడ్డివీరునికి భార్యయైన మాట నిజము.

ఈ హరిహర రాయలు చంద్రవంశ క్షత్రియుఁడనుటకు నాధారములునెన్నియో గలవు. ఒకటి రెండు మాత్రమిట నుదాహరించెదము.

శ్లో॥ రమానుజఃకళానాథః క్షీరసాగరసంభవః ఉదయాదవ్వయేతస్య
యదుర్నామమహీపతిః.... అసత్ హరిహరోనామబుక్కరా
యమహీపతిః ॥

బుక్కరాయతామ్ర శాసనము. ఎఫిగ్రాఫికకర్ణాటికా. జీ.డి.

శ్లో॥ కురువంశ ప్రసూతాయ ఇందుక్షేత్రభవాయచ
సత్యసంధాయశాంతాయరాజ్ఞే హరిహరాయచ ॥

విద్యారణ్యు లశాసనము

ఈ ప్రమాణములచే చంద్రవంశ క్షత్రియులగు విద్యానగరరాజులతో రెడ్డివీరులు సంబంధ బాంధవ్యములను సలిపిరనుట నిర్వివాదాంశము. ఇంతయేల? పల్లవులకు

జాళుక్యులకు గళింగులకు రెడ్లకు జోళులకు నాగులకు సంబంధ బాంధవ్యములున్నటుల చరిత్రము నుండి రుజువు చేయగలుగుదుమేని రెడ్డి వారలీయన్ని శాఖలతోఁ గలసిన వారనియునొక శాఖతో నొకశాఖకలసియే యున్నదనియు సువ్యక్తమగును.

సత్యాశ్రయుని కుమారుడు, విజయాదిత్యుడు చాళిక్యుఁడితడు సూర్యవంశచోడ రాజులపుత్రి విజయ దేవిని బెండ్లాడెను. కులోత్తుంగ చోడుని సామంతుఁడును అత్రేయసగోత్రుఁడును నాగవంశీయుఁడును పెద్దిరాజుకుమారుఁడునగు సిద్దిరాజుసోదరి పచ్చలాదేవినిఁ జోళవంశీయుఁడగు మనుమసిద్ధి పెండ్లాడెను! నాగవంశీయుఁడైన సిద్దిరాజు ఒరయూరి చోళుఁడగు శూరాళ్వారు కత్తి దేవరాజు పుత్రియగు ఇమ్మడిశ్రీయాలదేవినిఁ బెండ్లాడినటుల గూడూరి సీమలోని రెడ్డి పాలెము పాండు రంగాలయము నందలి శాసనములోఁ గలదు. ఇందువలన నాగరాజులకుఁజోళులకు సంబంధ బాంధవ్యములు గలవనుట నిక్కము. కళింగరాజగు రాజరాజు చోడగంగుకు లోత్తుంగచోడుని పుత్రియగు రాజసుందరినిం బెండ్లాడ ననంతవర్మ జనించెను దీనిచేఁ గళింగులకుఁజోళులకు సంబంధమున్నటుల స్థిరపడును. బేటవిజయాదిత్యుడను చాళుక్యరాజపుత్రుఁడగు సత్యాశ్రయుఁడు గాంగ వంశజురాలగు గౌరీదేవినిం బరిణయ మయ్యెను. వల్లికిల్లివానుఁడను చోళరాజు నాగజాతికన్యను బెండ్లాడినటుల మణిమేఖలయను ద్రవిడ కావ్యమున గలదు. చాళక్యుఁడగు జయసింహుఁడు కాంచీపురిపాలించు పల్లవుఁడఁగు రాజుపుత్రిని బెండ్లాడ విజయాదిత్యుడు జనించెను. దీని వలన చంద్రవంశజ చాళుక్యులకు ఁబల్లవులకు సంబంధ బాంధవ్యముండెననుట స్పష్టము. నాల్గవ విష్ణువర్ధనుని కుమారుఁడగు రెండవ విజయాదిత్యుడు కాలచుర్యవంశజుడగు త్రిపురాధీశ్వరుని పుత్రినిం బెండ్లాడెను. దీని వలనఁ జాళుక్యులకుఁ గాలచుర్యులనంబడు హైహయులకు సంబంధ బాంధవ్యములన్నది నిక్కము. కాకతి పతాపరుద్రుఁడు సూర్యవంశజులమని శాసములందుఁజెప్పుకొనిన కందూరుచోళుల యాడుపడుచగు పద్మావతినిఁ బెండ్లాడెను. ఇందువలన కాకతీయులకుఁ జోళులకు సంబంధమున్నదను మాట సత్యము. కాకతీయులకు జోళులకు మూల పురుషులు కరికాల దుర్జయులగుట చేత గాకతీయులు సయితముచోళులని వచించుట కవకాశము చిక్కుచున్నది.

కాకతీయుల పూర్వులు కరికాలుఁడు. దుర్జయుఁడనుటకును, కాకతీయులు సూర్యవంశ క్షత్రియులనుటకు నాధారములు నీ క్రింద వ్రాయుచున్నాము.

కొలనికాటమ నాయుఁడు రాజమహేంద్రవరము జిల్లా యిలాకా పాండవ అగ్రహారములోని శాసనము, లోకల్ రికార్డ్ 38 చేబ్రోలు రెండవశాసనము.

శ్లో॥ హంసాః పద్మాసనారూఢ యదంత్సముపాస్యతేఁ పరాంమృతరస
స్యంది స్రోతస్సారస్వతంస్తుమః। ప్రాచీవధూ ముఖవిశేషక పద్మరాగః
ప్రఖ్యాయతేచ భగవానరవింద బంధుః యత్రశ్రుతి ప్రణయదామని
సన్నికిధత్తేదోవోహిరణ్మ యవపుఃపురుషః పురాణః మనురంశుమతో
స్యమాను రాసీతదేహభ్యుదితాః స్వభావ, శుద్ధాః నిగమోదిత సర్వధర్మ
చర్యాస్తు హినాద్రేరివ రాజహంస వంశాః తస్మాదిక్ష్వాకు రాజాస
త్తదుపరి పగరస్తత్పర స్ధాత్మకు స్థస్తస్మా దూర్ధ్వందిలీపస్తదను
దశరథ స్తత్సు తోరామచంద్రః దోర్వీర శ్రీ విలాసాబిస సమతులితో
దగ్రకైలాసజాగ్రద్దోఃక్రీడోత్తుంగలంఘూసుబటవిఘట నాస్తేదిగం
తేప్రథంతే ఏషాంవంశేరఘూణాంక్షితిరభ వద్దుర్జ యశ్శౌర్యకేళి
స్ఫూర్జద్ధూయాతతో భూత్ర్పతి కరటిఘటాశాత నోబేతరాజః చక్రేవి
క్రాంత బాహుస్తదను వసుమతీప్రోలభూపవిస్తత్పుత్రోరుద్రదేవ.

## గణపతి దేవుని శాసనము

(ఇది గుంటూరు జిల్లా మోటుపల్లెలోనున్నది)

ఇక్ష్వాకుర్నామతస్మిన్న భవదభజనే భూభుజాంచక్రవర్తి స్సాక్షాత్రీవత్స వక్షాస్యయముదిత ఇవత్రాతు కామో ధరిత్రీం। అధరనిరవశదుర్వీంతత్కులోదన్వ దిందుః కిలజలనిధి వేలామేఖలాం ప్రోలరాజః ॥

## శివదేవి మహాముని శాసనము

ఆస్తి స్వస్తి మతీ తనుర్భగవతో దేవస్యతస్యస్ఫుర
న్నాభీపంకజ సంభవస్య భుజతోయేక్షత్రి యాజిజ్ఞరే।
తేషాంతిగ్మమరీచి సంతతిభుజోయేదుర్జయః క్షత్రియా
స్తేషామస్తికులంక లంకరహితం శ్రీ కాకతీభూభుజాం॥

## గుంటూరు జిల్లా మంగళగిరి తాలూక మల్కాపురము శాసనము

కాకతీయ రుద్రమ దేవి వీరభద్రరాజను చాళుక్యునింబెండ్లాడినటుల జుత్తిగ శిలాశాసనములో గలదని మామిత్రులగు మల్లంపల్లి సోమశేఖర శర్మగారు వచించు చున్నారు. ఈ రుద్రమదేవి పుత్రియగు ముమ్మడమ్మను చాళుక్యభీమరాజు బెండ్లాడెను. ఇందు వలనఁ గాకతీయులకుఁ చాళుక్యులతో సంబంధ బాంధవ్యమున్నటుల సువ్యక్తమగుచున్నది. కాకతీయులనినామాంతరముగల చోళులలో నొక శాఖవారు గలరని యింతకుఁబూర్వమే వ్రాసియున్నాము. అట్టి కాకతీయ వంశసంజాతుఁడగు మల్యాలగుండ దండాధీశ్వరుఁడు గోనబుద్ధారెడ్డి కూతరగు కుప్పాంబికను బెండ్లాడెనని బూదపూరు శాసనమునందు నితర శాసనములందుండుటచేఁ గాకతీయులకు రెడ్డి వారితో సంబంధ బాంధవ్యములున్నట్టు నిశ్చయము.

పూర్వోక్తములగు క్షత్రియ కుటుంబము లన్నియు రెడ్డివారితో సంబంధ బాంధవ్యములు గావించిన విధములు ప్రత్యేక ప్రకరణమున నిరూపించ దలంచుటచే నా ప్రశంసను వదిలితిమి.

రెడ్డి శబ్దము రాష్ట్రకూట శబ్దభవమని తెలిపియుంటిమి. సంస్కృత పదమగు రాట్ శబ్దము తొలుత రడ్డియై యావల రెడ్డియైనటులఁ గూడా పరిశోధకులూహించు చున్నారు. రాష్ట్రకూటులు పరిపాలకులై యుండు జనులు వారలను రడ్డులని వ్యహ రించిరి. రడ్డుల ధర్మము పరిపాలనము గావున నది రడ్డికమని పేరు బడెను. త్రిభువన మల్లచక్రవర్తి శ్రీ మత్పెరమడి దేవర శాసనమున "బెజవాడ రడ్డిరికంబుదయచేసెనని గలదు" శకవర్షంబులు ౧౦౭౫ నాటి విష్ణువర్ధన మహారాజులగు ఉపేంద్ర దేవ చక్రవర్తి శాసనములో సంద్రు వాడ అలవరమను గ్రామముల రడ్డిరికము అష్టభోగ సర్వసంపదలతో గూడ రేపటిని వేద్యమునకు నిచ్చిరి అని గలదు. దావులూరి గోకర్ణేశ్వరాలయము నందలి శాసనములలో రెడ్డిపద మీ క్రింది విధముగ బరిపాలకుఁ డని వాడఁబడినది.

"స్వస్తి శకవర్షంబులు ౧౦౦౫ అగునేటి విషువ సంక్రాంతినిమిత్తమున శ్రీ మన్మహా మండలేశ్వర వెలనాటి రాజేంద్ర చోడరాజునకు యీయని కంద్రిక వాటిలోని కురంగటికి వెలనాటిలోని దామలూరికి రెడ్డియైనయై తమ నాయకుని కులాంగన.

పైనుదాహరించిన శాసనములలోని రడ్డికము దాని రూపాంతరములగు రఢ్రికము రెడ్డికములు రెడ్డి వారి జాతీయ ధర్మమగు పరిపాలన మనునర్ధమున నుపయోగింపబడినవి. అనగా రెడ్డియను పదము పరిపాలకుఁడను అర్ధము నందుపయోగింపఁబడినది. ఇట్టిపద ప్రయోగములు గల శాసనములు పెక్కులు గలవు. గాని దిఙ్మాత్రముగా నుదాహరించినారము.

రెడ్డి వీరులు తమ రాష్ట్రకూట సామ్రాజ్య విజృంభణము తగ్గిన పిదప సామంతులుగా సేనానాయకులుగా నుండినను పరిపాలన చిహ్నమగు రెడ్డిపదముతోఁ దమ జాతీయతఁ దెలుపుకొనుచుఁ బెక్కు దేవస్థానములకు దాన ధర్మములు గావించియున్నారు. పదునొకండువ శతాబ్దమునందు సామంతులుగా సేవా నాయకులుగా నున్న రెడ్డివీరులు ధర్మములు విశేషముగాఁ గావించి శాసనములు స్ధాపించిరి. గాని ధర్మఫలము తమ పరిపాలకునకుఁ జెందునటులఁ జెప్పుకొనవలసిన వారగుటచేఁ దమ జాతులను విశేషించి చెప్పుకొనకబోయిరి. శాలివాహన శకము ౧౧౧౦ లోఁపెనుంగోటచందరడ్డి కామనరడ్డి యనువారలు ౧౩౪ శకములో కాకతీయ రాజ్యసమర్ధుడైన రేచర్ల రుద్రరెడ్డిలోనగు రెడ్డివీరుల శాసనము లాంధ్ర దేశము నందుఁగానఁబడుచున్నవి. కాని వారల స్వతంత్రజీవనులై యుండుటచేఁ గాబోలు తమ కులములు వృత్తాంతములు విరళముగాఁ జెప్పుకొనజాలరైరి. తమ రాష్ట్రకూట సామ్రాజ్యమున్నత దశలో నున్నంత కాలము సూర్యవంశజులమని చంద్రవంశుజులమని జెప్పుకొనిరి. సమస్త క్షత్రియ శాఖల తోడ సంబంధ బాంధవ్యముల నెరిపిరి. ఇట్టి రెడ్డివీరులు చాళుక్యులయి చోళులయి కాకతీయులని నామాంతరముగల యొక చోళశాఖ వారి యొక్కయు రాజ్యకాలములందు సేనానాయకత్వము సీమాధిపత్యము వహింపవలసి వచ్చెను. అప్పుడు తమ పూర్వ ప్రశస్తి జెప్పుకొననొల్లక కాబోలు కేవలము మాతా పితృ నామాలను మాత్రము నుదాహరించుకొనుచు శాసనములఁ జెక్కించు కొనిరి. కాకతీయ

రాజ్యపదానానంతరము స్వతంత్ర రాజ్యములు స్థాపించిరి. అది మొదలు తమ పూర్వ ప్రతిభాధిక్యము రెడ్డివీరులు జెప్పుకొనవలసిన యవకాశము తటస్థించెను. విద్వాంసులది యవకాశముఁజేసికొని మాటుపడి యున్న వీరలక్షాత్ర చారిత్రము గమనింపక శాసనాదులయందుఁజతుర్థవంశజులని వ్రాయసాగిరి. కలిలో క్షత్రియులు లేరను కల్పిత ధర్మశాస్త్ర సూక్తులిందుకుఁదోడుగా నిప్పటి వారు చూపుచున్నారు. నూతనముగాఁ బూర్వవికాసము గడించు రెడ్డిజాతికిఁబూర్వము తమ క్షాత్రచరిత్రము గమనింప లేక బ్రాహ్మణ విద్యాంసులు వ్రాసిన వ్రాతలు నిపుడు రెడ్డి జాతి క్షత్రియజాతి యని నిరూపించుటకు మిగుల శ్రమయైనది. క్రమక్రమముగా రెడ్డివీరులు రాజ్యముఁబాలించు తఱి పూర్వచరిత్ర విఖ్యాతులను దెలసికొని యప్పటికిఁ బ్రసిద్ధములుగా నున్న చంద్ర సూర్యవంశజులతో సంబంధ బాంధవ్యములొనర్చి తమ పూర్వక్షాత్రచరిత్రము విద్వాంసులకెఱింగించి ప్రత్యేక శాసనములలో గ్రంధములలో దాము సూర్యచంద్రవంశ క్షత్రియులమనియు యజ్ఞయాగాది వైదిక కర్మల నొనర్చితిమని వ్రాయించుకొని తమ పూర్వ క్షాత్ర ధర్మమును నిలువంబెట్టుకొనిరి. రెడ్డివీరులు సూర్యచంద్రవంశములలోని వారనుటకు శాసనాద్యా ధారములు చూపి ఁవీరు సమస్త క్షత్రియ శాఖల నుండి వీడిపోయిన విధము స్వయం వ్యక్తిత్వ సూచకమగు రెడ్డి బిరుదు మూనిన విధము ముందు ప్రకరణమున నిరూపించెదము.



శ్రీరస్తు

# రెడ్డికుల నిర్ణయ చంద్రిక

## నాల్గవ ప్రకరణము

రెడ్డివారు సూర్యచంద్ర వంశ క్షత్రియ కుటుంబములతో బాంధవ్యములు చేసిన విధము తెలసికొంటిమి. అనగా రాష్ట్ర కూటులను రెడ్డివీరులు చంద్ర వంశజులగు విజయనగర రాజులతోడను చాళుక్యుల తోడను సూర్యవంశజులగు చోళుల తోడను పల్లవగాంగుల తోడను కాకతీయులను నామాంతారము గల చోళులలోనొక శాఖ వారితోడను సంబంధ బాంధవ్యము లొనర్చినది స్థిరపడినది.

రెడ్డి వారు స్వయముగాఁదాము సూర్య వంశజులమని చెప్పికొనినవి చెప్పించుకొనినవియగు శాసనములను గ్రంధముల నుదాహరించి రెడ్డి వారలు క్షత్రియులను నంశ ము ప్రమాణములతో నీ ప్రకరణమున సమర్థించుదుము.

గోనబుద్ధారెడ్డి సూర్యవంశజుడనియు నీతని పుత్రికయగు కుప్పాంబిక కాకతీయ వంశము నందలి మహాదేవరాయని సంతతిలోని వాఁడగు మల్యాలగుండ దండాధీశ్వరుని భార్యయని నైజాము యీలాకలోని మహబూబు నగరము జిల్లా బూతుపూరిలోని శిలాశాసనము వలనఁ దేలియు చున్నది. ఆ భాగములుదాహరించెదము.

"స్వస్తి సమధిగత పంచమహాశబ్దమహా మండలేశ్వర శ్రీఅనుమకొండపురవరాధీశ్వర కాకతీయ రుద్రదేవమహారాజులు ఓరుగంటను పృధివీ రాజ్యంబు సేయుచుండంగా తత్ప్రసాదాసాధిత రాజ్యలక్ష్మి విలాసుండైన మల్యాల గుండదండాధీశ్వరుని ధర్మపత్ని తన పతి పరలోకానకు జనరని బూదపూరను గుడికట్టించి శకవర్షంబులు ౧౧౯౮ వర్తింపంగాను ధాతృసంవత్సర మాఘ శు। ౧౦ గురువారములో గుండయ పేరను ప్రతిష్ఠచేసి ఆ కాలమునందు ఆకుప్ప సానమ్మగారు తమ కొడుకులు బాపయబొప్పండు గణపతి దేవుండు పర్వతము మల్లయ్య తమ్ముడు మల్లయ బుద్ధయ కాటయ విర్ధయ పిడుగు గుండయ వీరు సహితమూగుండేశ్వర దేవరకు ధారా పూర్వకమైన వృత్తినీరు

నేల బాచసముద్రాన మఱుతులు కుప్పసముద్రాన మఱుతులు ౧ గణపతి సముద్రానర్మ బూదల పాడనుమ ౧ వెరసి మూడేరి పొలము బూదపూరను మ ౧౨ పోతులమదుగున మ ౪ వెరసి మ ౨౧ ఇంతవట్టు ఆచంద్రార్క స్థాయిగానిచ్చి బిలజేయుల కొడుకు సిద్ధజేయులను బాచజేయల కొడుకు వైనజేయులను, ఈ స్థానమునకు ఒడయులై బిడ్డ బిడ్డతరము ప్రసాదోప జీవులై యందురని పంచినధర్మ సంరక్షణార్థం బై పదక్రమయుత యజుర్వేద పారగ శబ్దవిద్యావిశారద కవీశ్వరులైన ఈశ్వర భట్టోపాధ్యాయులను శాసనము సెప్పం బంచినదత్ర్పారంభం బెట్టిదనిన.

శ్రీవరాహరహస్సత్వం శ్రీవరాహ జగత్ప్రభో
రక్షతాదుద ధేరంత రక్షతాక్షి ప్తమంబుతత్
శ్రీమన్ మల్యాలవంశేశశి కరనికరాందోళనోన్మీలన శ్రీ
మిశ్రీభూతప్రభూత ప్రకట పటునటత్కీర్తి వల్లీవితానః
ఆసీదాశీరలూనావళి మిళితల సత్సంపదున్మేషభూషా
వేషాశేషాభిరామఃక్షితితల తిలకోగుండ దండాధినాథః.
శ్రీసూర్యవంశనిజశేఖర బుద్ధయాఖ్య
పుత్రీపవిత్ర చరితాభరితాగుణౌఘైః
శృంగారసారకరణిఃకరణీయదక్షాకుప్పాంబికా జనిచతస్యసతీకళత్రం।
లక్ష్మీనారాయణాఖ్యం జలశయన మధుశ్శూన్యశయ్యాభిధానం
సానంతారుంధతియ వ్రతమ సితచర ద్వాదశీ సువ్రతంచ
కల్పోక్తం తచ్చతచ్చప్రథిత కులవరస్తోమసీమంత భూషా
కూపాఆపాది వాపిసహితవనతడాగ శ్రీముకుంద ప్రతిష్ఠా
భూదానం భూరిదానం రథతురగ సదా దానమన్న ప్రదానం
గోదానంగేహదానం వివిధవరపథీ దానమంబు ప్రదానం
తద్వద్వృత్త ప్రదానందిశివిదిత మహాదాన మన్యచ్చసర్వం
కుప్పాంబాకల్పవల్లీముహురకృతసదాం వర్యశయ్య ప్రదానం

శాకబ్దేవసునంద శంకరమితే శ్రీధాతృసంవత్సరే
మాఘేమాసిసితే ధర్మదివసేవారే వాచాంపతేః
కుప్పాంబాపతి సంజ్ఞయాకృతముదాలింగాం ప్రతిష్ఠామహత్
క్షేత్రంతుల్య మతుల్య రత్నపిహితాలంకారమస్మైదదౌ॥
"శ్రీమత్కంద శరాసనాధి కరణే కర్ణాటమాన్యోజనః
వీరంమన్యసమాజ సేవణపతేస్సం గ్రామరంగ స్వహాం
ధాటీలాటవృపాట వీమను దినం గంతుంమతింమాభవే
ద్యుద్యద్గుండయదండ నాథవిలసద్దోర్విప్ర మైర్నిప్రక్రమ ॥
శ్రీసూర్యకులదుగ్ధాబ్ధిజాతాసహజ చంద్రికా
శ్రీరేవశ్రీపతేర్యస్యప్రేయసీ కుప్పమాంబకా
శాకాబ్దేశశిదంతి శంకరమితే సిద్ధాద్రి సంవత్సరే
చైత్రేమాసిసిత త్రయోదశతి ధౌవారే గురోశ్శోభనే
నిర్మాయోత్తమ బూదపూరినకటే సోయంతటాకంవరం
బాచాంబాభిధయాంకితం తమకృత శ్రీగుండ దండాధిపః ॥

బూదపూరుమసీదులో నుంచిన శాసనము

సూర్యవంశజుఁడు బుద్ధరాజనుచు మొదటిశాసనమునందుఁబేర్కొనఁబడిన యాతఁడే రంగనాథ రామాయణము రచించినటుల వ్యవహరింపబడు గోనబుద్ధారెడ్డి. ఇతనిజనకుడఁగు గోనగన్నారెడ్డి శా.శ ౧౧౮౯ అగు సంవత్సర మార్గశిర శుద్ధ ౭ నాఁడు రాయచూరి పట్టణంబున శిలాదుర్గము నిర్మించి శాసనము వ్రాయించినాఁడు. అందుగోనగన్నారెడ్డి మనుకుల కమలమార్తాండునిగా జెప్పంబడుటచేనది బూదపూరిశాసనమునకు బలమునిచ్చుచున్నది. వీనినన్నిటిని సమన్వయించి విచారించి చూచినఁచో రెడ్డివీరుఁడగు బుద్ధారెడ్డి సూర్యవంశజుఁడనియు c గుప్పాంబిక సూర్యవంశసంజాతుఁడగు మల్యాల గుండరాజును బెండ్లాడెననియుఁదెలియును. కుప్పాంబ తనపుట్టినింటివారిది సూర్యవంశమని పై జెప్పుటచే గోనబుద్ధారెడ్డి సూర్యవంశజుఁడని చెప్పుకొనినటులె.

ప్రోలరెడ్డియను నొక రెడ్డివీరుఁడు హంపినృసింహ స్వామిచెంతనొక శాసనమును వేయించుచు నందుఁదాను శ్రీ రామునకుఁజెందిన సూర్యవంశములో జనించినవాఁ

దనని యీ క్రింది విధముగాఁజెప్పుకొని యున్నాడు ఇందు రెడ్డివీరులే రాష్ట్రకూటులను నంశముగూడ నిర్ణయింపఁబడుటచే నీయంశమున కిదిప్రమాణము కూడఁగాగలదు.

శ్లో॥ నమస్తుంగ శిరశ్చుంబి చంద్రచామర చారవే
త్రైలోక్య నగరారంభ మూలస్తంభాయశంభవే ॥

స్వస్తి సమధిగత పంచమహాశబ్ద మహామండలేశ్వర అనుమకొండ పురవరాధీశ్వర మూరురాయ జగదాళ విదిత విక్రమశీల పరమ మహేశ్వర స్థిరలక్ష్మీ నిజైశ్వర్యవిరాజిత కదనప్రచండ శ్రీస్వయంభూ దేవదివ్యపాద పద్మారాధక పరబలసూదక నామాదిసమస్తసహితం శ్రీమన్మహామండలేశ్వరకాకతీయ ప్రతాపరుద్ర దేవమహారాజులు ఓరుగంటను పృథివీరాజ్యము చేయుచుండగా తత్ప్రపాదసాధిత రాజ్యలక్ష్మీ విలాసుండునురిపుకులభయంకరుండు కల్వకొలని పురవరాధీశ్వరుండును నగుశ్రీజగదాళ ఇమ్మదేవరంగారి సుపుత్రులగు ప్రోలరడ్డిదండ నాయకుండు స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశ కవర్షంబులు ౧౨౪౮ అగు అక్షయసంవత్సర చైత్ర శుద్ధ పూర్ణిమ గురువారమునాడు తమరాజ్యైశ్వర్యాయురారోగ్యవృద్ధి ప్రవర్ధమానమగునట్లు శ్రీశ్రీశ్రీ పంపానృశింహ దేవరకు రజతకవచమర్పించి వేయించిన శాసన ప్రారంభం బెట్టిదనిన.

శ్రీరమణీమణీ విమలచిత్తసరోజమరంద భృంగునా
భీరమణీయ పద్మమున వేధజనించిమరీచిఁగాంచెనా
ధీరునకున్ జనించె ఘనదివ్యచరిత్రుడు కశ్యపుండుస
త్పారరుచి ప్రజాంచితని దానదినేశుడు గల్గెవానికిన్.
ఆరాజీవసఖుండుగాంచె గుణరత్నాం భోధి వైవస్వతుస్
ధీరోదాత్తుడులోక మాన్యుడు మహాధీమంతుడిక్ష్వాకుడా
రారాజత్కులమందు బుట్టెఘనపారావారమధ్యంబునన్
నీరేజాహితుడు ద్భవించినటులన్ నిర్మాల్యచేతస్కుడై.
అలయిక్ష్వాకుకులంబునం దుగుణరత్నాంభోధినానావనీ
తలరాజన్యకిరీట సంఘటితరత్న వ్రాతదివ్యప్రభా
కలితాంఘ్రిద్వయుడైన శ్రీరఘుమహీకాంతుండు జన్మించెనా

యలఘుస్వాంతరఘుండు గాంచెనజ భూపాధ్యక్షునింబొందుగన్.
ఆయజరాజపుంగవున కభ్యుదయించియుగాంచెరామునిన్
భూయపరాక్రమారి జనపుంగవ శోణితసిక్తఖడ్గునిన్
న్యాయమయైకభూషణుని నవ్యనిజాశ్రితలోకరక్షణున్
శ్రేయగుణాలవాలు నృపశేఖరు పంక్తిరథావనీశుడున్.
ఆరఘురామచంద్రునకు నభ్యుదయించికుశుండుగాంచెదు
ర్వారపరాక్రమోల్లసితవై రివిపాటనదక్షునిన్ మహా
ధీరకులావతంను నథిక్షితిపాలక శేఖరున్ దగన్
భూరితర ప్రతాపుడు నభుండుజనించె దదీశమౌళికిన్.
ఆనభరాజపుంగవున కభ్యుదయించెను పుండరీకుదా
మానవనాథమౌళి నృపమండలమాన్యుని క్షేమధన్వభూ
జానినిగాంచె నానృపుప్రశస్త కులంబున బెక్కు రాజులున్
మానుగ సంభవించియు క్షమాస్థలినేలిన పిమ్మటన్ దగన్.
ఆక్షేమధన్వనృపాగ్రణికులమున జనియించెను సుమిత్రజన విభుండు
నతనికి జనియించె వితతసద్గుణసాంద్రుడగు విశ్వవరనృపుండతనిక
మీతవిక్రమ పరిపంథి విసరనిర్దళినప్రచండుడౌ రాష్ట్రకూటుండుబొడమె.
నా రాష్ట్ర కూడసదన్వయంబున బుట్టె నిమ్మడిదేవరడ్డీంద్రమౌళి
యతనికభ్యుదయించే బుధాళిపొగడ, వైరిరాజన్యదంతికంఠీరవుండు
సర్వశుభలక్షణుండు ప్రశస్తయశుడు, రమ్యగుణధాముడును ప్రోలరడ్డి ఘనుడు.
పంపాక్షేత్రనృసింహదేవరకు భాస్వద్రూప్యవర్మంబిలన్
సంప్రీతిన్ ఘటియించె దంతిశ్రుతిపక్షక్షోణివర్షంబులన్
సాంపారన్ నడువంగ నక్షయమునంద స్తోకచైత్రంబునన్
సంపూర్ణంబగు పూర్ణిమా తిథిని... పూజ్యంబుగన్.
శాసనపుమాత్రక హంపిలోని నృసింహస్వామి ఆలయము వెనుక ప్రక్క బడియున్న
రాతిలోనున్నది.

ఈ శాసనము వలన రాష్ట్రకూటులది సూర్యవంశమనియు నందు ఇమ్మడిరడ్డి బ్రోలరెడ్డి జనించిరని తెలియును. రెడ్లు తాము రాష్ట్రకూటులమని సూర్యవంశజులమనియు జెప్పుకొనిన శాసనములలో నిదిమిగుల ముఖ్యమైనది.

బ్రోలరడ్డిశాసనము నైజాంయిలాక నాగరకందనూలు తాలూకాలోఁజేరిన కల్వకొలనిలో కేశవస్వామి దేవాలయమున నింకొకటికలదు. దీనినీ క్రింద నుదాహరించుచున్నాము.

**"స్వస్తి శ్రీ జయాభ్యుదయ శాలివాహనశక వర్షాలు ౧౨౪౩ అగుదుర్మతి సంవత్సర భాద్రపద శుద్ధ ౧౧ గురువారాన శ్రీ మన్మహామండలేశ్వర కాకతీయ ప్రతాపరుద్రదేవ మహారాజులు పృథ్విరాజ్యంబుచేయుచనుండంగాను స్వస్తిశ్రీమన్మహా సామంతచేపిరకు జగదాళ ఇమ్మడిదేవరంగారి సుపుత్రులు బ్రోలయరడ్డి వారు తమకు ఆయురారోగ్య స్థైర్యాభివృద్ధిగాను కలువకొలని శ్రీప్రసన్న వల్లభదేవరకు............**

దీనివలన రెండవప్రతాపరుద్రుని కాలముననున్న రెడ్డు లుతాము సూర్యవంశజుల మనియు రాష్ట్ర కూట సంబంధులమనియుఁజెప్పికొనిరనుట స్పష్టము. రెడ్డి శబ్దమ్మునకు బ్రాచీన రూపమురడ్డియని యనేక శాసనములలో గ్రంథరాజములలో గనుపించుచున్నది. కొందఱు రెడ్డులు తమకుల వృత్తాంతముల చెప్పుకొనక పోవుటచే వంశశాఖాభి నిర్ణయములసాధ్యములగు చున్నవి. ద్రవిడ దేశమునందలి తిరువళ్ళూరు వీర రాఘవస్వామి దేవాలయములోనున్న శిలాశాసనములో వేమారెడ్డి శాసనము వేయించి యందుఁ దానుసూర్యవంశజుఁడనని చెప్పికొని యున్నాడు.

**స్వస్తి సమధిగత పంచమహాశబ్ద మహామండలేశ్వర వీరనారాయణ భుజబల భీమ విరోధిదానవ నృసింహ రాయ వేశ్యాభుజంగ నామాదిసమస్త ప్రశస్త సహితుండగు వేమభూపాలుడు స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వర్షంబులు ౧౩౨౬ నర్తింపంగా తారణసంవత్సర శ్రావణ శుద్ధ పౌర్ణవమి ఆదివారమునాఁడు తనరారాజైశ్వర్య దినదిన ప్రవర్ధమానమగునట్లు తిరువళ్ళూరు వీర రాఘవ దేవరకు సువర్ణకిరీట మర్పించి వేయించిన శాసనం బెట్టిదనిన,**

శా. ఏవంశంబుననుద్భవించి కరుణాహృత్కంజుజడిక్ష్వాకుడున్
ధీవర్యుండురఘుండజుండు ఘనపంక్తి స్యందనుండున్ గుశుం
డీవిశ్వంబును ఖ్యాతి నేలిరలఘు ప్రేశాన్వయంబందుధా
త్రీవర్యుల్ జనియించి యేలిరిలద్రీతిన్ బెక్కురాపిమ్మటన్

ఉ. ఆయిన వంశమందు నరపాగ్రణి ప్రోలనృపుండు బుట్టెబా
హాయతశక్తి మంతుడ హితౌఘవిపాటన శూర్యవర్యుడున్
న్యాయగుణుండు వేమనరనాథుడు బుట్టెను వాని వంశమం
దాయతమైన భూవలయ మంచితరీతిని నేలుచింపుగన్.

సీ. శకవత్సరంబులు శరపక్షగుణ శశిసంఖ్యయు బాగుగ జరుగుచున్న
సుమహిత తారణాబ్దమున శ్రావణ పౌర్ణిమంబున నాదివారంబునందు
చారు తిరువళ్ళూరు వీర రాఘవునకు నిజరాజ్యవృద్ధికై నిర్మలమతి
మేటియా స్వర్ణకిరీటంబు నర్పించె సకలకోవిదులుతన్ సంస్తుతింప
నూరమాంబిక యవ్వనాస్తోకవనవ, సంతుడహితాళికౌలుఁదుసత్యరతుడు
వీరనారాయణుడు మహాధీరవరుడు, విమలగుణసాగరుండును వేమవిభుడు.

ఈ శాసనము వలన వేమారెడ్డియుఁ దాను సూర్యవంశఁజుఁడనని చెప్పుకొనెననుట స్పష్టము. ఈ శాసనము నందు నితర రెడ్డివీరుల శాసనములందును అనితల్లి కలువ చేరు శాసనమునందును, రెడ్డివంశములకు కూటస్థుఁడుగఁ జెప్పఁబడు ప్రోలయరెడ్డియే గావున నీవంశజులగు రాష్ట్రకూటులు సూర్యవంశజులనుటకుఁ బ్రోలరెడ్డి శాసనము ప్రథమాధారము. పెదకోమటి వేముని శాసనమంతి మాధారముగా గైకొనందగును. పై వేమారెడ్డి భార్య రెడ్డి వారింట యాడుపడుచుగాదు. వేమారెడ్డి భార్యయగు సూరాంబిక చరిత్ర మించుక కొండవీటి చెంతగల పిరంగిపురము వీరభద్రాలయము నందలి శ్రీనాథ మహాకవి కృతశిలా శాసనములో నీవిధముగ వ్రాయఁబడియున్నది.

రాజస్తస్య మహాదేవీ రాజమౌళెరివాంబికా ।
రత్నసింహాసన స్యార్ధేరాజతే సూరమాంబికా ।
......... శ్రీ ధాన్యవాటి పురాధిపతియు ।
కృష్ణవేణీజల క్రీడావినోదుండునగుగన్న భూపాలుననుగుపుత్రి ।
వీరనారాయణుడు వేమవిభుని దేవి భూరిసద్గుణనికురుంబసూరమాంబ

ఈ సూరాంబ జనకుఁడగుగన్న భూపాలుఁడు శ్రీనాధకవి సార్వభౌముని వలన ధనుంజయ విజయమంకితమొంది నటుల దెలియుచున్నది. కాని యిపుడా గ్రంధము లభించుటలేదు. గన్నభూపతి తన వంశజులకుఁ పూర్వుఁడనిదంతులూరి బాపిరాజు మూర్తిత్రయో పాఖ్యానముననిటులఁజెప్పినాఁడు

**సీ. అహితదుర్గాధ్యక్షులద్భుతంబొందగఁ గ్రీడికైవడినిలిచి దాడినాడు**
**అక్షుద్రదాన విద్యాక్షాత్రములచేతఁబ్రతియెవ్వరును లేక ప్రతిభగాంచెఁ ।**
**దనకీర్తి దశదిగంతరగీయ మానమైకనుపట్ట ధర్మమార్గంబు నెఱపె ॥**
**శ్రీనాధసుకవీంద్రుచే ధనుంజయవిజయంబను సత్కావ్యమందివెలసె**
**నృపతిమాత్రుండె నిజపాదనీరజాత**
**ఘటితకోటీర వైరి భూకాంతమాన**
**సాంతర భయాపహారి శ్రీ దంతులూరి**
**గన్నభూపాలమౌళి దోర్గర్వశాలి**

ఈగన్న భూపాలుని పూర్వుఁడగు హరికృష్ణుఁడు మూర్తి త్రయోపాఖ్యానము నందు

**"మ...... శ్రీధాన్య వాటీ పురీ ।**
**చిరసామ్రాజ్య రమాసమాశ్రయరమా సింహాసనాసీనుఁడై"**
**సీ. పరియించెనే చంద్రవంశ పావనుదర్థి నమరేశదేవకటాక్ష లబ్ధ"**
**యనియు బమ్మరకేసన మల్లనచే విష్ణు భజనానందనందు**

అనియుంజెప్పఁబడెను. గన్నభూపాలుఁడు ధనంజయ గోత్రుఁడు ఈ గోత్రము ప్రవరఖండములో విశ్వామిత్రగణంబునన్ గలదు. గోత్రకర్తలు విశ్వామిత్ర మధుచ్ఛందో ధనుంజయులు కావున ధాన్య వాటీపురాధీశ్వరుఁడగు గన్నభూపాలుఁడు చంద్రవంశ క్షత్రియుఁడనుట నిర్వివాదము. దీని వలన వేమారెడ్డి భార్యయగు సూరమాంబ చంద్రవంశ క్షత్రియుల యాడుపడుచనుటకుసంశయముండదు.

శ్రీ వైకుంఠమను దక్షిణదేశమందలి విష్ణుక్షేత్రము దేవాలయములో గోడకానించిన శిలాశాసనమునందు రాజమహేంద్రము ఁ బాలించిన నాగిరెడ్డి దాను సూర్యవంశము వాఁడనని చెప్పుకొన్నాడు.

స్వస్తి శ్రీ రణరంగభీమ అఖర్వగర్వ రిపుమత్తమాతంగ కంఠీరవశౌచ గాంగేయ వారనారీ యవ్వన వనవసంత రూప జితమదన రాజమహేంద్ర పట్టణాధీశ రాయవేశ్యా భుజంగ

మిత్రకుమండన సుకవి మందార మూరురాయర గండరగండ సింహధ్వజలాంఛన నామాది సమస్త ప్రశస్త సహితుండగు భూపాలుండు శ్రీవిజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౬ అగు విజయ సంవత్సర వైశాఖ శుద్ధ ౨ లు నిజరాజ్య సమృద్ధికై గోపురము జీర్ణోద్ధారము గావించి వేయించిన శాసనము.

**సీ. సారస మిత్ర వంశమను వారాశికే రాజపుంగవుడు సద్రాజునయ్యె**
**రాజమహేంద్రపురక్షమానాథమండలికి నేనృవరుడు నాయకుండు**
**ముగురురాయలకును మిక్కు మిండండయి వెలగెనే పరసాల వీరవర్య**
**డంచిత రాయవేశ్యాభుజంగాది సద్బిరుదులే ఘనునకు వెలయుచుండు**
**నట్టి శ్రీనాగిరెడ్డి క్షమాధినాథు, డబ్దములుతర్క శరసముద్రాబ్జసంఖ్య**
**జలగుచున్నట్టి విజయవైశాఖ శుద్ధ, మునద్వితీయను వైకుంఠపుర పురము**
**రారి గోపురంబుద్ధరించెను గొమరు మిగుల ॥**

కేశవభట్టు చెప్పిన శాసనము.

శివలీలా విలాస గ్రంధకర్తయగు నిశ్శంకుని కొమ్మనగూడ నిటులనే అల్లాడరెడ్డి కుమారుఁడగు వీరభద్రారెడ్డిని వర్ణించుతటి సూర్యవంశీయుఁడనియే వాకొనియున్నాడు.

**చ. వరకమలాప్త వంశమున వర్ణనఁగాంచి యమోఘమార్గణా**
**దరమునమించి శాంభవ కథాసరణిన్ మదినుబ్బియుల్లస**
**ద్ధురతమత ప్రవర్తనముదంబు వహించి తనర్తురింపు సొం**
**పరుదుగ రామభద్రుఁడును నల్లనృపాలకు వీరభద్రుఁడున్ ॥**

శివలీలా విలాసము

ఈ యుదాహరణముల వలన రాజమహేంద్రవరపు రెడ్డివారు కూడ తాము సూర్యవంశజులమని చెప్పుకొనుటయెగాక రాష్ట్ర కూటులవలె సింహధ్వజలాంఛనులమని చెప్పికొనిరి. గావున వీరును సూర్యవంశజులనుట స్పష్టమైనది. వీరలు సూర్యచంద్ర వంశజులతోఁ గావించిన బాంధవ్యములు లోగడ ప్రకరణముననె ప్రసక్తి వెంటఁ చెప్పి యున్నాము.

కోరుకొండ దుర్గము నేలిన రేచర్లకాచిరెడ్డి పుత్రుఁడు నుభయభాషా కోవిఁదుడునగు రామిరెడ్డి భారతమును ద్విపద కావ్యముగ రచించుచునందుఁ దాను సూర్యవంశమునఁ

బుట్టి నట్లు వ్రాసికొని యున్నాఁడు.

ద్విపద. కోర్కొండ దుర్గంబు కొమరొప్పయేలి
తర్కింపనాంధ్రభూతల నాథులైన
భానువంశజులందుఁ బ్రఖ్యాతిగన్న
జ్ఞానవిదుండను సంస్కృతాంధ్రముల
నసమానసాహితి నలరినవాఁడ
రసికవందితుఁడను రాజవంశజుఁడ
రేచెర్ల గోత్రుండ రెడ్డికులుండ
కాచిరెడ్డి కవీంద్ర గర్భజాతుండ
జయపుర వంశ్యుండ చండశాసనుఁడ
నయమొప్ప భారతార్ణవమీద నెంచి
రామిరెడ్డి సమాఖ్యరంజిల్లువాఁడ
నీ మహిద్విపద గానిపుడు రచింతు.

ద్విపద భారతము అవతరణిక

దోమకొండ సంస్థానమునకుఁజెందిన రెడ్లను సూత సంహితయందుఁ బట్టమెట్ట సోమనాధ కవి సూర్యవంశ క్షత్రియులని యీ క్రింది విధముగా వంశాభివర్ణనమునందు వ్రాసి యున్నాఁడు.

సీ. అఖిలాండకోటి బ్రహ్మాండాదికారణ హరికిదక్షిణ నేత్రమయ్యెనెవ్వఁ
డనవద్యహృద్యభవ్యామ్నాయ లావణ్య కలిత గాత్రుండయియలరెనెవ్వఁ
డవనీచరాచరనివహనవృద్ధిక్ష యాత్యంత నిదానుడైయలరెనెవ్వఁ
డమలినచ్ఛాయా మహాదేవి చిత్త పద్మాచ్ఛమరందాళియయ్యె నెవ్వఁ
డట్టిరవినుండి యుదయించె నలఘుదళిత
దుర్మదారాతి వితతి యస్తోకసుగుణ
నీతి భూసురల పాలనని యతిసుగతి
దనరుక్షత్రియజాతి యుదారరీతి ॥

గీ॥ పరమపావనమైన తద్బాహుజన్మ జాతిశాఖోపశాఖల జగతినిండె

నందు శ్రీపాకనాటిరెడ్యన్వయంబు చాలజెలువొందువిరులలో జాజిభంగి ?

క. అపాకనాటికులమున రూపింపఁగమేలుబంతి రూఢిన్ ధర్మ
వ్యాపార నిర్మలంబై యేపునరాచుళ్ళ గోత్రమెన్నిక గాంచెన్.

గ్రంథకర్తయగు సోమనాథ సోమయాజికవియు గ్రంథ ప్రేరేపకుఁడగు కామినేని కామారెడ్డియు సతీర్థ్యులుగాన (సహపాఠులు) నీ రెడ్డి వంశమును గూర్చి కవిజెప్పిన యంశములు ప్రమాణములనుట సత్యము. కామారెడ్డి సోదరుఁడగు యెల్లారెడ్డి యిట్లు వర్ణింపఁబడె.

సీ. పాకృతవైకృత ప్రముఖసర్గ ప్రసత్సర్గపారంపరీ సంగతులును
గమలసంభవమహాకల్పదైనందినకల్పమానవకల్ప కార్యగతులు
నాదిమవంశ వంశాంతరావాంతర వంశనానావిధ వ్యాహృతులును
దేవతిర్యఙ్నరదేవ దేవనవిధా సాధారణ విశేష చరితములును

గీ॥ కరతలామలకంబులే ఘనుకతఁడుదిక్కరిగిరీంద్రధృతిశాలి బిక్కనోలి
కామి రెడ్డీంద్రునునుజుఁడ ఖండకీర్తి యెల్లరెడ్డి క్షమాతలాధీశ్వరుండు॥

ఉ. పంచమవేదమై బరఁగుభారత సంహిత నాకళించి శో
ధించి పురాణ పంక్తిని శ్రుతిప్రతి పాజితమేర్పడించి ని
శ్చలంచల బుద్ధియోగపద సాంఖ్య విధంబుల కాది తత్వముల్
గాంచి ముదంబునన్ దనుగాచయ యెల్లయ రెడ్డి ధన్యుఁడై ॥

నూతసంహిత.

పై పద్యములందలి విద్యావిశేషములు కేవల వేదసంబంధములు, సర్గపరంపరా సంగతులు, బ్రహ్మ కల్పమానవకల్ప కాద్యగతులు. వేద ధర్మములు భారతముతో సమన్వయించుట సాంఖ్యతత్వము నెఱుంగుటలోనగు బ్రహ్మ విద్యాపరిచయ గ్రహణములు వేదాదికముల గురుముఖమున వల్లించినవాఁడు కావింపవలసినదే. యెల్లారెడ్డికీ విజ్ఞానమున్నటుల సమకాలికుఁడు సతీర్థ్యుఁడు నాస్థాన కవియగు నియోగ బ్రాహ్మఁణుఁడు చెప్పుట వలన బిక్కనవోలు సంస్థానమని పూర్వము వ్యవహరింపఁబడిన దోమకొండ సంస్థాన ప్రభువుల పూర్వులు వేదశాస్త్ర పురాణము లెఱింగిన క్షత్రియులనియే వ్యవహరింపబడిరనుటకు నీ యుదాహృత భాగము చాలును. ఎల్లారెడ్డి సోదరుఁడగు

మల్లారెడ్డి ఆంధ్రమున సుప్రసిద్ధకవి. ఇతఁడు శివ ధర్మోత్తరమునందును పద్మపురాణమునందు వేదములందలి సూక్తములను వేదవిహిత ధర్మములను పూజా విధానములను మంత్రోపాసనా విధుల విస్తరముగాఁ జెప్పినాఁడు. శివధర్మోత్తరమునందలి విషయములన్నియు శైవాగమ శ్రుతి స్మృతి పురాణానుసారములు ఓంకారము పంచాక్షరి షడక్షరి మంత్రోపదేశ విధులు సప్తధాతు సంఖ్యానములోనగు వంశములను సమర్థించి వ్రాయుటకు నేతన్మాత్రునకుఁదరముగాదు. మల్లారెడ్డి సోమనాధకవి చెప్పినటుల క్షత్రియ శాఖాంతర్భాగమగు రెడ్డి గావున వేదాదులు గురు ముఖమున నేర్వనవకాశము చిక్కెను.

దోమకొండ సంస్థనాధీశుల బంధువులగు గద్వాల సంస్థానాధీశులగు రెడ్డివారు గూడా క్షత్రియులనియే వ్యవహరింపబడిరనుటకు గద్వాల సంస్థాన ప్రభువులలో సుప్రసిద్ధుఁడగు సోమ భూపాలుఁడు కాణాదము పెద్దన సోమయాజి వలన అధ్యాత్మ రామాయణాదికములను హరిభట్టువలన రతిరహస్యము నంకితముఁగా గొనెను. ఈ సోమభూపాలుఁడు స్వయముగాఁ గవిత్వము చెప్పఁగలుగుటయేఁగాక కొన్ని గ్రంధములు సయితము రచించెను. కాణాదము పెద్దన సోమయాజి తన యధ్యాత్మ రామాయణమునఁ గృతిపతియగు సోమ భూపాలుఁడు చంద్రవంశజుఁడని నిశ్చయించుట కనుకూలముగా నీ క్రింది విధమున వర్ణించియున్నాఁడు.

**సీ. తనదుసోమసమాఖ్య దనరషోడశ హోమదాన కళాధురంధరతమించి**
**తనరాజ నామాంకమును సమర్థంబుగాఁగువలయ వికసనోత్సవమునించి**
**తనదుచంద్రధ్వజోత్తమము సార్థకముగా నరివిభేదనశక్తి నతిశయించి**
**తనసోమవంశవర్తన కుచితంబుగా విజయ విఖ్యాతిచే విస్తరించి**

**గీ. నతఁడు జెలువొందు మాఘమాసాదిఘటిత**
**రామకేశవగోపాల రథమహోత్స**
**వారచితహేమణితులాభారదాన**
**భరితభువనాళి సోమభూపాలమౌళి॥**

దీనిచే గద్వాల రెడ్డి ప్రభు పుంగవులు చంద్రవంశజులనుట స్పష్టము.

ఇట్లు సూర్యచంద్ర వంశజులని యనేక శాసనాదికములందుఁ జెప్పఁబడినను గొన్ని

శాసనములందుఁజతుర్థులని చెప్పంబడినంత మాత్రముననె క్షత్రియులుగాకపోరు.

చతుర్థ పదముఁగూర్చి ముందు విపులముగా వ్రాయుదుము.

**శ్లో॥ కావేర్యాంత్రిపురాంతకేజయపురే కాశీపురేగోకులే**
**పంచారామ పురీషు పట్టసపురే మార్కండ శంభోఃపురే**
**గంగాసాగర సంగమేషునిరతం శ్రీకొండవీటీపురే**
**చాళుక్యామ్మయుతాన్నదాననిరతం శ్రీవేమభూపప్రభుః ॥**

అనవేముని ఉప్పుగల్లు శాసనము

రెడ్డివారు చాళుక్యుల సంబంధమెనర్చిరని పూర్వము చెప్పిన దానికి నీయన వేముని ఉప్పుగల్లు శాసనము బలమునిచ్చుచున్నది. కాకతీయులు సయితమునిట్లే ప్రథమమున రాష్ట్రకూట సంభవులగు రెడ్డివారనియు చోళులసంబంధముచేసి తుదకుఁ చోళులమని చెప్పుకొనిరనియు, కాకతీయులలో రాజులకు మహారాజనామముండుటయు సామాన్యులకు నామాంతమున రెడ్డి పదముండుటయుంబట్టి నిర్ణయింపవీలగుచున్నది. రెండవ ప్రతాపరుద్ర దేవ మహారాజ కుమారుఁడగు జుట్టుయలంక గోంక రెడ్డియె పై విషయమునకుఁ బ్రథమాధారము. జుట్టయగొంక రెడ్డి ప్రతాపరుద్ర మహాదేవ రాజులకుఁ గుమారుఁడనుటకు నీక్రింద శాసనము లుదహరించుచున్నాము.

**స్వస్తి సమధిగత పంచమహాశబ్ద మహామండలేశ్వర మకుట మరీచిరంజిత పాదారవిందయుగళ చౌషష్టికళాకుశలమారురాయ జగద్దళ ప్రతి పక్షరాయవంశ నిర్మూలన రాయస్థాపనాచార్య మేరుమందర ధైర్య బల్మెంతిగండకదన ప్రచండ వడ్డెరాయ దిశాపద్ధ సేవనట్టనిభాళ అను మకొండ పురవరాధీశ్వర వీరలక్ష్మీనిజేశ్వర శ్రీ స్వయంభూదేవ దివ్యపాద పద్మారాధక పరబలసాధక నామాది సమస్త ప్రశస్త సహితం శ్రీమ న్మహామండలేశ్వర కాకతీయ ప్రతాపరుద్ర దేవులు సుఖసంకథావినోదం బున రాజ్యంబు సేయుచుండగా గండికోటకున్ను ములికినాటికి తన ప్రి యకుమారులయిన జుట్టయలంకయ గొంకరెడ్డిగారిని రాజ్యాభిషిక్తుల**

జేసెను. ఇది సూబాచెన్నూరు గ్రామమునఁగలదు.

శ్లో॥ తస్యరుద్రమహీపస్యజుట్టయో గుణశాలినః ।
యథాకుమారోరుద్రస్య కుమారోశక్తిమానివ ।
తేసర్వరుద్రదేవప్రియసుత భవతాజుట్టలంకేననిత్యమ్ ॥

ఇది సూబా చెన్నూరు గ్రామమునకు దక్షిణమున నాగనాథుని గుడిలోని శాసనమని లోకల్ రికార్డు నెంబరు ౧౩ లో నున్నది.

"స్వస్తి శకవర్షంబులు ౧౧౨౬ అగునేటి ప్రమాదీచ సంవత్సర శ్రావణ శుద్ధ ౧౨ లు బుధవారమునాఁడు స్వస్తశ్రీ మన్మహామండలేశ్వర కాకతీయ ప్రతాపరుద్రదేవుల కుమారుడు మూర్లోక గండమూర్తి ....... మహాదేవ కంఠకాలరాయకుండైన జట్టయలంకగొంకయ రెడ్డి లోకల్ రికార్డ్ నెంబరు 14

ఈ రెండు శాసనముల వలన పై యంశము స్థిరపడినదనుట నిర్వివాదము. రాష్ట్రకూట వంశ సంభవులగు రెడ్డివారు కొందఱు చంద్రవంశజులమని జెప్పుకొనుటకు ఁగారణము చాళుక్య సంబంధము వలనఁగలిగినది. ఇటులనే చాళుక్యులు తంజావూరు చోళుల సంబంధ బాంధవ్యము లొననరించి తుదకుఁ జోళులమని చెప్పుకొనినటులఁ జరిత్రాధారములు పెక్కులు గలవు.

రెడ్డివారు రాష్ట్రకూట వంశోద్భవులగు క్షత్రియులనుటకు నిదివరకె యనేకాధారములఁ జూపించియున్నారము.

రెడ్డివారికి కాఁపు కూర్మ(కున్‌బియను నామాంతరములు గలవనుటందరెఱింగినదె. వీటిని గుఱించి కూడా నిటసంగ్రహముగా వ్రాయుచున్నాము. కాంపిల్య దేశము నుండి ఈ దక్షిణాపథముఁజేరిన రాష్ట్రకూట వంశోద్భవులగు రెడ్లను దక్షిణాపథాదిమ వాసులు వారల దేశనామముతోడనే బొందిలఖండునుండి వచ్చిన వారలను బొందిలీలని వ్యవహరించినట్లు కాంపులని పూర్వమున వ్యవహరింపఁదొడంగిరనియుఁ గాలక్రమమున నా కాంపులను శబ్దము ప్రస్తుతము కాఁపులను అర్ధానుస్వార సహిత పదముగా మారెననియు నిదివరకే వ్రాసియున్నారము. చిలుకూరి వీరభద్రరావు మొదలగు సుప్రసిద్ధచరిత్రకారులీమాయభిప్రాయమునేకీభవించుచున్నారు. పై అంశమును చరిత్రజ్ఞానవాసనలేని మన పూర్వపండితులు గమనించికయు కారణాంతరముల వలనఁ

గొన్ని వైదికకర్మములనుష్ఠింపక వర్తించుచున్న యా కాంపుల గాంచితమ నిఘంటువుల యందుఁ గాఁపు శబ్దమునకు శూద్రుఁడని అర్థము సవిమర్శన పూర్వకముగా వ్రాసినారు. ఇది సకల ధర్మశాస్త్రములకును విరుద్ధమనుటలో సాహసమేమియు లేదు.

కాఁపులు రాష్ట్రకూట వంశమునకుఁ జెందిన క్షత్రియులని పై అంశముల వలన స్పష్టమైనధనుటలో సందేహమేమియు లేదు. కాఁపులయొక్క ధర్మము కాపాడుట యగుట వలన కొందఱు పండితులు కాపాడు వారగుటచేతనే కాపువారని పేరు గలిగయుండవచ్చునని యూహించు చున్నారు. వారి మతములో కాపు శబ్దమున కర్థానుస్వారముండదు.

రెడ్డి (కాపు) అనువారలు కున్‌బీలని కూడా వ్యవహరింపఁబడుచున్న సంగతి నందఱెరింగినదె. ఈ శబ్దము వీరలకెట్లు వచ్చినదో గ్రంథాంతరములందు నీ పద విషయము గుఱించియేమీ చెప్పఁబడినదో యను విషయములు నీ క్రింద సప్రమాణముగా విమర్శింపఁబడును.

**శ్లో॥ సుమిత్ర వంశేరాఠోరు కూర్మ వంశోత్పత్తి తృతీయ**
**రాశి సప్తపంచాశన్మయూ. ఖః ॥**

వంశ భాస్కరము ౧౦౧౩ । ౧౦౧౪ పత్రము.।

అని మిశ్రమణ సూర్యమల్ల విరచితమగు రాజపుత్రస్థాన వంశావళియైన వంశ భాస్కరమునందు ద్వితీయ భాగమున రాష్ట్రకూట (రాఠోరు) కూర్మ (కున్‌బి) వంశములు సూర్యవంశ సంభవుండగు సుమిత్రుని సంబంధమైనదని వ్రాయఁబడియున్నది.

రాష్ట్రకూట వంశజులు రెడ్డివీరులని యిదివరకె వివిధాధారములతో నిర్ణయించి వ్రాసినారము. రెండవదియును సూర్యవంశ సంభవుండఁగు సుమిత్రుని సంబంధమైనదగు కూర్మ వంశమునందు జయపూరు మొదలగు సంస్థానాధీశులు జన్మించినట్లు వారలు కృతిఁజెందిన గ్రంథముల వలననుఁదెలియవచ్చుచున్నది. దిక్ప్రదర్శనముగ రెండు మూడు గ్రంథముల నుదాహరింతుము.

జయపురాధీశ్వరుఁడగు శ్రీసవాయి మహారాజ జగత్సింహుని యాజ్ఞానుసారము పద్మాకరకవి రచించిన జగద్వినోద నామక కావ్యమందలి గద్య.

**"ఇతి శ్రీ కూర్మకులావతంస శ్రీమన్మహారాజాధి**
**రాజరాజరాజేంద్ర సవాయి మహాజగత్సింహా**
**జ్ఞయా మధురాస్థానేమోహన లాలక భట్టాత్మజ**

కవి పద్మాకర కవి విరచిత జగద్వినోద నామక కా

వ్యే శృంగార రసావలంబన విభావ ప్రకరణం ॥"

మఱియు శ్రీ విహారిలాల్ కవి వలన క్రీస్తుశకము ౬౨౩ నందు రచింపఁబడిన దోహేయను ఛందస్సునందు శ్రీ రాజరాజేంద్రుఁడగు జయసింహుని వంశావళి చెప్పునప్పుడు కూర్మకులావతంసయని సంబోధింపఁబడియున్నది.

భూషణకవి విరచితమగు శివభామినియను గ్రంథమునందుఁ గూర్మ వంశము సూర్యవంశమని వివిధాధారములతో నిర్ణయింపఁబడినది.

కర్ణేలటాడయను కవిశిఖామణిచే విరచితమగు రాజపుత్రస్థాన రాజవంశ చరిత్రమునందు ఁగూర్మవంశము సూర్యవంశాంతర్గతమైనట్టులఁ జెప్పంబడియున్నది.

ఇట్లు కూర్మవంశము సూర్య వంశాంతర్గతమైనదని బహు ప్రమాణములుండుటచేతను సూర్యవంశ సంభవుఁడగు సుమిత్రుని కుమారుఁడగు విశ్వవరుని తనయుఁడు కూర్ముఁడను వానిచే నీ వంశమునకుఁ గూర్మవంశమని పేరు కలిగినట్లు గ్రంథాంతరములందుఁ జెప్పబడియుండుటచే గూర్మవంశము సూర్యవంశమని చెప్పుటలో సందేహమేమిలేదు.

కూర్మవంశజులని వ్యవహరింఁబడువారు కున్‌బీలని వ్యవహరింపఁబడు రెడ్లు (కాఁపులు) నేక జాతీయులని దొరతనపు వారి యీ క్రింది రిపోర్టుల వలనఁ దెలయుటచే రెడ్డివారు (కాపువారు) సూర్యవంశ క్షత్రియులని నిర్ణయించిన దానికి నిదికూడ నొక ప్రమాణము.

"ప్రిన్సిపల్ నేషన్సు ఆఫ్ ఇండియ" యనుపుస్తకమునందు నుత్తర దేశమునందలి కూర్మకులా వతంసకులని పిలువబడువారు (జయపూరు రాజామొదలగు కూర్మకులావతంసకులు) మహారాష్ట్ర దేశమందుఁ గున్బీలని వ్యవహరింపఁబడువారు నేక జాతీయులై యున్నారని చెప్పుచున్నది. కావున నా యర్థము గల ఇంగ్లీషు వాక్యముల సమాత్రుకముగ నీ క్రింద నుదాహరించుచున్నాము.

Mahrattas : The Agricultural Kumbis are the chief tribe, the same as the Kurmis of N. India. To them peculiarly belongs the name Maharatta. About the middle of the 16th Century the Mahrattas under Sivaji, recovered the power they had before the Muhammadans invaded the Deccan. Sivaji was born in a fort, his greatness arose from his forts and in a fort he died. (The Principal nations of India)

ఇదియునుంగాక రెవరెండు షేరింగు ట్రాంజెస్ కాస్టన్ అను పుస్తకము నందలి ఒకటో వాల్యమునఁగూర్మి, మరాట, కున్బి, యను పదములు పునహా మొదలగు ప్రాంతములందు సాధారణముగ నొక అర్థమందును, నొక జాతీయుఁడైన మనుష్యునింగూర్చి తెలియంబరచు చున్నవి. వీరిలో నొకరికొకరికి వివాహ సంబంధములు సయితము కలవు. పై అర్థము వివరించెడు ఆంగ్లేయ వాక్యము లుదాహరించు చున్నాము.

"The words Kumbi and Mahratta are frequently used indiscriminately in the Poona District. the kurmis and Kumbis are in reality one class of People.

(Revd Sherring's Tribes & Castes Vol : 1. "The term Kumbi includes two main classes, Kumbi & Mahrattas, between whom, it is difficult to draw a line. Maharattas, between whom, it is difficult to draw a line. Mahrattas & Kumbis eat together and intermarry and do not differ in appearance religion or customs."

(Bombay Gazatter Poona Vol. XXIII Part 1.)

1818 సంవత్సరము జనాభా లెక్కలలో మహారాష్ట్ర ప్రజలను (కూర్మీలను) కున్బీలలో సమానపరచియుండుట వలన మహారాష్ట్రులను కున్బీలు భిన్న జాతీయులు కారు పై అంశములను బోధించునట్టి ఆంగ్లేయ వాక్యముల నుదాహరించుచున్నాము.

"The Marathas are found all over the district. The 1881 Census includes them under Kumbis from whom they do not form a Separate Caste".

(Bombay Gazetteer Vol. XIX)

"Maratthas form the majority of the Hindu population and are cultivators describing themselves as Kumbis"

(Imperial Gazetteer of India, Kolhapur Vol XV)

Maharashtra is the country of the Marathas who form 30% of its population. The terms in now reserved for the descendants of the old fighting stock, a hardy and vigorous class, once the terror of India now merged very largely in the cultivating class known as Kumbi". (Imperial Gozetter of India (New edition) Vol XVI.

పై విషయముల వలన కూర్మ కులావతంసకులనఁబడు నుత్తర దేశవాసులును కున్బీ మరాటాయను వారలును నేకజాతీయులని స్పష్టముగాఁదెలిసినది మరాటా కున్బీ, కూర్మియయను వారలనేకొన్ని ప్రదేశములలో కాపురెడ్డియను నామములచే వ్యవహరింపఁబడుచున్నారని హైదరాబాదు మెడ్రాస్ మరాటా మైసూరు గజట్లయందుఁ గలదు. నా విషయము చదువరులకు బోధపడగలందులకు సమాత్రుకముగ ఆంగ్లేయ వాక్యముల నుదాహరించుచున్నాము.

Vol XIII Page 247 Hyderabad State

"The Kapus or Kumbis the great agricultural Caste in the State number 2953000 persons or 26% of the whole population.

Vol XVI Page 261 and 262, Maderas Presidency "of the Hindu Castes of Madras the largest are the Kpus numbering 25760000 in 1904. They are divided in endless sub-castes which keep severally apart from one another and usually decline to intermarry or even to eat together"

(Vol XVI Page 436 Maharashtra)

"Maharashtra is the country of the Marathas who from 30% of its population...... The term is now reserved for the descendants of the old fighting stock, a hardy and vigorous class once the terror of India, now merged very largely in the cultivating class known as Kumbi.... three million persons in the Konkan and Deccan returned themselves as Maharathas in the census in 1901, and from backbone of the population in the Bombay Presidency, fond of their traditions of deads of valour embodied in the ballads of the country-side. The Maratha peasanty are a frugal and peace loving people content to extort a bare, subsistence from the story Deccan uplands or the rocky spurs, of the Ghats. At holiday season they make pilgrimages to numerous shrines of saints and heroes scattered over the countryside & expend sall sums in harmless Merry making when the business of the pilgrimage has been disposed of. It is possible that the Marathas are connected with the Reddis of the Telugu"

(Vol XVI Page 193 & 194 Mysore State)

"The Hindus have been arranged into 72 Castes or Classes, of these the strongest numerically are wakkaligars (I287000). The wakkaligars (in Hindustani Kunbi) are the cultivators or ryots. They include numerous tribes, some of Kanarese & some of Telugu origin. Their headmen are called Gandas..... The wakkaligars are mostly vegetarians and do not drink intoxicating liquor. The Gangadekra who from nearly one half of the class, are purely kanarese, found chiefly in the central & Southern tracts. They represent the subjects of the ancient Gangavans which formed the nuclens of the Ganga Empire. At the present day they are followars some of Siva & some of the Vishnu. Next in number are the kkaligars, chiefly in Kolar & Bangalore Districts. They appear to have been orginally immigrants from a District called Morasunad to the east of Mysore whose chiefs formed settlements at the end of the 14th Cenury in the past round Nandidroog..... In the old days many of them acted in the Kandachar or native Militia. They are not only cultivators but some times trade intgrain. The Reddis are found chiefly in the East andNorth and have numerous Sub Divisions. To some extent they seem to be of Telugu origin and have been supposed to represent the subjects of the ancient Rattoyade or kingdom of Rattos"

ఈ దొరతనము వారిచేఁ బ్రకటింపఁబడిన గజట్లను సమన్వయింపఁగాఁగూర్మి,

'కున్ బి, కాపు, రెడ్డియను పదము లేక జాతీయునకు సంబంధించినవెయని తేలినది. కూర్మ కులావతంసులు సూర్యవంశ క్షత్రియులని వారివారి చరిత్రముల నుదాహరించి యిదివరకే నిర్ణయించితిమి. ఇపుడు దొరతనము వారిచేఁ బ్రకటింపఁబడిన గజట్ల నుదాహరించి కున్‌బియను నామాంతరముగల రాష్ట్రకూట వంశోద్భవులగు రెడ్డి వారిని సూర్యవంశ క్షత్రియులని నిరూపించుచున్నాము. బొంబాయి ప్రసిడెన్సిలోని బెలగాం మొదలగు ప్రదేశములందును మద్రాసు ప్రసిడెన్సిలోఁ జేరిన హైదరాబాదు రాజ్యమునందును, కున్‌బీలను వారు తమ వంశమును గూర్చి చెప్పునది యేమనఁగఁ బూర్వకాలమునందొకప్పుడు సూర్యవంశజుండగు బలభద్రుని కులజులమైన మేము దిగ్విజయార్థము కొఱకును మఱికొన్ని కారణాంతములచేతను అయోధ్యానగర ప్రాంతము నుండి దక్షిణ దేశమునకు ౧౨౦౦ సంవత్సరముల క్రిందట రాబడిన వారమని చెప్పుకొనుచున్నారు"అను నీ యంశమును ఈ.జీ.జన్,కిన్, సన్, ఏనాస్క్వాయర్ డిప్యూటీ కమిష్నర్ అండ్ సెటిల్‌మెంట్ ఆఫీసరిగారి వలన 1886 సంవత్సరము ఏప్రిల్ నెల 26 తేది మెమొ అంది కాష్టన్స్ ప్రీవిలింగ్ ఇన్ది డాస్ట్రిక్టు ఆఫ్ జాన్సి అను గ్రంథమునందు వ్రాసియున్నారు దీని మాతృక క్రింద నుదాహరించుచున్నాము.

Koormees : These people state that they emigrated from the South 1200 years ago. They claim descent from Raja Bal Bhudra Soorajbans, who lived in the Tretrayug, the second age of the world

[Memo, on the Castes prevailing in the district of Jhansea)

ఇట్లు రెడ్డి వీరులు (కాఁపు, కున్‌బీ, కూర్మీలు) క్షత్రియులనుటకుంబెక్కింటి నాధారము లుదాహరించియున్నాము. గ్రంథ విస్తరభీతిచే మిగతవి వ్రాయమానితిమి.

శాసనములలో ఁగృత్యవతారికలలో రెడ్డివారు చతుర్థ వంశీయులమని కూడా చెప్పుకొనిరిగదా అదియేల ప్రమాణము కాగూడదను వాదము బయలు దేరును కానఁ దొలుత దానికి సమాధానము చెప్పవలసియున్నది. క్షత్రియ జాతులకు చతర్థ జాతులకుఁ గల సంబంధము జెప్ప గలిగితిమేని చతుర్థ జాతులు క్షత్రియులేగాని శూద్రులని తేలదను తలంపుతోఁజతుర్థ జాతులకు శూద్ర జాతులకుఁగల విభేదములు రాబోవు ప్రకరణమునఁ దెలిసికొందుము.

**నాల్గవ ప్రకరణము**

**సంపూర్ణము**

శ్రీరస్తు

# రెడ్డికుల నిర్ణయ చంద్రిక

## ఐదవ ప్రకరణము

రెడ్డివీరులు కొన్ని శాసనములందుఁగొన్ని 3 గ్రంధములయందుఁ జతర్థవంశ జులనిగలదు. కొందఱు విష్ణుబ్రహ్మ పాదముల నుండి బుట్టినయొక పవిత్రజాతి వారనిచెప్పిరి కాని క్షత్రియులమని చెప్పుకొన్న 3 ప్రతిశాఖ వారితోడను రెడ్డి వారికి సంబంధ బాంధవ్యములుండుట వలనను దాముకొన్ని శాసనములయందు c గొన్ని గ్రంధములయందు సూర్యచంద్ర వంశజులమని చెప్పికొనుటవలనను, క్షత్రియో చితమగు భూపరిపాలనము, శౌర్యధైర్యస్థైర్య పరాక్రమాదులుండుట వలనను వీరిని శూద్రులనుగా విశ్వసింపవచ్చునా యనునంశమును గూర్చి లోతునకుఁదిగి విమర్శము చేయుట ప్రకృతమైయున్నది.

మన ధర్మశాస్త్రములయందుఁబురాణేతి హాసంబులయందు శూద్రధర్మములీ క్రింది విధముగా నభివర్ణింపఁబడినవి. వాని భావము తొలుత గ్రహింతము. శూద్రులను పాదజులని పురాణాదికములు జెప్పుచున్నవి. వీరికి మనపూర్వులొసంగిన హక్కులివి.

**"సూ॥ అధహాస్య వేదముపశ్రుణ్వతస్త్రపుజతుభ్యాం**
**శ్రోత్ర ప్రతిపూరణముచ్చారణేజిహ్వాచ్ఛేదోధార**
**ణేశరీరభేదః ॥ ఆపస్తంబసూత్రము**

శూద్రుఁడు వేదమువినిన లక్కనుగాని సీసమునుగాని కఱిగించి చెవులో వోయవలెను, వేదము చదివిన శూద్రుని నాలుకగోయవలెను, వేదాధ్యయనము గావించిన శూద్రుని దేహమునుఖండింపవలయును.

**శ్లో॥ నావిస్పష్టమధీయాతనశూద్రజనసన్నిధౌ**
**శూద్రునివద్ద వేదమును స్పష్టముగా స్వరబద్ధముగాఁజదువందగదు.**

**శ్లో॥ శ్వక్రోష్టుగాఖోలూక శ్యామచ్ఛాగార్తనిస్వనే**
**అమేధ్యశవశూద్రాంత్యశ్మశాన పతితాంతికే ॥**

యాజ్ఞవల్క్యస్మృతి.

కుక్కనక్కగాడిద మొదలగు హీనజంతువుల ముందు గాని అశుద్ధము. పీనుగు, శూద్రుఁడు కులహీనుఁడులోనగువారి ముందుగాని వేదము చదువరాదు.

శ్లో॥ వేదాక్షరవిచారేణ శూద్రస్యనకంధ్రువం

వేదమునందలి వర్ణము నాలోచించి నంతమాత్రమున శూద్రునకు విధిగానరకము గలుగుననుట నిశ్చయము.

పరాశరస్మృతి.

శ్లో॥ శ్వచర్మణియధాక్షీరమపేయంబ్రాహ్మణాదిభిః ।
తద్వచ్ఛూద్రముఖాద్వాక్యం శ్రోతవ్యం నకదాపిచ ।
పండితస్యాపిశూద్రస్య శాస్త్రజ్ఞానరతస్యచ ॥
వచనంతస్యనగ్రాహ్యంశునోచ్ఛిష్టంహవిర్యధా ॥
శూద్రోజ్ఞానావలేపేన బ్రాహ్మణాన్ భాషతేయది
సయాతినకంఘోరం యావదాభూతసంప్లవం ।

పరాశరమాధవీయము

కుక్క తోలునందుఁబోసిన పాలవలె శూద్రునిముఖతఃవచ్చిన మాట నాలకింపరాదు. కుక్క తాకిన హవిస్సువలె శాస్త్రజ్ఞానశాలివాఁడైనను శూద్ర పండితుని మాట మాత్రము గ్రహింపఁదగినదికాదు. అజ్ఞానాతిశయముచే శూద్రుఁడు బ్రాహ్మణులతో భాషించెనేని వాఁడు భూతాదులు న్నంతవఱకు నరకమునందుఁగూలుట సత్యము.

శ్లో॥ శక్తేనాపిహిశూద్రేణన కార్యోధనసంచయః
శూద్రోహిధనమాసాద్య బ్రాహ్మణానేవబాధతే ॥

మనుస్మృతి అధ్యా ౧౦ శ్లో ౧౨౦

శక్తిగలవాఁడైనను శూద్రుఁడు ధనమునార్జింపరాదు. శూద్రుని ధనమును బ్రాహ్మణులు హరించినయెడల రాజు దండింపఁగూడదు. ఏలయన శూద్రుఁడు ధనమునుపార్జించిన బ్రాహ్మణాదులను బాధించునుగాన -

శ్లో॥ ఏకమేవతుశూద్రస్య ప్రభుఃకర్మసమావిశత్ ।
ఏతేషామేవ వర్ణానాంశిశ్రూషామనసూయయా ॥

మనుస్మృతి అధ్యా ౧ శ్లో ౭౧

శ్లో॥ శూద్రంతుకారయేద్దాస్యంక్రీతమక్రీతమేవవా ।
దాస్యాయైవహిస్పృష్టోసౌబ్రాహ్మణస్యస్వయంభువా ॥

మనుస్మృతి అధ్యా ౮ శ్లో ౪౧౩

శ్లో॥ అశక్తువంస్తు శుశ్రూషాం శూద్రఃకర్తుద్విజన్మనాం ।
పుత్రదారాలయంప్రాప్తోజీవేత్కారుక కర్మభి ః ।
యైఃకర్మభిఃప్రచరితైః శుశ్రూష్యం తేద్విజాతయః
తాని కారుక కర్మాణి శిలాని వివిధానిచ ॥

మనుస్మృతి అధ్యా ౧౦ శ్లో ౯౯

బ్రహ్మదేవుఁడు శూద్రులకు త్రివర్ణ సేవయేధర్మముగానియోగించెను. బ్రాహ్మణజాతికి శూద్రుఁడసూయఁజెందక సేవఁజేయవలయును. శూద్రునిచేతఁ గూలియిచ్చియేని యీయకయేని పనిఁజేయించుకొనవలయును. బ్రాహ్మణునకుఁ దొత్తరికముజేయుటకే బ్రహ్మ శూద్రజాతిని నిర్మించెను. శూద్రుఁడు బ్రాహ్మణజాతి సేవకియ్య కొనకపోయినచోఁ కుటుంబరక్షణము చేయవలసినచోఁగొయ్యలుచెక్కుట రంగువేయుటలోనగు శిల్పములతోనైన బ్రాహ్మణశిశ్రూష జేసి జీవింపవలయును.

శ్లో॥ శూద్రస్యద్విజశు శ్రూషాపరమోధర్మ ఉచ్యతే ।
అన్యథాకురుతేకించిత్తద్భవేత్త స్యనిష్ఫలం ॥

పరాశరమాధవీయము

శ్లో॥ వికర్మకుడుతేశూద్రాఃద్విజ శుశ్రూషయోఝ్ఝితాః ।
భవంత్యల్పాయుషస్తేయుషస్తైవైనిరయం యాంత్యసంశయం

అధ్యా ౨ శ్లో ౧౪

శ్లో॥ జపస్తపస్తీర్థయాత్రా ప్రప్రజ్యామంత్రసాధనం ।
దేవతారాధనం చైవస్త్రీ శూద్రపతనానిషట్ ॥

అత్రిస్మృతి అధ్యా ౧ శ్లో ౧౩౩

శూద్రుఁడు ద్విజులకు సేవచేయవలయు నిదే పరమధర్మము. ఇందులకు వ్యతిరేకముగా వర్తించిన శూద్రుని జీవనము నిష్ఫలము. ద్విజదాస్యముమాని ఇతరకర్మములు చేయు శూద్రులు ఆయుర్విహీనులగుటయేగాక నరకమునందుఁ గూడబడుదురు. జపము తపము తీర్థయాత్రలు సన్యాసము మంత్ర సాధనములు. దేవపూజలోనగునారింటిని శూద్రులు స్త్రీలు విడువ వలయునని పై శ్లోకముల భావము ఈయభిప్రాయము లే శుక్రనీతి, విష్ణుస్మృతి, హారీతస్మృతి, పరాశరమాధవీయభాష్యములోనగు గ్రంథములలోఁగలవు. విస్తరముగఁజూడఁదలఁచినవారు జయార్థ ప్రకాశిక 165 పుట మొదలుకొని చూడగలరు. బ్రాహ్మణులిటుల వ్రాసిరని శూద్రులకు ద్వేషభావము పురికొలుపుట మాయభిమతము కాదు. ఆ కాలపు సంఘనియమములట్టివి చేతినున్న అధికార సూత్రములుతొలఁగి పోకుండుటకై క్రింది తరగతులవారిని నిన్నికట్టుబాటులతో బంధించిరి. శూద్ర ధర్మములనిట్లు దెలిసికొంటిమి. శూద్రులెవరోయను వంశము మన్వాది స్మృతులందును నమరకోశాది నిఘంటువులయందుఁ బ్రతిపురాణమునందును చెప్పంబడినది కావున నిటవిస్తరభీతి వ్రాయమానితిమి.

జీవికార్థమై కొందఱు రెడ్లు (కృషిఁ) వ్యవసాయము చేయుచుండుటచే శూద్రులని అందురేమొ **"కృషి గోరక్ష్యవాణిజ్యం వైశ్య కర్మ స్వభావజం"** అను గీతా వచనము ననుసరించి కృషి వైశ్య ధర్మముగాని శూద్ర ధర్మము కానేరదు. కలియుగమున క్షత్రియులు కృషి చేయగలరని పరాశరస్మృతి లోని యీ శ్లోకము దెలుపుచున్నది. **"క్షత్రియోపి కృషింకృత్వాదేవాన్ విప్రాంశ్చ పూజయేత్"** పూర్వకాలమున ఋషులు సయితము కృషిచేసినట్లు శ్రుతిస్మృతీతిహాసముల యందుఁగలదు. వాటిని గ్రంథ విస్తర భీతిన వ్రాయమానితిమి. ఇంతవరకు శూద్ర ధర్మములేవో యనువంశములను తెలిసికొంటిమి. రెడ్డివా రెన్నడేని శూద్ర జనోచితమగు దాస్యమునకుఁ బాల్పడినటులఁ జరిత్రముల నుండి గాని అనుభవమునుండిగాని నొక యాధారమునేని చూపింపఁగలమా వేద శాస్త్రానుకూల కర్మాచరణము గలిగినట్లు పేర్కొనంబడిన రెడ్డి జాతికిని శూద్రజాతికిని సంబంధమించుకేనియులేదు శూద్రులు వేదము వినకూడదనికలదు.

మల్లారెడ్డి వేదము నందలి మంత్రములను వేద విహిత శివపూజా ధర్మంబులఁ బెక్కింటిని తాను రచించిన గ్రంథములందుదాహరించి యున్నాఁడు. రెడ్డి వీరులు క్షాత్రంబుట్టిపడరణ రంగమున నధర్మవైరి వీరులఁజండాడిధర్మముల నుద్ధరించి మ్లేచ్ఛాప హృతాగ్రహా రాదికములు పునఃప్రతిష్ఠించి ధర్మ సంస్థాపనము నెరపిరి. ఈ విషయమన వేముని యుప్పుగల్లు శాసనము గాంచి యెఱుంగనగుగాని శుశ్రూషచేసి జీవించినట్లుకానుపింపదు.

శ్లో॥ స్త్రీణామనుపనీతానాం శూద్రాణాంచనరేశ్వర
స్థాపనేనాధికారోస్తి విష్ణోర్వాశంకరస్యచ
యశ్శూద్ర సంస్కృతం లింగం విష్ణుం వాపిన మేన్నరః
ఇహవాత్యంత దుఃఖ్ఖాని పశ్యత్యాముష్మికేకిము
శూద్రోవానుపనీతో వాస్త్రియోవాపతితోపివా
కేశవం వాశివంవాపి సృస్ట్వా నరకముచ్యతే ॥

అను శ్లోక భావములవలన శూద్రుడుఁశివకేశవులఁ బ్రతిష్ఠింపరాదనియు నొకవేళఁ బ్రతిష్ఠించినను అట్టివాఁడు నిహ మందత్యంత దుఃఖములకు భాజనుఁ డగుటయేగాక నరకము నందు గూలునని కదా! రెడ్డివీరులెందరో శివకేశవులం బ్రతిష్ఠించి యగ్రహారాదికము లొసంగినట్టుల నాయా దేవాలయముల యందలి శాసనములు దెలుపుచున్నవి. ఈ లక్షణములంబట్టి పురాణ స్మృతీతి హాసంబులలోఁజెప్పంబడిన శూద్ర జాతికి సూర్యచంద్ర వంశజులుగా వ్యవహరింపఁబడిన రెడ్డివారికి నెట్టి సంబంధము లేదు. రెడ్లనుదహరించు చోట చతుర్థవంశమున శూద్రజాతి కానేరదు. క్షత్రియ జాతిలోని యంతర్భాగము, శాస్త్రములంబట్టి వీరిని శూద్రులనరాదు. చతుర్థులకు శూద్రులకుఁ జాలా భేదము కలదు” అని సుప్రసిద్ధ చరిత్రకారులగు చిలుకూరి వీరభద్రరావుగారొకానొకచో వ్రాసియున్నారు. **“శౌర్యంతేజో ధృతిర్దాక్ష్యం యుద్ధేచాప్య పలాయనం దానమీశ్వర భావశ్చక్షాత్రంకర్మ స్వభావజం”** అను భగవద్గీతా శ్లోకము వలన క్షత్రియ ధర్మములు శూరత్వము తేజము, ధైర్యము, నిబ్బరము యుద్ధమున మారు మొగములేమి త్యాగము ప్రభులక్షణము పరాక్రమము ఇవి క్షత్ర ధర్మములని పై శ్లోక భావము సర్వ విధముల నిట్టి మహాలక్షణములు రెడ్డివీరుల యందిమిడియున్నవి పై నుదాహరించిన గుణకర్మలంబట్టియు వెనుకటి ప్రకరణములలో నుదాహరించిన సూర్యచంద్ర వంశ క్షత్రియ జాతి సంభవమును బట్టియు విమర్శ దృష్టితో ఁజూచితిమేని రెడ్డివారలు శూద్రులు కారు. క్షత్రియులేయని నిరూపింప సభ్యంతరముండదు. రెడ్డివారు స్వయముగాఁదాము సూర్యచంద్ర వంశ క్షత్రియులమని చెప్పుకొనుటయేగాక యజ్ఞయాగాదులాచరించినట్టుల శాసన బిరుదముల వలనను యజ్ఞయాగాదు లాచరించినట్టుల శాసన బిరుదముల వలనను యజ్ఞోపవీతాదులును ఋషిగోత్రములు నున్నట్లు రెడ్డిరాణి పత్రికయందలి నీ క్రింది వ్యాసము వలనను దెలియుచున్నది.

## నాగపుర ప్రాంతపు రెడ్లు

### చాందాcమధ్య పరగణాలు ౨-౫-౨౫

ఇచ్చట చాలా వరకు రెడ్లకు యజ్ఞోపవీతములు గలవు. మఱియు నైజాం సరిహద్దు రెడ్లతో సంబంధములు కలవు. సాధారణముగ నిచ్చటి రెడ్ల వృత్తి వ్యవసాయము అచ్చటచ్చట దేశముఖులును దేశ పాండ్యాలును మఖ్తేదార్లును గలరు. నవనాగరికతగల యువకులు ఉద్యోగములు చేయుట కూడకలదు. ఇచ్చటి రెడ్ల తెగలు నాకుc దెలిసినంత వరకు ఇవి పంటరెడ్డి భూరెడ్డి జన్నిదము రెడ్డి పోకరెడ్డి పాకనాటిరెడ్డి ఇలనాటి రెడ్డి వెలనాcడు రెడ్డి జన్నారెడ్డి

### గోత్రములు

| | |
|---|---|
| **పోకనాటి రెడ్డి** | **జనుపాల సుపాల దళపాల జన్నమ** |
| **పాకనాటి రెడ్డి** | **రెడ్డి భారద్వాజ శ్రీరామ శౌనక శ్రీవత్స** |
| **జన్నిదము రెడ్డి** | **శివనామ కౌశిక"** |

నిజాము రాష్ట్రములోని రెడ్డివీరులలోc గొందఱకు ఋషిగోత్రములు క్షత్రియోచిత రాజ్యపాలనాదులుండుట వలనను వీరిని క్షత్రియులనుటలో సాహసముండజాలదు. రెడ్లది నిజముగా శూద్ర జాతియేయైన యడల క్షత్రియులతో బాంధవ్యము లుండుటయు ఋషి గోత్రములతో వ్యవహరింపcబుటయు, వేదోక్తోపనయన కర్మాచరణమును సంగతములు కావు. ఇవియన్నియు వీరికిcగలవనుటకు నాధారములనిదివరకే చూపియున్నారము. రెడ్లకుcబూర్వము యజ్ఞోపవీతములున్న సంగతి యెల్లరకుc దెలియుటకై రాజమహేంద్రవరము సమీపమునందలి పాలకొల్లులోని క్షీరా రామేశ్వరస్వామి మహద్వార గోపురమందలి రెడ్డివీరుల రూపుపటము చిత్రించు చున్నారము.

రెడ్డివారు చతుర్థజాతివారనుటకుcగారణములనేకు లనేక విధములః జెప్పుచున్నారు.

ఉత్తరహిందూస్థానము నుండి ఆంధ్రదేశమునకుc బల్లవచోళచాళుక్య రాష్ట్రకూటులు, వచ్చిరిగాననిందు నాలుగవ తెగవారనుటకుcజతుర్ధజాతియని కొందఱు జైనబౌద్ధశైవ వైష్ణవ మతములలో నాలుగవ మతము వారగుటచే బహుజనులిట్లు చతుర్ధజాతియనcబడెనని కొందఱు.

శ్లో॥ వసిష్ఠకౌండిన్య ధనుంజయానాం గోత్రోద్భవాకాస్యప
గోత్రజాతాః శూద్రాఇవాత్యంతగృహీతవేషాఃభూపాభవి
ష్యంతి కలౌయుగేహి ॥

అను శ్లోకము వలన క్షత్రియులలో వశిష్ఠ కౌండిన్య ధనుంజయ కాశ్యప గోత్రజులు శూద్రాచారులై కలియుగమున వర్తించగలరని తెలియును, ఇందలి నాల్గవగోత్రము చోడులది. చోడులలో చంద్రాదిత్యుఁడను రేనాటిచోడుఁడు సూర్యవంశ క్షత్రియుఁడయిన కరికాలచోడుని వంశజుఁడనని చెప్పుకొనెను. ఇతఁడు కాస్యపగోత్రుఁడు సింహధ్వజుఁడు. సింహధ్వజము రాష్ట్రకూటల చిహ్నము. రేనాటిచోడులే రేనాటిరెడ్లకు మూలపురుషులు. రేనాటిరెడ్లది సింహధ్వజమే. కాశ్యపగోత్రము నాలుగవగోత్రము. ఈ గోత్రపు రాజన్యులు నాయకులుగాఁగల తెగనే చతుర్థజాతియని కొందఱును, రెడ్లనుదాహరించు చతుర్థపదము శూద్రజాతిపదము కాదనుటకు వ్యుత్పత్తులు సాధించియున్నారు. వీటిలో కాశ్యపగోత్రజులే నాయకులుగాఁగల తెగ చతుర్థులన్నదే సమంజసంబుగా నున్నది.

ఇందుచే రెడ్లను చెప్పు చతుర్థపదము శూద్రపదము కాదని స్పష్టపడును.

కాకతీయులు చతుర్థులని కొన్ని శాసనములు, సూర్యకులజులని కొన్ని శాసనములు గలవు.

చోళులు సూర్యవంశ క్షత్రియులనుట చరిత్ర ప్రసిద్ధముఁ చోళుల పూర్వుఁడగు కరికాలుఁడు కాకతీయులకు సయితము పూర్వుఁడయినట్లుపాకాల మొదలగు శాసనములందు గలదు నందుపాకాల శాసనము నీ క్రింద నుదాహరించుచున్నాము.

## పాఖాల శాసనము

1 స్వస్తిశ్రీ సజయతికలభము

2. ఖోయఃకటతటమదము

3. దితనినదగరు దనిలైః

4. పూరయతీకర్ణ శంఖంస్వభ
5. జననిరత జనసకలపేశ
6. లవిభూత్యై శ్రియందద్యాద్వరా
7. హోవఃసంధోర్య స్యోద్గతస్య
8. భూఃముహూర్త మకరోత్పోత్రే
9. లగ్నశైవల విభ్రమం ।
10. భూయాద్దక్షణ దాలలామ
11. జగతిర్ని ర్వేశధామత్రయస్త్రింశ
12. త్కోటితయాసతాంసుమనసా
13. మాయుష్యమే కౌషధం । ఆకాశ
14. వ్యపదేశ ధూర్జటిజటాలంకా
15. రగంగాపయుఃకల్లోలై కలకల్పితచ్ఛ
16. దనిభానందాయ చాంద్రీకలా త
17. న్మధ్యన్మహిరాజగజకేసరివిభ్ర
18. మంగణపత్యవ నీంద్రస్యశాస
19. నంచక్రవర్తినః । క్షీరాబ్ధిరుద్ధ
20. రోధఃకుహరమనిరతం దిక్షురం
21. గత్తరంగంత న్వానోయోగనిద్రామివ
22. . . . . . .
23. తన్నేత్రాత్పద్మమిత్రం సమజనిభు
24. వనద్వాంతజం బాలజృంభాగాధా
25. వష్టంభముష్టింధయకిరణఝ

26. రీసానుమాన్భానుమాలి మను

27. రభవదముష్మాదాదిమక్ష్మాప

28. తీనాంస్థిరనియమిత చాతుర్వర్ణ్య

29. ధర్మ వ్యవస్థః తత్త్రైవపునరం భోరా

30. శిభిర్జాతులోకేన ఖలుయదుపది

31. ష్టోలంఘ్యతేనీతిమార్గః పశ్చాత్తద్వం

32. శజగతిమశేషదనిత రక్ష్మాభృదిక్ష్వా

33. కుర్వ్యంవజ్రినావాస్త్రాద్దైత్యాది

34. వమసిలతయాజన్యజిహ్వాలబాహు

35. యాత్రాయాంయస్యధాటీచటు

36. లహయఘటా ధూళివారైరకారై

37. రప్యాసీచ్చక్రవాలంక్షితిభృదనుక

38. లంపాంసులోత్సంగశృంగః

39. తస్మిన్నజనిమాంధాత వంశేరాజ

40. మహోభుజః మామయందాస్యతీ

41. త్యుర్వీస్వీయం ( ) యస్యస్తనందీ

42. తద్వంశ్యానంశు మాలిగర ఇవ

43. సగరశ్చాత్రావానామధా సీ॥ న్నానీ

44. రైకాంగవీరా యితసఖవిలసత్ఖడ్గమే

45. ఘాంకురాశఃగర్భా దంభోనిధేఃక్ష్మాం

46. సకృదుదహరదిత్యాది కోలస్వ

47. యంయోభూభృద్వ్యస్తోమవా

48. తారయదకృతఘనస్వాంసలీలావ

49. తంసం అజనిజనని తస్మిన్
50. శైవలినీధరావితరణమణిశ్రేణి
51. నిశ్రేణిరూపతపోబలఃహరిదిభ
52. ఘటలానోద్గాఢ భ్రమప్రతి పాదనక్షమో
53. న్నతజయస్తంభః క్షోణీపతిసభగీర
54. థంకులేతస్మిన్నాసీదతుల బలశాలీదశరధః
55. సురస్త్రీసంగీతప్రస్పృమరభుజవిక్రమ
56. కధః మరుత్వత్ప్రీత్యైయోవ్యతనుతర
57. ణిశంబరంశిరఃకరోతిభిః
58. క్రోధికృతమిత పుటిమంబరతటిం
59. తస్మాత్త్రాతాత్రయాణాం సమజ
60. నిజగతాంజంగమ స్థావరాత్మంవ్యక్తా
61. త్మాసాధ్మలక్ష్మః కృతజగదమితాప
62. ద్విరామస్సరామః సింధౌ
63. గంత్రిపధం యోవ్యతను తప్ప
64. ఘనాసేతు నాయాతుధానాన్
65. అఖ్యాశేషానకార్షిత్క్రిమ పరమకరో
66. ద్యంతకాస్యేదశాస్యం ఉదభవద
67 ధభూతలైక వీరస్తద భిజనేకలి
68. కాలచోడదేవః ప్రణాతిషుచరణ న్ృ
69. పాయధీయౌ ద్విగుణ మవాదలయ
70. న్కిరీట భాగా సమజనికిలితత్కు
71. లేనరేంద్రంకులగిరి సాంద్రబుజోధదు

72. ర్జయాఖ్యః ప్రతితుటికిలయాం ప్రణ
73. మ్యభూమ్యాపదముల భంతసీ మా
74. త్కభూమి పాలcరాజస్తస్య విరా
75. సీత్పునరభిజననే జైత్రలక్ష్మీనివా
76. సోలక్ష్మీవాన్వా సప్రాదప్య (ద్య) హిత
77. గజఘటకేసరి ప్రోలరాజః
78. యస్యాజ్ఞాదైనిదత్తే పదమవ
79. నిభృతాంమూర్తి భిద్యంతిజైత్రస్తం
80. భాశ్శీతి జృంభమాణః ప్రతీహారి
81. దజరందిగ్గజ........... స్తుత్వా
82. లంసోపితస్మిన్నన్న జనికిల రుద్రదే
83. వక్షితీంద్రఃసాంద్రాంరాత్రా వివా
84. హన్యుపహంతితరాం చంద్రికాం
85. యస్యకీర్తిఃకించాస్ వాదశాశా
86. కుహర మహీరుహః ప్రేంఖదంశు
87. ప్రరాహ ప్రస్ఫూర్జ ద్వాదశాక్య వృతిక
88. రనిబిడ ప్రౌఢతాపః ప్రతాపః త
89. తత్సోదర్యసముద్రోత్తరలతరతర
90. ంగావలిధౌత సంక్రీడ ధ్వ్యాధ సే
91. నా సుభటజ నకటికానేమి సీమంతి
92. తాశః కృత్వాపృధ్వీం నిరస్తేతర ధరణిపతిశ్రేణి
93. ముక్తాతపత్రాంతన్నేకాతపత్రానుది
94. తనిజభుజే తామహాదేవరాజః

95. అథగణపతి దేవ స్తస్య పుత్రాం ధరిత్రీం ।

96. చిరమశీషాద శేష క్ష్మాభృతాం చక్రవర్తి

97. అవసమసధటేన ప్రౌడిమఖ్యేతి భా

98. నౌపదమ కృతతథాని సాస్వ్వరాజన్య

99. సత్తాకోలంకో భూన్మృగాంకోనవస

100. తికమలే శ్రీరితి శ్రీవరాహ ప్రాప్తో

101. నైషాప్రియ * * * * * *

222. శ్రీమత్కాకతి రాజవంశభజనఖ్యా

223. తాత్మవంశ క్రమః శ్లాఘా సంతతి

224. శాసనంకవయతాం యశ్చక్రవర్తి

225. వృతాత్ తస్మిన్ శ్రీజగదాళముమ్మ

225. డిరపాదస్యాం పురిప్రోన్నతం సౌ

227. ధంపరంచనివర్తనానిచసదాశిష్టా

228. నిసస్యశ్రియాః॥

229. ఈ శాసనము చెప్పినకవి చక్ర

230. వర్తులకు ముమ్మడయంగారు

231. ఇచ్చిన అయిదుమఱు

232. తులుస్వస్తి శ్రీ

శ్రీమహా విష్ణువునేత్రమగు సూర్యుని వంశమున మనువుఁ ఇక్ష్వాకువు మాంధాతసగరుఁడు భగీరథుఁడు దశరథుఁడు శ్రీరామచంద్రుఁడు కరికాలుఁడు దుర్జయుడు ప్రోలరాజు రుద్రదేవుఁడు మహా దేవరాజు గణపతిదేవుఁడు జనించిరను భావముగల యీ శాసనము, మఱికొన్ని ఇతర శాసనముల వలనను సువ్యక్తమగుటచే గాకతీయులు చోళులనుటలో సందేహము లేదు. కాకతీయ వంశసంభవుఁడు

మహాదేవరాజు కొమారుండగు మల్యాలగుండదండనాథుని భార్యవేయించిన వడ్డమాను శాసనములో గాకతీయులు చతుర్థులని కలదు. శివదేవమహాముని శాసనములో సూర్యవంశజులని కలదు. వీటినన్నిటిని సమన్వయించి చూచితిమేని నాల్గవ తెగవారను పదమునకే చతుర్థపదముపయోగించినట్లు గనుపట్టుచున్నదని పూర్వము జెప్పినదానికిది బలము నిచ్చుచున్నది.

వెలనాటి కులోత్తుంగచోడ గాంగేయ గొంకరాజు (మూడవగొంకరాజు) చతుర్థుండనిగలదు. వీనికి హైహయ వంశజుండగు గోనబుద్ధరాజు కూతురగు జయాంబిక భార్యయగుటచే వెలనాటివారలు క్షత్రియులెనిటగూడ వెలనాటిచోడుల యందు పయోగించిన చతుర్థపదము పూర్వోక్త విధమైన తెగకే కాని శూద్రపరము గాదు.

గణపతిదేవుండు తనబిడ్డను వెలనాటి చోళునకునిచ్చి నటులంగలదు తనకంటె కొద్దివానికిం దనబిడ్డనిచ్చుట వలను పడదుగాన వెలనాటి చోడులు క్షత్రియులనుటకిది రెండవయాధారము. వెలనాటి చోడులు క్షత్రియులనుటకిది రెండవయాధారము. వెలనాటి చోడుల యందుపయోగించిన చతుర్థపదము శూద్రపరము కాదనుటకు సయితమిది యాధారమే, కార్తవీర్యుని వంశ్యుండు పలనాటి వీరులలోని వాండును అగుననుగురాజు క్షత్రియుండు. ఇతండు వెలనాటి చోడుల బిడ్డయైన మైలాంబనుంబెండ్లి యాడుట వలన వెలనాటి చోడులు క్షత్రియులనుటకు సంశయములేదు వీరియందుపయోగించిన చతుర్థపదముపై తెగకు సంబంధించినవే కాని శూద్రపరము కాదనుటకు నిది మూడవ యుదాహరణము.

క్షత్రియువంశ మండనుండగు కాకతి గణపతి దేవరాజు తన కుమార్తెయగు గణపాంబను ధరణికోటరాజగు మహా మండలేశ్వర బేతరాజునకిచ్చి వివాహమొనర్చెను. గాన ధరణికోటవారలు క్షత్రియులే. ధరణికోట ప్రభువగు కోట కేతరాజు వెలనాటి చోడగొంకరాజునకు మేనల్లుండగుటచే వెలనాటిచోడులు క్షత్రియులే. వీరియందు పయోగించిన చతుర్థపదము శూద్రపరముకాదనుటకు ముందుంజెప్పిన తెగలకు సంబంధించినదనుటకిది నాల్గవయాధారము, ధరణికోట కేతరాజు వంశజుండగుగన్న భూపాలుండు చంద్రవంశజుండనియు నిదివరలో నుదాహరణ పూర్వకముగా వ్రాసి

యున్నారము. గన్న భూపాలుఁడుతన పుత్రికయగు సూరాంబికను పెదకోమటి వేమారెడ్డి కిచ్చి పెండ్లిచేయుటవలనను వేమారెడ్డి సూర్యవంశజుఁడని లోగడనుదాహరించిన తిరువళ్ళూరి శాసనములవలనను రెడ్డివారు క్షత్రియులనుటస్పష్టము. రెడ్డివారల యందుపయోగించిన చతుర్థపదము కూడ శూద్రపరముకాదనియు బూర్వోక్తమైన తెగలకు సంబంధించిన దనియుగ్రహించవలయు నిట్టి యాధారములు పెక్కులు గలవు. దిక్ప్రదర్శనముగాఁగొన్నిటిని మాత్రము నుదాహరించితిమి.

రెడ్డివారలు సూర్యచంద్ర వంశజులమనియు, రాష్ట్ర కూటులమనియుఁ జెప్పికొనిరి. యజ్ఞోపవీతములు తమకుండినట్లు తమ విగ్రహములకు యజ్ఞోపవీతములు జెక్కించుకొనిరి. యజ్ఞోపవీతములు దాల్చి బ్రహ్మకర్మానుసారులై మొన్నటిదాకను కొందఱు నేటిదాకనున్నారని యెఱుంగవలయు. మొన్న రాజకీయ రంగములందు గూడ రెడ్డిజాతి క్షత్రియజాతియని స్థిరపడినది. ఈ యంశము నీ క్రిందనుదాహరింతుము.

**చిత్తూరు జిల్లా వాయిల్‌పాడు తాలూకా వాయిల్‌పాడు గ్రామములోనున్న దేవాలయమున జరుగు మర్యాదల విషయమై రెడ్లకును వైశ్యులకును వివాదములు జరిగి రెడ్లు క్షత్రియులు గారనియు కాబట్టి వైశ్యులమగు మాకేముందు మర్యాదలు జరుగదగియున్నవనియు నిట్లు వివాదములు గలుఁగజేసికొని రచ్చలకెక్కి తుదకు రెడ్లమీద వైశ్యులు అభియోగము దెచ్చిరి. ఇట్టియభియోగము కోరట్లో రెడ్లు మొదలగువారు. క్షత్రియులని రెండవ మర్యాదను పొందుటకు వీరే తగియున్నారనియు జయార్థప్రకాశిక మూడవభాగము ప్రచ్ఛన్నరాజకుల నిర్ణయమను నీ గ్రంథమును బట్టియు మఱికొన్ని యితర గ్రంథములంబట్టియు నేటికి రెండు మాసముల క్రిందట తీర్పు చెప్పుట కలిగినది ఈ విషయము శ్రీ స్వామి భక్తానంద సరస్వతిగారి వల్లను మ.రా.రా. చింతలపాటి రఘునాథరెడ్డిగారు శ్రీవారిపేర వ్రాసిన యుత్తరముల వలననుఁ దెలియుటయైనది.**

ఇందులోని వాది ప్రతివాదులను గూర్చి సాధ్యమైనంతలో నీక్రింద వ్రాయుచు మిగత గ్రంథమంతయు మున్ముందుఁ బ్రకటించుచున్నాము.

| వాదులు | ప్రతివాదులు |
| --- | --- |
| పోలేపల్లి వేంకటరామయ్యసెట్టి | 1. చింతలపాటి నారాయణరెడ్డి |
| వగైరావైశ్యులు | 2. చింతలపాటి కృష్ణారెడ్డి |
| | 3. చింతలపాటి రఘనాధరెడ్డి |

జయార్ధప్రకాశికానుబంధము.

ఇంతియేగాక రెడ్డివారి ఆచార్యులు సయితము రెడ్డి వీరులు క్షత్రియులని వ్రాసి యిచ్చిన యభిప్రాయముల నీ క్రిందనుదాహరించుచున్నాము.

శ్రీమన్మహామహి మండలమండనాయమానంబగు నీయాంధ్రమండలంబున నమిత బాహుబల పరాక్రమతేజోవంతులయిపృథ్వీ పరిపాలనంబొనర్చిన ప్రఖ్యాత చారిత్రులలో రెడ్డిరాజుల గ్రస్థానంబలంకరించిరను విషయంబును చరిత్రలనెఱింగిన మహనీయుల కెల్లరకు విశదంబైయుండుటచే మఱల నా విషయమంతగాఁ జెప్పుటనవసరము. ఇట్టి ఉత్తమక్షత్రియులగు రెడ్డివంశములో వామనపాల గోత్రోద్భవులగు కోనాలవారున్ను చక్రపాల గోత్రోద్భవులైన ద్వారం పూడివారున్ను తామసపాల గోత్రోద్భవులైన సత్తివారు మొదలగువారనేకులు చిరకాలమునుండి మాశిష్యులైమమ్ములఁబూజించుచుండిరి. మేము సంచారార్థమై రుధిరోద్గారి సంవత్సరమాఘ శు 5 కుమారుటేరు పంచకములోఁ బ్రవేశించగా పైనుదాహరించిన మాశిష్యులు కొందఱు తమ ఆచారవ్యవహారాది ప్రక్రియలుగల కొన్ని గ్రంథరాజములను కర పత్రికలను విమర్శనార్థమై మా సన్నిధికి తీసికొని వచ్చినందున మాశక్త్యనుసారము విమర్శించి మదీయాశయము ప్రజాలోకముకు వెల్లడించుటయేమనఁగా వీరికి మేము చిరకాలము నుండి గురువులమై యుండుటచే వీరి పూర్వులకు మా పూర్వులును వీరికి మేమును వేదమంత్రములుఁపఠింపఁజేయు చుండుటచే మేము నూతనముగా వీరికి వేదోక్తార్హతఁదెచ్చి పెట్టవలసినంత అవసరముండదు. ఇక వీరి క్షత్రియత్వము విచారించి చూడవీరు సూర్యవంశ క్షత్రియోత్తములని అనేక శాసనములు శాస్త్రములు ద్ఘోషించుచుండుటయేగాక వీరి గుణ గణములంబట్టియు నాచారములంబట్టియుఁ జూచిన నెట్టిమూర్ఖుండయినను క్షత్రియులు కాదనబోరని మాయభిప్రాయము. ఇదియే

గాక వీరుత్తర హిందూస్థానము నుండి బయలుదేరుటకుఁ పూర్వము నుండియు వీరల పూర్వులచారిత్రమించుక జ్ఞప్తియుండుటచే వీరు సూర్యవంశపు క్షత్రియ సంజాతులని పలుకుట కెంతమాత్రము వెనుదీయజాలము. అనేక శాసన ప్రమాణములతో శ్రీమత్పరమహంసస్వామి, జి.యస్.బి.యను యతిశేఖరునిచే రచియింపఁబడిన ప్రచ్ఛన్న రాజకుల నిర్ణయమను గ్రంథరాజమును బట్టి చూచినచో సర్వము. విదితమగుచునేయున్నది. ఇదఃపరమదంతే వాసినాం వేదోక్తాశీర్వచన ప్రక్రియాభవంతు.

తణుకు తాలూకా చాగంటి బాసయ్యవార్లంగారి వీరభద్రయ్యగార్లు.
ఖండవెల్లి పోష్టు వ్రాలుకొత్త పల్లి అగ్రహారము.

## శ్రీమతే రామానుజాయనమః

మకాం మార్టేరు. రామానుజాయనమః యేడిదిసివారు సీతానగరం.

శ్లో॥ నిజవాఙ్మ ఘనర్ధళి తోరుమదప్రతివాది భయంకర భీకరార్యః ।
నినదత్య ఖిలాగ మసార మసారగురూత్తమ కేసరిరాట్ ।

శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యో భయవేదాంత ప్రవర్తకులైన శ్రీమాన్ శ్రీమత్తిరుమల పల్లేర్లమూడి రంగాచార్యులు అయ్యంగార్లవారి అభిప్రాయము.

మాతిరుమాళిఘ సంబంధులును, భగవద్భాగవతాచార్య కైంకర్య ప్రపన్నులున్ను మా ముఖ్య ప్రియశిష్యులునగు మార్టేరు పంచక పురనివాసులును భూమంచిరెడ్లును చక్రపాలగోత్రోద్భవులైన చిర్లవారగు మీయావన్మందిని మేము స్వమతానుసారముగా ననేక మంగళాశాసనములు కృపఁజేసి వ్రాసియిచ్చిన సన్మానపత్రిక.

ప్రస్తుతములో మేమిప్పుడు మీ గ్రామమునకు వేంచేసియుండగా మీరు క్షత్రియులనియు వేదోక్తార్హ తగలదనియు మీకాప్తులగు బంధువుల యొక్క ఆచార్యులు మొదలగువారు లిఖిత పూర్వకముగా నిచ్చిన కరపత్రికలున్ను మఱికొన్ని గ్రంథములున్ను మాసన్నిధినుంచి దేవరవారుకూడా మదీయ్యాచారములను ఈ గ్రంథములను పరిశీలించి

మాకందుకర్తవ్యతగల దేని తాము కూడా అందు కంగీరించినట్టుగా నొక పత్రికా పూర్వకముగా శ్రీముఖము సాయించవలసినదని కోరినందున మీరు తీసుకువచ్చిన ఆయా గ్రంథములను మాశక్తి కొలది పరిశీలించి చూడగలిఁగితిమి. మనమతోద్ధారకు లున్ను శ్రీ బాష్యకారులును భగవత్సమానులునగు శ్రీ మద్వేదేత్యాది శ్రీమాన్ రామానుజుల వారు మనవిశిష్టాద్వైతభాష్య ప్రతిష్ఠాపనము కృప చేసినది మొదలు మా మొదలగు దాసానదాసులకు స్వయమాచార్యత్వము కృపచేసి యున్నందునఁదత్ప్రభృతి మీ మొదలగు మా మీవంశములకు శిష్యాచార్య సంబంధము పారంపర్యాయముగ వచ్చుచున్నది. తత్ప్రభృతి నేటిపర్యంతరము మా పూర్వులు మీ పూర్వులకు మేము మీకున్ను ఆచార్య పురస్కరముగాఁ జేయఁదగిన ఉపదేశమంత్ర గ్రంథకాలక్షేపములు నాయావిధుల ననుసరించియే జరుపుచున్నాము. అనగా మీవారలకుఁపంచ సంస్కారత్వము కలుగజేసిన సమయములందు పదేశింపఁదగిన అష్టాక్షరీమంత్రమును వేదచోదితము గానుపదేశించుచుండటచే వేదోక్తార్థత వేరుగఁదెచ్చి పెట్టవలసినంత అవసరము కానరాదు. కాబట్టిమేము ఆయా ఆచార్యులిదివరలో మీ వారలకు నిచ్చిన కరపత్రికలను మీరిప్పుడు మాదగ్గరకుఁదీసికొనివచ్చిన గ్రంథరాజములనుఁబరిశీలించిచూడ భాగవతాజ్ఞోల్లంఘన చేయుటయున్ను మీరు తీసుకువచ్చిన గ్రంథములఁ బరిత్యాగముచేయుటయును మీయాచారతిరస్కారము బహులోపమని మాకుఁగూడతో చుటయేగాక మీరాచరించెడి ఆచరణయె బాగుగానున్నట్లు పూర్తిగా మదీయాశయంబగుటచే మేము కూడ అందుకంగీకరించి యీ మంగళా శాసనపత్రిక వ్రాసి మీకు సాయించడమైనది.

శ్రీమద్వేమార్గేత్యాది శ్రీమాన్ శ్రీమత్తిరుమల పల్లేర్లమూడి

రంగాచార్యులు అయ్యగార్లు

## శ్రీమతే రామానుజాయనమః

ఆర్యులారా

ది 14-2-1922

మేము సంచారము చేస్తు కృష్ణ జిల్లా మార్టేరు గ్రామములో మకాం చేసియుండగా మా శిష్యులు కట్టిపెదవెంకన్న యీ బాపయ్య కట్టిసూరయ్య మండబాపిరెడ్డి గొలుగూరిపెదసోరన్న, ద్వారంపూడి వెంకయ్యవర్మ, వగయిరాలు వారు అందఱు దిన 13-2-1922 సం౹౹ సోమవారము రాత్రి మా సన్నిధికి వచ్చి మేము క్షత్రియుల మనియు మాకువేదోక్తముగా ఆశీర్వచనము వగయిరాలు చేయవలసినదనియు నుడివిమాకుఁ గొన్ని గ్రంథములు చూపినారు. ఆ గ్రంథములనుబట్టి వారి ఆచారమును బట్టి చూడగా నా ప్రకారము మామనంబునకుఁదోచినందువల్ల వారికి వేదోక్త ప్రకారముగా ఆశీర్వచనము వగయిరాలు చేయుటకు మేమంగీకరించడమైనది.

నల్లాని చక్రవర్తుల నంబెరుమళ్ళాచార్యుల అయ్యవార్లంగారు మకాం నూజివీడు కృష్ణాజిల్లా.

## శ్రీరాములు

స్వగ్రామము
కొత్తపల్లి అగ్రహారము

ది. 23-2-1922
మకాంవెలగలేరు.

ఆర్యులారా, కృష్ణాజిల్లా నర్సాపురం తాలూకా వెలగలేరు గ్రామములో పిన్నమరాజు, బలరామయ్యగారి యింటివద్ద మేము మకాం సంచారము నిమిత్తము చేసియుండగా మా శిష్యుల,. పడాలవారు, ద్వారంపూడివారు, సత్తివారు, ఇందరితోను పడాల వెంకన్న కుమారుఁడు అమ్మిరెడ్డి వర్మ, 29-2-1922 సం౹౹ గురువారము మార్టేరు గ్రామ కాపురస్థులు వేలగల సుబ్బారెడ్డివర్మ, సత్తిసాంబారెడ్డివర్మ, వగయిరాలతో కలిసివచ్చి మా సన్నిధానంబున మేము క్షత్రియులమనియు వేదోక్త విధిగా ఆశీర్వచనము వగయిరాలు మా గురువుగారి వల్లను పొందియున్నామని నుడివిమాకుఁ గొన్ని వారి గురువుల వల్ల పొందిన కరపత్రదృష్టాంతము వగయిరాలు చూపినారు. వాటిని బట్టి వారి ఆచారమును బట్టి చూడగా మాకు నమ్మికతోచి వేదోక్త విధిని ఆశీర్వచనము చేయుటకు నంగీకరించడమైనది.

**ఇట్లు**

**చాగంటి భీమయ్య అయ్యగారు**

**తణుకు, తాలూక ఖండవెల్లి, పోష్టు : కొత్తపల్లి.**

శ్రీమతే రామానుజాయనమః

స్వగ్రామము రాఘవపురము

ది 25-1-1922
మకాం: మార్టేరు

**మహాశయులారా !**

కృష్ణాజిల్లా తణుకు తాలూక మార్టేరు గ్రామములో మాశిష్యుల కొఱకు వెళ్ళి గాదె వారి సత్రములో మకాం చేసి యుండగా మా ప్రియశిష్యులైన కట్టిబ్రహ్మయ్యవర్మ, వెంకన్నవర్మ, చిన్న అప్పల రెడ్డివర్మ, సత్యరెడ్డివర్మ, మొదలగువారలు దిన 24-1-1922 మంగళవారము మాసన్నిధికివచ్చి అయ్యా, మేముక్షత్రియులమనియు మాకు వేదోక్త ప్రకారమాశీర్వచనము వగయిరా చేయవలసియున్నదనియు నుడివిజయార్థ ప్రకాశిక మూడవభాగము ప్రచ్ఛన్న రాజకులనిర్ణయమును జయార్థప్రకాశికాను బంధము నిచ్చిరి. ఆగ్రంథములను మేము పరిశోధించి చూచుటయేగాక వారి ఆచారమును బట్టి నీపై గ్రంథములనుబట్టిన్ని వారికి వేదోక్తవిధి కర్హతగలదని మామదికిఁబట్టి నీపై గ్రంధములను బట్టిన్ని వారికి వేదోక్తవిధి కర్హతగలదని మామదికిఁదోచుటయేగాక జయార్థ ప్రకాశికాను బంధములో నింతకుఁబూర్వము శ్రీమద్వేద మార్గప్రతిష్ఠాపనాచార్యోభయ వేదాంత ప్రవర్తకులైన గుదిమెళ్ళ శ్రీమాన్ తిరుమల పెరుమాళ్ళాచార్యుల వారు వారి శిష్యులకు వేదోక్త ప్రకారము కార్యక్రమములు జరుపుచున్నట్లు వ్రాసియుండుటచే నా ప్రకారము మాకు నొక పత్రిక వ్రాసి యిచ్చి వేదోక్త ప్రకారముగా ఆశీర్వచనము వగయిరా చేసి యిటులనే మా సాంఘికులఁకు గూడ బోధించి వేదోక్త ప్రకారము కార్యక్రమములు జరుపవలసినదని మా శిష్యులగోరగా వేదోక్త ప్రకారము ఆశీర్వచనము వగయిరాచేసి యీ పత్రిక వారికి వ్రాసి యివ్వడమైనది.

ఇట్లు

నల్లాంచక్రవర్తుల నరసింహాచార్యుల అయ్యవార్లంగారు

25-1-1922 స్వగ్రామము రాఘవపురము ఏలూరు
తా॥ చింతలపూడి పోష్టు

సన్ ౧౩౪౩ హిజిరిలో నైజాంప్రసిడెన్సిలో బాబెహుకుమతునందు రెడ్లను దక్కను క్షత్రియులని న్యాయాధికారిచేత నిర్ణయింపఁబడినది, ఇట్లు రెడ్డిజాతి సక్షత్రియజాతియని వెల్లడియగుచుండ రెడ్డిజాతి శూద్రజాతియనుటయు నజ్ఞాన విజృంభితమే కాని మఱియొండుకాదు.

అనవేమారెడ్డి అఘమర్షణ స్నానమొనరించినట్టుల కాశీఖండము నందలి ఈ క్రింది పద్యముబోధించుటచే రెడ్డివీరులు క్షత్రియులనుటకు సందియముండదు.

సీ॥ త్ర్యంబకాచలకన్య కాంబూపురంబున
నఘమర్షణస్నానమాచరించి
నిద్దమైనమడుంగునీర్కావిధోవతి
కనక మేఖలతోడఁగటిఘటించి
మూలమంత్రాక్షరంబుల భూతిమంత్రించి
పుండ్రకంబులు ఫాలముధరించి
క్రొత్తముత్యములతో రుద్రాక్షమాలికా
నష్టోత్తరశతంబు నఱుత దాల్చి

పుండరీకాసనమునఁగూర్చుండిశంభు
నర్చనము సేయునపుడు మహాప్రమథుఁడు

చాలనొప్పారు తెండవ శంభునట్లు ॥
వీరనారాయణుఁడు రెడ్డివేమవిభుఁడు ॥

శా॥ చంచల్లీలహస్తకంకణమణిచ్ఛాయల్ పిసాళింపఁబూ
జించున్ వేమమహీవిభుండు నవరాజీవంబులన్ గల్వలన్
బ్రాంచత్కాంచన పుష్పకేసరములన్బ్రాసాదపంచాక్షరిన్
మంచున్ గొండయమంగు బెండ్లి కొడుకున్ మధ్యాహ్న కాలంబునన్ ॥

కాశీఖండము శ్రీనాథునిది

పై పద్యములయందు వేమ భూపాలుఁడు నిత్యము నఘమర్షణస్నానము పంచాక్షరిపూజజేయువాఁడని తెలుయును. పంచాక్షరిపూజ "ఓం నమశ్శివాయ" యనుప్రణవ పంచాక్షరి పదోచ్ఛారణాధికారము శూద్రులకు లేదు, కాన పంచాక్షరిజపము రెడ్డివీరుఁడుచేయుట క్షత్రియత్వమునకుఁ దార్కాణము. ఇక అఘమర్షమణస్నానము ఇది బ్రాహ్మణుఁడు క్షత్రియుఁడు చేయఁదగినవారు. శూద్రునకీ స్నానాధికారములేదు. "**సీ. సచ్ఛాత్రుఁడగుచు నిచ్చలు లేచియయ్యేటనఘమర్షణ స్నానమాచరించి**"అని ప్రవరాఖ్యుని అఘమర్షణ స్నానవిధి ప్రశంసింపఁబడినది అఘమర్షణస్నానము వరుణసూక్తములోని "హిరణ్యశృంగంవరుణం ప్రపద్యే" అను మంత్రాదిపఠనములో స్నానముచేయుట. ఈ స్నానము శూద్రునకు లేదు. రెడ్డివారి కెపుడఘమర్షణ స్నానమున్నటులఁ । జెప్పఁబడినదో అపుడు క్షత్రియులని విశ్వసింపక తప్పదు. ఇట్లు ప్రత్యక్షముగా క్షత్రియజాతియని తెలియుకులము గావున సమకాలికుఁడగు యెఱ్ఱాప్రెగడ అనవేమునికులము చతుర్థజాతియనుసందిగ్ధపదమువాడక క్షత్రియపద పర్యాయములగు రాజభూపాలపదములనే తన హరివంశముఁబ్రయోగించెను. కొండవీటి రెడ్డివీరుల యొక్క కొన్ని శాసనములలో వీరికులము "తస్మాత్కంన భిదఃవదాదు దభవద్వర్ణోగుణార్ణోనిధిః" అని నామ నిర్దేశములేక చెప్పఁబడెను. పలువురు రెడ్డివీరులను కవులు, గ్రంథాంతరములందు శాసనాదులయందు రెడ్డిపదము వాడక రాజపర్యాయనామములతోఁ బ్రశంసించిరి. స్త్రీలకుఁబూర్వ శాసనములలో "సాని" నామముపయోగింపఁబడెను. సంస్కృత శాసన గ్రంథములలో రెడ్డినామముపయోగింప నియ్యకొనన కొందఱుకవులు రెడ్డివీరుల నామాంతమున రెడ్డిపదమునకు బదులు క్షత్రియ పర్యాపదములు వాడిరి. ఇందుచేఁగొన్ని శాసనములు రెడ్లవని సాహసించి నిరూపింపవీలుకలుగదయ్యెను. రెడ్డివారు పదునాఱవశతాబ్దము వఱకు క్షత్రియులమని చెప్పుకొనుచు క్షత్రియులతో బాంధవ్యము గావించిరనియు నిప్పటికి నిశ్చయించుకొనఁ గలిగితిమి. ఈ రెడ్డి శాఖయందలి అంతశ్శాఖలు ఇన్ని శాఖలగుటకుఁ గారణములు ఇందితరవర్ణస్థులుకలియు వీలులేని హేతువులు ఈ జాతివారొక్కొక్క చోట సమృద్ధిగానుండుటకుఁగారణములు రాబోవు ప్రకరణమునఁబరిశీలించుదము.

**అయిదవ ప్రకరణము**

**సంపూర్ణము.**

శ్రీరస్తు

# రెడ్డికుల నిర్ణయ చంద్రిక

## ఆరవ ప్రకరణము

రెడ్డివారాంధ్ర దేశమునకు నాంధ్రభాషకుఁనాంధ్రులకు గావించిన సేవ అపారమైనది. శిల్పములనుద్ధరించిరి. మొక్కపోయిన యాంధ్రపరాక్రమమునకు మెఱుంగువెట్టి యాంధ్రజాతీయతనుంగాపాడిరి. శ్రీనాథుఁడు పట్టమెట్టసోమనాథకవి నిశ్శంకకొమ్మనామాత్యుడు కాణాదము పెద్దన సోమయాజి వెన్నెలకంటి సూరన ఎఱ్ఱాప్రగడ రాపాకలక్ష్మీపతిలోనగు ఆంధ్రమహాకవులు రెడ్డివీరుల పతాకచ్ఛాయల సుఖజీవనులై సారస్వతభిక్షా ప్రదాతలైరి. పెదకోమటి వేమారెడ్డి - కాటయవేముఁడు, కుమారగిరి కామినేనిమల్లారెడ్డి యెల్లారెడ్డి గద్వాలసోమభూపాలుఁడు, జనుంపల్లి అష్టభాషాగోపాలరెడ్డిలోనగు నృపాలురుకవులైవ్యాఖ్యాతలై భాషననేక విధముల నభ్యున్నతికిఁదెచ్చిరి. ఆ కాలమున నాంధ్రదేశమున గర్ణాటకమున రెడ్డివీరులు గట్టినదుర్గ రాజములగు కొండవీడు, అద్దంకి, కొండపల్లి, కంబముమెట్టు, కోరుకొండ, భువనగిరి, మెదకు, రాయచూరు, గద్వాల లోనగు దుర్గము లాంధ్రజాతీయతకును సరిహద్దుల వలెనలరి, దృశ్య ప్రపంచమును దన్మయమునుగావించుచున్నవి. రెడ్డి వీరులొసంగిన యగ్రహారాదికములచే నిప్పటికెన్ని కుటుంబములో సుఖజీవనమున నలరారుచున్నవి. శాస్త్రపురాణేతిహాసములయందుఁ బ్రమాణభావముంచవలయునను బ్రాహ్మణుల మాటల విశ్వసించి జాతీయ ధర్మములను నిలువంబెట్టినదీ రెడ్డి జాతి. ధర్మ సంరక్షణార్థముకత్తి బట్టి యాంధ్రాభ్యుదయార్థము రాజ్యద్రవ్యతను త్యాగములను జేసినదీ రెడ్డి జాతి. ధర్మసంస్థాపనార్థమై ఖండాంతరుల కత్తివాయికి మెడలొగ్గి పవిత్రక్షాత్రరక్తముచేనాంధ్రజాతీయలక్ష్మినభిషేకించిపునీతముగావించిసజీవనుజేసినదీ రెడ్డిజాతి. ఆంధ్ర దేశమును గర్ణాటమునునంతయు యవనవర్ధి నిమగ్నముగావింపనున్న ప్రకృతి నెదురించి పెక్కు సంవత్సరము లార్య ధర్మములుగా పాడి కాలవాహినిలో సమధి కైశ్వర్యములతో విలీనమైనదీ, రెడ్డిజాతి రెడ్డివీరులుత్తర హిందూస్థానము నుండి కర్ణాటము గోలకొండ దత్తమండలములలో నగునవి దర్శించుచు వేంగి దేశము వరకు

వచ్చుచు నెట నెట రాజ్య విప్లవములు గలుగుచుండెనో నచట స్వతంత్ర పతాకముల నెత్తుచు నాంధ్ర రాజన్య కుటుంబములతో సంబంధ బాంధవ్యములు నెరపుచు వచ్చుటచే వీరలనాంధ్రులని విశ్వసింపకతప్పదు. రెడ్డివీరులనామములు చరిత్ర ప్రపంచమున ననేక సంవత్సరముల నుండి విశ్రుతమగుచున్నది.

రాష్ట్ర కూటులే రెడ్లు, రెడ్లే రాష్ట్ర కూటులని యిదివరకే వ్రాసియున్నాము రెడ్డి శాఖీయులు చోళులతో, చాళుక్యులతో, విద్యానగర రాజులతో గాకతీయులతో బాంధవ్యములు నెరపిన పిమ్మట వేరు వేరు వంశములు శాకలు నిందు, బయలుదేరెను. ఎన్ని విధములుగా రెడ్డి శాఖలు బయలువెడలినను వీరి సంబంధ బాంధవ్యములు చంద్ర సూర్యవంశక్షత్రియులతోడనే జరిగెను. ఇతర జాతులు తమలో గలియకుండుటకై తొల్లిటి రెడ్డివీరులు చేసిన కట్టుబాటులు శ్లాఘా పాత్రముగానున్నవి ఏ సీమ యందున్న రెడ్డివారా సీమవారమని చెప్పుకొనిరి. ఇదివైదిక బ్రాహ్మణులలోని నాడీభేదమువంటిది. ఇటులనాడులంబట్టి సీమలను బట్టి వచ్చిన నామములు కొన్నియున్నను రెడ్లు క్షత్రియులనుటస్పష్టము.

వీరు తమ రెడ్డి శాఖలోఁగ్రొత్త వారుకలసి శాఖా సాంకర్యమొందకుండుటకు తెగ, లేక, సంఘము, గుంపు, అనుపేరుతో నంత శ్శాఖల నేర్పఱచుకొనిరి. శాఖ ఒకటియైనను ఒక సంఘమువారు మరొక సంఘమువారితో బాంధవ్యము చేయరు. సంఘమఁనగాఁబరిమితిగలకొన్ని కుటుంబములుగాన సుపరిచితముగా నుంటవలన సాంకర్యమున కవకాశముండదు. అందుచే రెడ్డిజాతిలో మిశ్రజాతులు కలువలేదనియే చెప్పవచ్చును. వీరలు యవనులాక్రమించి వర్ణాశ్రమధర్మముల కపకారము చేయకుండ దేశముగా పాడిరనుటకు దృష్టాంతము శాసనములోఁగలదు.

శ్లో॥ **వరాహవద్వారిధివారిమగ్నాంధరామశేషాంయవనోదరస్థాం**
**సముద్ధరన్ ప్రోలయనాయకేంద్రస్తతః ప్రతిష్ఠాపయతిస్మతద్వత్**
**తురుష్కైఃసమాక్రాంతాస్తే చాన్యే కాపభూభుజః**
**అగ్రహారాః పునర్దత్తా భూయోభువమభూషయత్ ॥**

ఇటులనే అనవేముని ఉప్పుగల్లు శాసనమునందు సయితము వ్రాయఁ

బడియున్నది. ధర్మ సంస్థాపనము కొఱకిటులఁబాటుపడిన రెడ్డివారు చరిత్రమును బట్టి చూచిన క్షత్రియులనుటకు సందియముండదు. రెడ్డి వారికిఁగొందఱకు ఋషిగోత్రములు కలవని లోగడ ప్రకరణములోఁ దెలిపియున్నాము. క్షత్రియులు వైశ్యులు పురోహిత గోత్రధారులుగా నుండఁదగుననియు, నొకవేళ బ్రాహ్మణుఁడు రాజైనచో నతఁడు సయితము పురోహిత గోత్రము చేతనే వ్యవహరింపఁబడవలయునను భావము గల నీక్రింది ధర్మశాస్త్ర వాక్యములు దెలుపుటచే రెడ్డివీరులు తమతొంటి క్షత్రియ ధర్మాచరణులుగా నుండఁదలంతురేని తమకు ఋషిగోత్రములు లేని వారలు పురోహితగోత్రములు ధరింప వచ్చును.

సూ ॥ క్షత్రియ వైశ్య యోరుపదిష్టాతిదిష్టగోత్రం ఉద్వాహతత్వే
అపిచ పురోహిత ప్రవరో రాజ్ఞాం" ఇత్యాశ్వలాయన
శ్రౌతసూత్రం ౧౨- ౧౫
కించపురోహితస్య ప్రవరేణ రాజాప్రవృణీతం ఇతి
విజ్ఞాయతే. ఇత్యాపస్తంబ ప్రవరకాండం ౧౧

వ్యాఖ్య ॥ పురం ఏనం దధాతి పురోహితః క్షత్రియోర్ద్వార్విహోమికః
అభిజన విద్యావృత్తసహితః తస్యప్రవరేణరాజాఅభిషిక్త :
ప్రవృణీత బ్రాహ్మణోపిరాజ్యాం ప్రాప్తః పురోహిత ప్రవరేణ
ప్రవృణీతే" సూత్రప్రవర వ్యాఖ్య

సూర్యవంశ క్షత్రియులకుఁ బండ్రెండు గోత్రములు చంద్రవంశ క్షత్రియులకు నిరువదియైదు గోత్రములున్నటుల స్కాందమునందలి సహ్యాద్రిఖండమున నిట్లు చెప్పఁ బడెను.

శ్లో ॥ సూర్య వంశోద్భవానాం హిగోత్రాణిద్వాదశైవహి
పంచవింశతి సోమానాం గోత్రాణి మునిరబ్రవీత్

శ్లో॥ భారద్వాజఃపూతమాక్షో వశిష్ఠః కస్యపస్తథా
హారీతో వృద్ధవిష్ణుశ్చ తథాబ్రహ్మా జనార్దనః
సౌబలఃకౌటిమశ్చైవ మాండవ్యఃకౌశికస్తథా
విశ్వామిత్రఋషిశ్రేష్ఠో ద్వాదశైతే ప్రకీర్తితాః

హారీతకు శ్రీవత్సయనియు జనార్ధనకు ధనుంజయ యని పాఠాంతరము లున్నటులఁగొందఱు చెప్పుదరు.

చిరకాలము నుండి వేదాచారములఁ దొలంగినరెడ్డివారు తమతొంటి క్షత్రియత్వము బడసి యజ్ఞోపవీతాదులు ధరించి క్షత్రియ ధర్మములతోఁబాటు క్షత్రియోచిత వైదిక కర్మలను ఆచరణములోనికిఁ దేవచ్చును. గుణకర్మలచేత జాతివిభాగమేర్పడినటుల స్పష్టపడినది రెడ్డివీరు లాకాలమున క్షత్రియులె ఇందులకు శాసనాది సాక్ష్యములు గలవు. వీరు వ్యవహరించుకొను చతుర్థపదము పూర్వోక్తార్థమును బట్టి క్షత్రియ జాతి పర్యాయమే. కాని శూద్రజాతి పర్యాయము కాదు. వీరలలో యజ్ఞోపవీత ధారణాదికము వేదాచారాదికములు క్రీ.శ ౧౬౮౦ వఱకున్నవి. బహుకాలము, వేదాచారము దొరంగి జైన బౌద్ధాదిమతములననుసరించిన జాతులు పూర్వాను వేద కర్మోచితమగు బ్రహ్మత్వము క్షత్రియత్వము బొందినటుల దేశచరిత్రముల వలనఁదెలియును. బ్రాహ్మణునకు బదులునాలుగు సంవత్సరముల వఱకు క్షత్రియునకు నిరువదినాల్గు సంవత్సరముల నుపనయన విధిజరుగకున్న యెడల వ్రాత్యుఁడ నంబడును. ఇట్టివ్రాత్యదోషము వ్రాత్యస్తోమయజ్ఞముగావించినచో నివారణమగును. పిమ్మట యజ్ఞోపవీతము ధరింపవచ్చునని విజ్ఞులు నిశ్చయించినారు. ఇందును గూర్చి మన శాస్త్రములు చెప్పునంశమును గూడఁదెలిసి కొనుట కర్తవ్యము.

**"త్రిపురుషం పతిత సావిత్రీకాణాం అపత్యేసంస్కారో నాధ్యాపనంచ"**

ఈ సూత్రము మూడు పురుషాంతరములుపనయనాది సంస్కారములులేని వారికి వేదాధి కారముండదని చెప్పుచున్నది.

**"తేషాంసంస్కారేప్సు వ్రాత్యస్తోమే నేష్ట్వా కౌమమధీయీరన్**
**వ్యవహార్యాభవంతీతి వచనాత్ వ్రాత్యస్తోమే నేష్ట్వాత్రైవిద్య**
**వృత్తింసమాతిష్ఠేయుః తేషాంతతుర్ధ్వం భుంజీతయా జయేచ్చైతాన్**

ఈ విధముగా శ్రుతిస్మృతులు వ్రాత్యస్తోమానంతరము యజ్ఞోపవీత ధారణమను కూలించుచున్నవి. కాత్యాయన సూత్రములు మాత్రము అల్ప ప్రాయశ్చిత్తములతోను పనయనాదుల నొనరింపవచ్చునని విధించుచున్నవి. ఇఁకనాపస్తంబుఁడీవిషయంబున నేమి చెప్పెనో తెలిసికొందము.

**"తస్మాదస్యప్రపితా మహాదేర్నానుస్మర్యతే**
**ఉపనయనం తేషాం త్రైవిద్యకం బ్రహ్మాచర్యంచరేత్**
**అధోపనయనం- - "**

**అపస్తంబవచనము.**

మూఁడు పురుషాంతరములలోనే వంశమునందేని ఉపనయనము లేకున్నచో బ్రహ్మాచర్య దీక్షాసహితముగానుపనయనముగావింపగునని యాపస్తంబులు సెలవిచ్చిరి. వ్రాత్యస్తోమము చేసిఎన్ని తరములుపనయనాదులు లేనివాఁడుపూతుఁడయి యజ్ఞోపవీతము ధరించి వైదిక కర్మలుగావింప నర్హుఁడు కావున వ్రాత్యస్తోమాదులచే నుపనయనములు చేయించి రెడ్డివారిని క్షత్రియ విధులనవలంబింపఁజేయనగును.

ఇటులఁబూర్వులెవరేని ప్రచ్ఛన్న క్షత్రియులొనరించి క్షత్రియత్వము ఒడసి రాయను నంశమును విమర్శించితిమేని శివాజి చక్రవర్తి దృష్టాంతము కాగలడు.

శివాజి చక్రవర్తి తననలువది రెండవయేట నిరువురుకుమారులు గలిఁగిన పిమ్మట నొక పరిషత్తు నేర్పరచి షట్శాస్త్రవిదుఁడును, చతుర్వేదపారంగతుఁడునగు కాశీగాగాభట్టులోనగు మహా విద్యాంసుల యభిప్రాయనుసారముగ వ్రాత్యస్తోమ ముగావించి యజ్ఞోపవీతము ధరించినటుల శివాజి చరిత్రమున కీర్తి శేషులయిన కే.వి. లక్ష్మణరావు ఏంఏ గారు వ్రాసియున్నారు. విస్తరమందుఁజూడనగు" శౌర్యంతేజో ధృతిర్దాక్ష్యం యుద్ధేచాప్యపలాయనం దానమీశ్వరభావశ్చ క్షాత్రంకర్మ స్వభావజం" అని క్షత్రియ ధర్మములు మనపెద్దలు నిశ్చయించిరి. గుణముల చేతఁగాక జాతిచేతఁ గూడ రెడ్డివారు క్షత్రియులని తెలియునపుడు వ్రాత్యస్తోమాదులొనర్చిన శాస్త్రీయముగా యజ్ఞోపవీతములు ధరించి వేదోక్తమగు క్షత్రియధర్మనవలంబించుటలో నధికార మొసంగవలసిన భారము విద్వాంసులపై నున్నది. స్థానాంతర నివాసాదికములచే శాఖోపశాఖలుగా నున్నను రెడ్డికుల మంతయు నొకటి యేయని చెప్పవచ్చును. రెడ్డి శాఖలతో నున్నను ప్రత్యేకజాతిగనే వ్యవహరింపఁబడినటుల శాసనాధారములు గలవు.

**"ఆంధ్రదేశరాజ్యరక్షగుణ (రాచగుడి) ర్విరోధివనదావనః**
**రెడ్డికుల కౌలపల్లవరాయ ఇదిప్రాయశోఖ్యాః**

**రాజ రాజు ముద్దునూరి శాసనము**

ఇటులనే రెడ్డిశాఖ చిరకాలము నుండి ప్రత్యేక వ్యక్తిత్వముతోఁబేరొందెననుటకు నెన్నియో యాధారములు చూపనగును. కొన్ని శాసనములలో రెడ్డిపదమునకుఁ బర్యాయపదముగా నామాంతమున రాజపదము వాడంబడినది. ఇది సర్వత్రరెడ్డి వారి సంస్కృత శాసనములలోఁ గాననగును. రెడ్డి వారిలో ఁగూటస్థులు కొందరు రాజపదవాచ్యులుగా గానవత్తురు. వీరును వ్యవహారమున రెడ్డిపదము గలవారుగానెయుందురు. ఈ రెడ్డివారు కేవల పరిపాలకులు గానుండుటచేతనే గ్రామపాలకుని రెడ్డియని నతని ధర్మము రెడ్డికమని మనవారు వ్యవహరించిరి.

భాషా ప్రపంచమునందు రెడ్లవలె రెడ్డిపదము గూడ గౌరవ పాత్రముగ వ్యవహరింపబడినది. క్షత్రియచూడామణులగు రెడ్డివీరులు జాతీయసూచకమగు రెడ్డిపదము బుద్ధిపూర్వకముగా వదలి కర్ణాటక దేశము నందలి రాజపదపర్యాయ శబ్దమగు రావు పదముతో వ్యవహరింపఁబడుచున్నారు.

శత్రుసంహార శతకమున నొక పూర్వ కవిదేవునినె రెడ్డిపద విశేషణ వాచ్యునిగా నభివర్ణించెను. కవి ఆ పద్యమునఁ బ్రభు సూచకమగు రెడ్డి పదమును దేవునికి నుపయోగించి రెడ్లయెడఁ గృతజ్ఞుఁడయ్యెనని తెలిసికొనవలయును.

**సీ॥ ములలపై పెద్దహోబలము సింగారెడ్డి మంగళగిరికోట మరుగురెడ్డి**
**పొలుపొందుమారకాపురము చెన్నారెడ్డిరంజిల్లునుదయాద్రిరామిరెడ్డి**
**వెలయతిరువళ్ళూరు వీర రాఘవరెడ్డి వన్నెవాసుల కంచివరదరెడ్డి**
**నీటుకెక్కినగండికోట మాధవరెడ్డి తగుతాటిపర్తి చింతాలరెడ్డి**

**గీ॥ చేయుకాపుదనమ్ములచేతనీకుఁ-గోర్కెబుట్టెనొ తిరుమలకొండరెడ్డి**
**మగతనము మానికా పైన నగవుగాదె !**

**శత్రుసంహార వేంకటాచలవిహార**

ఈ పద్యమందలి రెడ్డిపదమా యాక్షేత్రస్వాములగు వేల్పులకే పర్యాయపదమైనది. రెడ్డిజాతి యాంధ్రుల గౌరవమునెటులఁజూరగొన్నది తెలియగలదు. రెడ్డివీరుల శాసనము లింకనెన్నియో పరిశీలింపఁబడవలసియున్నది. అపుడుగాని సమగ్రమగు రెడ్డివీరుల జీవితము ప్రకటింపవీలుగలుగదు. రెడ్డి వారిని గూర్చి చిలుకూరి వీరభద్రరావు పంతులు

వారు రాష్ట్రకూటులె రెడ్లనియు వీరిని క్షత్రియులుగాఁ బరిగణింపవలసినది గాని శూద్రులుగా ఁబరిగణించుట శాస్త్ర విరుద్ధమని వ్రాసిరి.

కడప మండలములోని చోడులు 700 గ్రామము గలిగినరేనాడు పాలించుచుఁ దాముకరికాల చోడుని వంశజులమని చెప్పుకొనిరి. వీరు సింహలాంఛనులు. బస్తరులోని చక్రకోట్యము పాలించిన ధారావర్షుని సామంతుఁడు చంద్రాదిత్యుఁడు కరికాలచోడుఁడు సూర్యవంశజులు. కాశ్యపగోత్రులు సింహలాంఛనులు. రేనాటిరెడ్లు సయితము సింహలాంఛనులగుటచే బైనుదాహరించిన చోడల సంబంధ బాంధవ్య మొనరించితుదకు సింహలాంఛనులమని చెప్పికొనిరి కాబోలు. రెడ్డివారిలో చోడవారనునొక తెగవారు కలరించుచే రెడ్డివారు పూర్వోక్త ప్రకారము చోడుల సంబంధమొనరించి చోడవారమని వ్యవహరించుకొని సటులఁదెలియుచున్నది. దీనివలన స్పష్టపడినది యేమనగా రెడ్డి వారలు సుక్షత్రియులయినందుననే సూర్యవంశజులకు చోళులు సంబంధ బాంధవ్యములు విరివిగా సలిపిరనుట నిశ్చయమైనది. ఇటులనె పల్లవులతో సంబంధ మొనరించి పల్లవాదిత్యయను బిరుదము వహించి రనుటకుఁగొండవీటి రెడ్లు కొందఱు పల్లవాదిత్య బిరుదాంకులుండుటయె నిందుల కాధారము. ఇట్లెన్ని విధములనో చరిత్రప్రశస్తి గడించి యాంధ్ర దేశమునందంతటను సుప్రసిద్ధమైయున్నరెడ్డిశాఖ క్షత్రియశాఖయనుటకు పలబ్ధాధారములతో నీ గ్రంథమును స్వల్పజ్ఞానముతో నెటులో ముగింప గలిగితిమి.

## ఉపసంహారము

ఆంధ్రభాషా చరిత్రమున నాంధ్రదేశ చరిత్రమునరెడ్డి తెగ ప్రత్యేక స్థానము వహింపఁగలదు. వీరు క్షత్రియులని వివిధాధారములచే, నిర్ధారణము చేయుటచే సోదరాంధ్రులు రెడ్డి వారిని క్షత్రియులనుటలో సంశయింపరని మా విశ్వాసము. రెడ్డివారిలో సంస్థానాధీశులు, భూస్వాములు, (దేశముఖులు) న్యాయాధికారులు, పటేండ్లు వర్తకులు, ధనవంతులు, సారస్వత మాధుర్యము చవిఁజూపఁగలకవులు, సాహిత్య చక్రవర్తులగు పండితులు, త్యాగమూర్తులగు దేశభక్తులు, విమర్శక శిరోమణులు పలువురు కలరు. సంఘోద్ధరణ శక్తి ఒకని యందు లేదు. సమర్థులగు రెడ్డి సోదరు లందఱిపైఁ గలదు. కవులు రెడ్డివీరుల జీవితములు గానముచేయ వలసియున్నది. చరిత్రకారులు రెడ్డికవుల ప్రత్యేక జీవితములతో సంపుటములు నింపవలసియున్నది. పరిశోధకులు రెడ్డిరాజుల శాసనములు కృత్యాదులు సమన్వయించి సమగ్ర చరిత్రము లిఖింపవలసి

యున్నది. త్యాగమూర్తులు రెడ్డి కవులు వ్రాసిన గ్రంథములు సవిమర్శనముగాఁ బ్రకటింప వలసి యున్నది. చిత్రకారులు రెడ్డి వీరుల నాటి దృశ్యములఁ జిత్తరువులుగాఁ జేయవలసియున్నది. భిన్నభిన్న విషయ పరిజ్ఞానము గల రెడ్డి సోదర మహాశయులీ యంశములలోఁ దమ జీవితము నుపయోగించెదరేని సమగ్రమగు రెడ్డిచరిత్రము భాషా సతికి లభించును. ఇదియంతయు ధనవంతులు త్యాగమూర్తులునగు రెడ్డి మహాశయుల చేతిలో నున్నది. రెడ్డి రాజుల సంస్థానములు నిజాము రాష్ట్రమునందే విశేషముగఁ గలవు. ఈ సంస్థాన ప్రభువులుసమగ్రములగు నాధారములతో ఁ దమ సంస్థాన చరిత్రములు సచిత్రముగా బ్రచురించి తమ పూర్వులు బాంధవులు ఆస్థాన కవులు వ్రాసిన గ్రంథముల బునరుద్ధరించి నిజ జాతీయ ధర్మమును బ్రకటించి ఆంధ్రభారతి నలంకరించుట ధర్మమనియు నికనైనదాముత్తమ క్షత్రియులమని తలంచి సమగ్రవాఙ్మయ భాగము నలంకరించుట కర్తవ్యమని రెడ్డివీరుల చెంత సవినయముగ గోరుచు క్షత్రియకుల దర్పణమను నామాంతరముగల రెడ్డికుల నిర్ణయ చంద్రిక యను, నీ గ్రంథము ముగించుచున్నారము. ఈ యుత్తమ జాతిభాషకు దేశమునకు నొనరించిన మహత్తర సేవకు జ్ఞాపకార్థ మీ గ్రంథము వ్రాసి కృతార్థులమైతిమి.

**స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం**
**న్యాయేణ మార్గేణ మహీంమహీశాః ।**
**గోబ్రాహ్మణే భ్యశ్శుభమస్తునిత్యం**
**లోకాస్సమస్తాస్సుఖినోభవంతు ॥**

**ఆరవ ప్రకరణము**

సంపూర్ణము.


A C No 18801

# విజ్ఞాన సరోవర ప్రచురణలు

విజ్ఞాన సరోవర ప్రచురణల సంస్థ నిరుపేద విద్యార్థులకు సహకరించడమే గాక, ఎన్నో సేవా కార్యక్రమాలు నిర్వహిస్తున్నది. అంతేగాక, ప్రచురణల ద్వారా ప్రజల్లోకి ఉత్తమ భావజాలం తీసుకొని వెళ్ళే ప్రయత్నంలో ఈ సంస్థ క్రింది పుస్తకాలను అందిస్తున్నది.

1. రెడ్డిరాజ్య సర్వస్వం - శ్రీ బి.ఎన్. శాస్త్రి
2. వేమన నిత్య సత్యాలు - కేసెట్, వ్యాఖ్యాన సహితం<br>శ్రీ జి.వి. ప్రభాకర్
3. వేమన త్రిశతి - తాత్పర్య సహితం<br>కూర్పు: డా॥ కసిరెడ్డి
4. కృషీవలుడు - తాత్పర్య సహితం<br>మూలం : శ్రీ దువ్వూరి రామిరెడ్డి<br>వ్యాఖ్యానం : ప్రొ॥ పి. యశోదారెడ్డి
5. కాపుబిడ్డ - తాత్పర్య సహితం<br>మూలం : శ్రీ గంగుల శాయిరెడ్డి<br>వ్యాఖ్యానం : డా॥ కసిరెడ్డి
6. ముసలమ్మ మరణం - తాత్పర్య సహితం<br>మూలం : శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి<br>వ్యాఖ్యానం : ఆచార్య ఎల్లూరి శివారెడ్డి
7. వేదార్థ ప్రక్రియలు - డా॥ వేదాలంకారో గోపాల్‌రెడ్డి
8. గోలకొండ కవుల సంచిక - శ్రీ సురవరం ప్రతాపరెడ్డి
9. కళాతపస్వి పి.టి. రెడ్డి (జీవిత విశేషాలు) - డా॥ కసిరెడ్డి
10. రెడ్డికుల నిర్ణయచంద్రిక - శ్రీమాన్ శేషాద్రి రమణకవులు<br>శ్రీమాన్ పెద్దమందడి వేంకటకృష్ణకవి



**కొండా లక్ష్మీకాంతరెడ్డి**
విజ్ఞాన సరోవర ప్రచురణలు
ఫ్లాట్ నెం.103, 2వ అంతస్తు, 2-2-18/31/సి
సాయికృష్ణ నిలయం, దుర్గాబాయి దేశ్‌ముఖ్ కాలనీ
హైదరాబాద్ - 500 013. ఆంధ్రప్రదేశ్ - ఇండియా.
ఫోన్ నెం : 27427920